


# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*MONDAY, 26th SEPTEMBER, 1955*

VOLUME IX — No. 1

CONTENTS



PRINTED BY JYOTHI PRESS, TENALI.
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS, KURNOOL.

1957

PRICE: SIX ANNAS

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

*Monday, the 26th September 1955*

The House met in the Assembly Hall Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. SRI R. LAKSHMI NARASIMHAM DORA) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### Starred Questions

MR. SPEAKER:— Questions Nos. 432 and 433 will be taken up together.

*SISMA Formula.*

432—

* 83 Q.—SRI S. VEMAYYA:— Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government apply 'Sisma' Formula for the year 1954-55; and

(b) what are the factory managements which failed to implement it for the year 1953-54?

THE HON. SRI B. GOPALAREDDI:—

(a) The 'SISMA' Formula is not derived under any statutory provision and the Government have therefore no power to enforce it. The formula can be adopted only by voluntary agreement between the factory owners on the one hand and the cane suppliers concerned on the other.

(b) While the Visakhapatnam Sugars and Refineries Limited (Thummapala) the Andhra Sugars Limited (Tanuku) and the K. C. P. Limited (Vuyyur) did not at all implement the 'SISMA' formula, the following factories implemented to a certain extent the formula in regard to the cane supplies received by them during 1953-54 season:—

1. Sree Rama Sugars and Industries Limited, Seethanagaram;
2. Sree Rama Sugars and Industries Limited, Bobbili;
3. Etikoppaka Co-operative Agriculture and Industrial Society Darlapudi;
4. Deccan Sugars and Abkari and Company Limited Samalkota;
5. Kirlampudi Sugars Limited, Pithapuram.

*Payment of bonus to sugarcane growing ryots.*

433—

* 831 Q—Sir V. VISWESWARA RAO :—Will the Hon. the Chief Minister be Pleased to state—

(a) the number and names of sugar mills that have paid the bonus for 1952–53 and 1953–54 to the sugarcane growing ryots as per the 'Sisma' Formula;

(b) the amount in various factories that is still pending disbursement; and

(c) the steps that the Government are taking to see that the mill-owners implement this formula for 1953–54?

THE HON. SRI B. GOPALAREDDI:—
(a) and (b) : A statement * is laid on the table of the House.

(c) : The SISMA FORMULA is not derived under any statutory provision and the Government have therefore no power to enforce it. The Government have however used their good offices to persuade the factory owners to abide by the formula.

SRI S. VEMAYYA:— టేబిలుమీద పెట్టిన దానినిబట్టి Andhra Sugar Mills Limited, Tanuku, Visakhapatnam Sugar & Refinery Limited వాళ్ళు ఇవ్వడంలేదని తెలుస్తోంది. అధికారులు ద్వారా pursue చేసి ఇప్పించడానికి ప్రభుత్వం చూస్తోంది అన్నారు. ఏ అధికారులద్వారా ఈ విషయంలో pursue చేసినారో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI B. GOPALAREDDI:—Sugar Cane Commissioner ద్వారా.

SRI B. SANKARAIAH :— టేబిలుమీద పెట్టినదానిలో 3 లక్షల రూపాయిలవరకు ఇవ్వవలసినట్లు ఇచ్చిఉన్నారు. Balance of amount still payable to cane suppliers according to Sisma formula క్రింద పెద్దమొత్తాలే pay చేయకుండా ఉన్నట్లు తెలుస్తోంది. ప్రభుత్వం దానిని pay చేయించడానికి ఏమిచర్యలు తీసుకున్నారు ? ఇక ముందు ఏమి చర్యలు తీసుకుంటారు ?

SRI R. B. RAMAKRISHNA RAJU:— May I know what the 'SISMA' formula is ?

* (Vide appendix at page )

[26th September 1955

THE HON. SRI B. GOPALAREDDI:— The formula is that cane growers must get bonus when the prices are high.

THE HON. SRI B. GOPALA REDDI:— దీనిని చట్టప్రకారంగా నిర్బంధం చేయడానికి వీలులేకుండా ఉన్నది. నైతిక బలం ఉపయోగించి ప్రోత్సహించవలసిందే కాని చట్టప్రకారంచేయడానికి వీలులేకుండా ఉన్నది. ఈవిషయంలో Government of India వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాము. వాళ్లు కూడా ఇది నైతిక బలం చేతనే ప్రోత్సహించాలని చెప్పారు. చట్టప్రకారంగా చేయడానికిలేదు. చట్టప్రకారం ధరలు మేము నిర్ణయిస్తున్నాము. అంతకుమించి ఏమి చేయలేకుండా ఉన్నామని ఢిల్లీ అధికారులు చెబుతున్నారు.

SRI P. SUNDARAYYA:— మంత్రిగారు ఇచ్చిన సమాధానంలో శ్రీరామా సుగర్ మిల్స్, సీతానగరం, బొబ్బిలి, ఏటికొప్పాక, సామర్లకోట వాళ్లు రైతులకు ఇవ్వవలసిన డబ్బును ఇచ్చారని చెప్పారు. టేబిలుమీద పెట్టినదానిలో బొబ్బిలి, సీతానగరం, ఏటికొప్పాక, పిఠాపురం మిల్లులు ఏమి ఇవ్వలేదని 1953-54 కు ఇంకా ఇవ్వవలసి ఉన్నదని చెప్పారు. ఈ రకంగా పరస్పర విరుద్ధమైన సమాధానానికి కారణం ఏమిటి? ఈ సమాధానాలను అచ్చువేసిన తరువాత ఏమైనా ఇచ్చారా?

The Hon. Sri B. GOPALA REDDI:—ఒకటి 1953-54 కు, మరొకటి 1952-53 కు వేరుగా సమాధానము ఇచ్చాము.

SRI P. SUNDARAYYA : 1952-53లో రెండు, మూడు ఇవ్వవలసినచోట రు. 1000లు ఇచ్చారు అనుకోండి. లక్షలు ఇవ్వవలసినచోట మానేశారు. ఇరువురు ఒడంబడికకు వచ్చిన తరువాత legal గా enforce చేయడానికి అవకాశాలు లేవా?

THE HON. SRI B. GOPALAREDDI :— లేవు.

SRI P. SUNDARAYYA :— గవర్నమెంటు అడ్వకేటు enforce చేయడానికి వీలులేదని అన్నారా?

THE HON. SRI B. GOPALA REDDI :— అవును.

SRI P. SUNDARAYYA :— Factory Act ప్రకారంగాని కంపెనీ చట్టం ప్రకారం గాని గవర్నమెంటు జోక్యంకలిగించుకుని అవసరమయితే వేరేచట్టం తీసుకు రావడానికి రాష్ట్రప్రభుత్వానికి ఏమైనా అభ్యంతరాలు ఉన్నాయా?

THE HON. SRI B. GOPALA REDDI:ధరలనిర్ణయం Government of India వారు చేస్తారు. లాభాలు వచ్చినప్పుడు, చక్కెర ధరలు బాగాఉంటే, ఈ formula ప్రకారం కొంత బోనసు ఇవ్వాలని agreement. దీనికి factory వాళ్లందరూ పార్టీలు అవునో, కాదో నాకు తెలియదు. ఈ విషయంలో Government of India

వారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపితే, చట్ట ప్రకారం ఏమిచేయడానికి లేదు; మేము ధరలు నిర్ణయిస్తున్నాము; ఆ ప్రకారంగా ఇచ్చేట్లా చేస్తున్నాము; అంతకన్న చేసేది లేదు అంటున్నారు. Government of India వారు ఆ విషయాన్ని చూస్తున్నారు కాబట్టి మనకు చేయడానికి అధికారం లేకుండాఉన్నది.

SRI P. SUNDARAYYA :— ఇది concurrent subject గా తీసుకున్నా కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకం కాకుండా రాష్ట్ర ప్రభుత్వం చేయడానికి ఏమి legal అభ్యంతరాలున్నాయి ?

THE HON. SRI B. GOPALA REDDI :— ఈవిషయంలో వాళ్ళకే power ఉన్నది.

SRI P. SUNDARAYYA :— దాదాపు 15 లక్షలకు పైగా ఇవ్వవలసియున్నట్లు లెక్కలనుబట్టి తెలుస్తోంది. సంవత్సరం పైగా గడిచింది. దీనినిగురించి వెంటనే చర్య ఏమైనా తీసుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI:— ఈ విషయాలు ఎందుకు అమలు చేయలేదో కనుక్కొంటాను. వారికి ఏదో సమాధానం ఉంటుంది. Initial stages అవడమో, dividends లేకో ఏమో తెలియదు. ఏమైనప్పటికీ ఈ విషయంలో ఒక conference పిలిపించి తగు చర్య తీసుకుంటాను అని హామి ఇస్తున్నాను.

SRI P. SUNDARAYYA:— ఈ సందర్భంలో factory వాళ్లకు వచ్చిన లాభాలు, డైరక్టర్లకు ఇచ్చే లక్షలాది ఆదాయం దృష్టిలో పెట్టుకుని వ్యవహరించడానికి శ్రద్ధ తీసుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :— ఈ విషయాలన్నీ SISMA formula లో ఉన్నాయి అనుకుంటాను.

SRI P. RAJAGOPAL NAIDU:— చెరుకు ధర నిర్ణయం చెరుకు బరువునుబట్టి కేంద్ర ప్రభుత్వం నిర్ణయంచేస్తుంది. SISMA formula చక్కెర పాలలో ఉండే చక్కెర నిష్పత్తికి సంబంధించి ఉన్నది. South India లో చక్కెర ఉత్పత్తి ఎక్కువగా ఉన్నది. ఈ formula ను చట్టబద్ధంచేయాలని Government of India వారికి recommend చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI:— ఒకటి రెండుసార్లు ఇంతకుముందే చేశాను. దీనిని స్థానికంగా చేసుకోవాలని Government of India వారు చెప్పారు.

[26th September 1955

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:— కొప్పాక sugar factory వాళ్లు గవర్నమెంటు నిర్ణయంచేసిన ధరకంటె ఎక్కువగా ఇస్తున్నారో తక్కువగా ఇస్తున్నారో మంత్రి గారికి తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI:— కొంచెం ఎక్కువే ఇస్తున్నారని నా భోగట్టా.

SRI S. VEMAYYA:— ఇప్పుడు గవర్నమెంటు పద్ధతి ప్రకారము నైతిక బలముతో ఇప్పించ సాధ్యపడలేదు. ఇక్కడ డబ్బు బకాయిలనుబట్టి తెలుస్తున్నది. కాబట్టి ఏదైనా ఒక piece of legislation ప్రభుత్వం తీసుకొనివచ్చి implement చెయ్యడానికి పూనుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:— Definite గా ఈవిషయములో ఏమి చెయ్యడానికి వీలవుతుందో చూచి conference పిలచి చట్ట ప్రకారం ఏమి చెయ్యడానికి వీలుందో ఆలోచిస్తాము.

SRI V. VISWESWARA RAO:— అధ్యక్షా, Sugar Advisory Board, Mill యజమానులు, రైతులు, ప్రభుత్వంతరపున ప్రతినిధులు ముగ్గురు కలసిన కమిటీతో SISMA Formula అంగీకరించినపుడు దానిలో సభ్యులు అయిన K. C. P. LTD. యజమాని Sri V. Ramakrishna అక్కడ అభ్యంతరం చెప్పకుండా ఈనాడు bonus ఇవ్వకుండా ఉండడానికి కారణము ఏమిటి ? ప్రభుత్వం ఏమి చర్య తీసుకొంటుంది ?

THE HON. SRI B. GOPALA REDDI :— ఆ విషయములు అన్నీ కూడా తప్పకుండా ఆలోచిస్తాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా SISMA formula ప్రకారము అదనపు ధరలను మిల్లువారు నిరాకరించిన సందర్భములో ఇండియా ప్రభుత్వం నిర్ణయించే కనీసపు ధరలో ఈ అదనపు ధరను చేర్చి నిర్ణయించడానికి ప్రభుత్వం ఏమైనా చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— అనేక విషయాలు గమనించి ఇండియాప్రభుత్వం cane ధర నిర్ణయం చేస్తుంది. ఉపరిగా ఇప్పించడానికి ఈ SISMA Formula ఉంది.

SRI V. VISWESWARA RAO :— అధ్యక్షా ; SISMA Formula అనేది South Indian Mill owners అంగీకరించినదే. తరువాత కొంతమంది owners ఇది తమకు కష్టముగా ఉందని కేంద్ర ప్రభుత్వానికి ఏమైనా representation చేసినారా ?

THE HON. SRI B. GOPALA REDDI:— ఆ విషయము ఏమీ తెలియదు. వేరే ప్రశ్న వేస్తే చెబుతాను.

*Cess collected by Sugar Factories.*

434—

* 1397-B Q.—SRI B. APPA RAO:— Will the Hon. the Chief Minister be pleased to state the amount of cess so far collected by each sugar factory in Andhra State and how it is going to be utilized?

THE HON. SRI B. GOPALA REDDI:—

(a) The amount of cess so far collected from each of the sugar factories in Andhra State after its formation is furnished below:—

| | | |
|---|---|---|
| 1. | Sri Deccan Sugar and Abkhari Company Limited, Samalkota. | 1,40,793–14–0 |
| 2. | Etikoppaka Co-operative Agricultural and Industrial Society, Darlapudi. | 1,17,131–3–10 |
| 3. | M/S. Vizagapatnam Sugar's and Refinary Limited, Thummapala. | 1,11,116–3–9 |
| 4. | Sree Rama Sugars and Industries, Limited, Bobbili. | 1,16,597–10–0 |
| 5. | Sree Rama Sugar's and Industries, Seetanagaram. | 73,377–15–8 |
| 6. | M/S. K. C. P. Limited, Vuyyur. | 2,58,798–2–9 |
| 7. | M/S. Kirlampudi Sugar's Limited, Pitapuram. | 1,36,758–11–3 |
| 8. | Andhra Sugar's Limited, Tanuku. | 70,465–1–3 |
| | Total. | Rs. 10,25,308–14–6 |

The cess will be utilised for the following purposes.

(i) Sugarcane Research.

(ii) Sugarcane Development.

(iii) Administration of the Sugar Factories Control Act.

(iv) Sugarcane Crop Yield Competitions

(v) Improvement of feeder roads leading to factory areas.

SRI B. APPA RAO:— ఇప్పటివరకు collect చేసిన డబ్బును factory ల వారు రైతులకోసం ఉపయోగించేటట్లు చెయ్యడానికి ప్రభుత్వం ఎట్టి చర్యలుతీసుకొన్నదో మంత్రిగారు శెలవిస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI:— డబ్బు కొంత ఉన్నది. ఇటీవల ఆ factory లలో రస్తాల సౌకర్యం కలుగచెయ్యడానికి కొన్ని స్కీములు మంజూరు చేశారు. అట్లాగే Sugar cane Research Institute కు గాను కొంత వెచ్చించాలని నిర్ణయించారు. మరి కొన్ని ఈ సంవత్సరంలోపున చేస్తాము.

SRI S. VEMAYYA:—ఈ cess ఏ basis మీద collect చేస్తారో తెలుసుకొనవచ్చునా ?

THE HON. SRI B. GOPALA REDDI:—Ton కు ఒకరూపాయి వసూలు చేస్తున్నారు.

SRI V. VISWESWARA RAO:— ఈ Cess Fund ఉపయోగించాలని Mill Owners, రైతులు, ప్రభుత్వప్రతినిధులు ఉన్న కమిటీలో నిర్ణయించినప్పటికినీ, సంవత్సరము అయినా ఆ డబ్బు ఖర్చుపెట్టకుండా ఉన్నదని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI:— తప్పకుండా యీ సంవత్సరం లోపునే ఖర్చుపెడతారు. ఆ డబ్బు ప్రభుత్వంవద్దనే ఉంది.

SRI N. C. SESHADRI:— ఈ Cess Fund ను Sugar Research Station గురించి ఉపయోగిస్తారని చెప్పారు. ఆంధ్రలో ఎక్కడ ఈ Research Station ఉన్నదో తెలియచేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI:— వేరేప్రశ్న వెయ్యండి చెబుతాను.

SRI K. V. S. PADMANABHA RAJU:— రైతులవద్దనుండా factory owners వద్దనుండా వసూలుచేస్తున్నారు.

THE HON. SRI B. GOPALA REDDI :— Factory ల వద్దనుండి వసూలు చేస్తున్నారు.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా, ఇప్పుడు Cess fund ను tonకు రూపాయి వంతున వసూలుచేస్తున్నారు. రెండు రూపాయిలవరకు పెంచడానికిచూస్తారా?

THE HON. B. GOPALA REDDI :— తీవ్రముగా ఆలోచిస్తాము.

SRI P. SUNDARAYYA :— ఫ్యాక్టరీల ద్వారా వసూలు చేస్తున్నామని అంటున్నారు. ఫ్యాక్టరీలవారు వారి లాభాలలోనుండి ఇస్తున్నారా; రైతులు ఇచ్చే చెరకు turnover నుంచి ఇస్తున్నారా ?

THE HON. SRI B. GOPALA REDDI :— టూకు turnover మీద టన్నుకు రూపాయి ఇస్తున్నారు.

SRI V. VISWESWARA RAO :— వుయ్యూరు ఫ్యాక్టరీవారు Cess Fund కాక టన్నుకు రూపాయికాక 0-4-0 College Fund వసూలుచేస్తున్నారు. ప్రభుత్వం శ్రద్ధతీసుకొని ఆ డబ్బును కాలేజీ కమిటీకి జమ కట్టేటట్లు చేస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI :— రైతులు స్వయముగా దాన పూర్వకముగా ఇచ్చినదానికి మేము ఏమిచేస్తాము.

*Digging of the canal for irrigating Sigadam and other villages of Srikakulam district.*

435—

* 1064 Q.—SRI P. GUNNAYYA: Will the Hon. the Deputy Chief Minister be pleased to state:—

(a) whether the Government have received representations to dig a canal from the north side of Vuracheruvu relating to Musidika Valasa village of Cheepurapalli taluk, Srikakulam district, to Gadapeta Timmajipuri which would irrigate the lands of five villages, Sigadam, Siddam, etc.; and

(b) if so, the action taken thereon?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) Yes.

(b) Chief Engineer's remarks called for in the matter are still awaited.

SRI P. GUNNAYYA :— అధ్యక్షా! శిగడాం నుండి ముషిడివలస వరకు చిన్న కాలువ తీస్తే 10 వేలు ఖర్చుపెడితే కుగ్రామాలకు పనికివస్తుందని చెప్పి యిప్పటికి మూడు సంవత్సరాలు అయింది. నేను M. L. A. అయిన దగ్గరనుండి తెలియ చేస్తునే ఉన్నాను ఇంకా మంత్రిగారు చెబుతున్నారు ఇంజనీరు వస్తారని. ఆ పని ఎంతలోగా పూర్తిచేస్తారు?

THE HON. SRI N. SANJEEVA REDDI :— గున్నయ్యగారు చెప్పిన మాట నిజమే. ఇంక ఎన్నోన్నో చెబుతున్నారు. శ్రీకాకుళం జిల్లాలో కోట్లకొలది రూపాయిల పనులు జరుగుతున్నవి. Urgency ని బట్టి ఇంజనీర్లు చేయిస్తారు. వారు అనుకొన్నట్లు అన్ని పనులు చెయ్యడం ఇంజనీర్లకు సాధ్యంకాదు. ఏమైనా పనులు త్వరగా చేస్తున్నారా. వారు M. L. A. గా ఉండగా జరుగుతుంది.

[26th September 1955

*Deputy Tahsildars appointed for planning work in East Godavari district.*

436—

* 923 Q—Sri M. RAJESWARA RAO:— "Will the Hon. the Minister for Revenue be pleased to state:—

(a) the number of Deputy Tahsildars appointed under rule 10 (a) (i) during 1955 in connection with the planning work in East Godavari district; and

(b) the communities to which they belong ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) Seven.

(b) Six Brahmins and one Non-Brahmin Hindu.

SRI N. C. SESHADRI:—ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను తయారు చెయ్యడానికిగాను ఈ Deputy Tahsildars లను ఏర్పాటు చేసినారు. ఈ ప్లాను పూర్తి అయిన తరువాత వారిని తీసివేసినట్లు తెలుస్తుంది. అయినా స్థానిక అభివృద్ధి కార్యక్రమాల అమలుకు వారిని reappoint చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— వారిని ప్లానింగు విషయమై temporary staff క్రింద వేసారు కాబట్టి ఆ question arise కాదు.

SRI S. RANGANADHA MUDALIAR:— Among the non-Brahmins employed, are there any belonging to the backward community ? Are you appointing more non-brahmins ?

THE HON. SRI K. CHANDRAMOULI:— Temporary గా available గా ఉండేవారిని తీసుకొన్నారు. వారికి special weightage యివ్వరు. ప్రొమోషనుకు దానికి సంబంధంలేదు.

SRI M. NAGI REDDI:— అధ్యక్షా ! ఇప్పుడు రెండవ ప్లాను తయారు చెయ్యడము సందర్భములో మొదట తయారు చేసినపుడు విపులముగా తయారు చేసినారు. 800 కోట్లు, 500 ఆఖరుకు 250 కోట్లు అన్నారు. అది క్రమముగా 120 కోట్లు అయింది. ఇప్పుడు గ్రామ ప్రణాళికలు తయారు చెయ్యవలసిన అవసరం ఉంది కాబట్టి వారిని appoint చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— వారికి కావలసిన staff regular list నుండి తీసుకొంటారు.

SRI PRAGADA KOTAIAH:— కొత్తగా పెట్టే ప్రతి శాఖకూ రెవిన్యూ వాళ్ళను పంపిస్తూ ఉంటారే చివరకు తహశీల్దారును వెయ్యడానికి Revenue Department లో కొరత వచ్చిందని 10 (1) A క్రిందక్రొత్తగా వేశారా అండి ?

THE HON. SRI K. CHANDRAMOULI:— కొందరు కావలసి వచ్చారు. అందువల్ల వేశారు.

SRI A. KALESWARA RAO:— ప్రతితడవ communities ను గురించి అడుగుతూ యుంటారు. ఇప్పటికి ఒక Communal G. O. ఈ Government మొదట యున్నదా ? ఈ appointments చేసేటప్పుడు ఒక్క backward communities విషయంలో మాత్రమే అది ఆలోచిస్తున్నారా ? Communities అన్నప్పుడు స్త్రీలూ, పురుషులూ అనికూడా ఉన్నదా ? అంతా మగవాళ్ళ సంగతేనా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— ఇది temporary appointments విషయం.

SRI P. SUNDARAYYA:— ఏ కారణాలనుంచి, ఏ Constitution ప్రకారం, ఏ చట్టప్రకారం communities అంటే Brahmin Hindu Community అని Non-Brahmin Hindu Community అని ప్రభుత్వం గుర్తించింది ? ఆ order ఏమైనా ఉంటే table మీద పెడతారా ?

MR. SPEAKER:— You are going entirely into a different question.

THE HON. SRI K. CHANDRAMOULI:— వేరే ప్రశ్న వెయ్యాలండి.

SRI A. VENKATARAMA RAJU:— Planning సందర్భంలో East Godavari కే డిప్యూటీ తాసీల్దారును వేశారన్నారు. ఇతరజిల్లాలకు అది అవసరం లేకపోయిందా ? లేకపోతే East Godavari కి ఏమైనా ప్రత్యేకమైన allotment ఇచ్చారా?

THE HON. SRI K. CHANDRAMOULI:—ఎక్కడెక్కడ కావలసివచ్చినా ఆయా జిల్లాకలక్టర్లు వేసుకుంటారండి ?

*Maternity centres in the State*

437—

* 89-C Q.—Sri S. VEMAYYA:— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of Maternity centres now in the State?

THE HON. SRI. K. VENKATA RAO :— 239 Centres.

SRI S. VEMAYYA :— ఏ ప్రాతిపదికలపై Maternity Centres స్థాపిస్తున్నారో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI K. VENKATA RAO :— జిల్లాబోర్డువారు నడుపుతున్నవి 1187. U. N. I. C. E. F. అని అమెరికా నుంచి వచ్చిన సహాయంవల్ల మునిసిపాలిటీల వారు 17 ఇంకో 17 ఐచ్ఛికంగా private agencies నడిపిస్తున్నారు. అంటే Guild of Service వగైరా. 22 Community వగైరా Project లలో primary health centres ఈ పనిచేస్తున్నాయి.

SRI S. NARAYANAPPA :— ఇప్పుడు రాష్ట్రంలో యున్నటువంటి ఈ maternity centre లలో చాలాచోట్ల lady doctor లు లేరు. Furniture కూడా లేదు. వెంటనే ఖాళీగా యున్నటువంటి ఈ Maternity Centre లలో lady doctor లను వేయించి వెంటనే తగినటువంటి furniture supply చేసేందుకు ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :— అన్ని maternity centre లలో lady doctor లు ఉండాలనే నియమం ఎక్కడా లేదు. అసలు hospitals ఉన్నచోటే పదముగ్గురు lady doctor లు తక్కువగా యున్నారు. నా మిత్రులు నారాయణప్పగారు ఆడవాళ్లందరికీ, అంటే lady doctor లకు నచ్చచెప్పి పల్లెటూళ్లకు వెళ్ళేటట్లు ఏర్పాటుచేస్తే చాలా సంతోషిస్తాను.

SRI M. NAGI REDDI :— ఈ maternity centres రాష్ట్రంలో 239 ఉన్నవని చెబుతున్నారు. వీట్లలో ఎక్కువగా కొన్నితాలూకాలలో ఉండడం కొన్ని తాలూకాలలో అందులో ముఖ్యంగా వెనుకబడిన తాలూకాలలో అసలే లేకుండాపోవడం జరుగుతోంది. అల్లా కాకుండా ముందు పెట్టేవాట్లలోనైనా లేని తాలూకాలకు ముందు preference ఇవ్వడానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :— ప్రభుత్వంవారు maternity centre లు పెట్టవలసిన అవసరం ఏర్పడితే అక్కడ Community Project, లేక National Extension Service Block కో రావాలి.

SRI S. BRAHMAYYA:—State లో మొత్తం 239 centres ఉన్నాయని చెప్పారు. జిల్లాల వారీగా చెప్పగల్గుతారా?

THE HON. SRI K. VENKATA RAO:— కావాలంటే చెబుతాను గాని ఈ ప్రశ్నలో భాగం కాదది.

SRI L. LAKSHMANA DAS:— మంత్రిగారు జవాబు చెబుతూ lady doctor లకు చెప్పి పల్లెటూళ్ళకు వెళ్ళేటట్లు చెయ్యమన్నారు. అంతకంటె ఈ lady doctor లు పాసయిన తరువాత కనీసం రెండు సంవత్సరాలైనా మీరు పల్లెటూళ్ళలో పనిచేస్తేకాని మీకు పట్టాలు ఇవ్వం అని ప్రభుత్వం ఏమైనా నిర్ణయం చేయకూడదా అని అడుగుతున్నాను.

MR. SPEAKER:— That is a matter for the University not for the Government.

THE HON. SRI K. VENKATA RAO:— అది లక్ష్మణదాసుగారి వంటి సభ్యులు కనక మాకు బలం ఇస్తే చెయ్యగలుగు తామేమో. మొన్ననే Chief Minister గా రుండగా గుంటూరు కాలేజీలో warning ఇచ్చి వచ్చాను.

SRI S. K. V. KRISHNAVATARAM:— ఇప్పుడు జిల్లాబోర్డు ఆధీనంలో 118 వఱకూ maternity centres ఉన్నాయని చెప్పారు. మంత్రిగారు వీటికి జిల్లా బోర్డులు డబ్బివ్వడమున్నా వాటిపై administrative control, Health Department కు ఉండడం జరుగుతోంది. ఆ కారణంచేత వారిమీద సరియైన supervision ఎంతమాత్రం ఉన్నట్లు కనపడడంలేదు. కాబట్టి ఇక ముందునుంచి ఈ maternity centres ను గురించి ప్రభుత్వం ఎక్కువశ్రద్ధ చూపుతుందా? సరియైన supervision లో సక్రమంగా అమలుజరిగేటట్లు చేస్తారా అని అడుగుతున్నాను.

MR. SPEAKER:— It is more giving information than putting a question.

THE HON. SRI K. VENKATA RAO:— ప్రభుత్వం సరిగ్గానే supervise చేస్తోందని మా అభిప్రాయం. గౌరవసభ్యునియొక్క అభిప్రాయంతో ప్రభుత్వం ఏకీభవించడంలేదు. కాని ఎక్కడైనా తిన్నగా పనిచేయడంలేదని ఉన్నట్లయితే ఈ midwife లను supervise చేసే అధికారం అక్కడక్కడ M. L. A. లకు ఇవ్వడానికి నా అభ్యంతరం ఏమీలేదు.

SRI T. RAMACHANDRA REDDI :— అధ్యక్షా! కొన్ని maternity centres లో బొత్తిగా మందులే లేకుండా ఉన్నాయి. ఎన్నిపర్యాయాలు జిల్లా బోర్డువారికి చెప్పినాకూడా వాళ్ళు మందులు supply చేయడంలేదు. అటువంటి petitions ఏమైనా వచ్చాయా మీకు?

THE HON. SRI K. VENKATA RAO:— కొన్నిచోట్ల లేనిమాట నిజమే. వచ్చినవి ఖర్చయిపోతోంటే ఒకొక్కప్పుడు ఒకొక్క area లో కొంచెం కృషి ఎక్కువజరిగి పిల్లలు ఎక్కువ పుట్టడంవల్ల పురిటివాళ్ళు ఎక్కువవడంవల్ల అక్కడక్కడ లోపించవచ్చు. అట్లాంటి report లు ఏమైనా Member లు కనుక ప్రభుత్వదృష్టికి సుకువస్తే తప్పకుండా ఎక్కువ సహాయంచేస్తాం.

[26th September 1955

SRI N. SRINIVASARAO :— అధ్యక్షా ! Planning ను అనుసరించి backward areas లో ఎక్కువ centres ను open చెయ్యాలని ఆంధ్రశాసన సభ్యులు Budget Session సందర్భంలో ఒక memorandum ప్రభుత్వానికి అందజేశారు. దానిపైన ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకున్నారా ?

THE HON SRI K. VENKATA RAO:— ప్రభుత్వం ఏర్పాటు చేసిన National Extension Service Blocks వచ్చినచోట అల్లా పెడతామని నేను మనవిచేశాను. అది వరసాగ్గా జరుగుతూనే ఉంటుంది. అరకంగానే వారిచ్చిన memorandum కు మేము జవాబు చెప్పగలిగింది జిల్లాబోర్డులు పెట్టే విషయంలో, త్వరలో వచ్చేటటువంటి జిల్లాబోర్డు ఎన్నికలలో శ్రీనివాసరావుగారు పాల్గొని మెంబరై backward areas లో పెట్టించే యత్నం చేయమని సలహా చెబుతున్నాను.

SRI P. VENKATASUBBAYYA:— జిల్లాలవారీగా ఎన్నెన్ని Maternity Centres ఉన్నాయని అడిగితే మంత్రిగారు అది ప్రశ్నలో భాగం కాదన్నారు. ఐతే జిల్లాలు State లో భాగం కాదని భావిస్తున్నారా ?

THE HON. SRI K. VENKATA RAO:— అనేకమైనటువంటి వాటాలున్నాయండి. భార్యాభర్తలకే ఉంటాయి fields of activity. దాని ప్రకారమే ఇది కూడా ఉంటుంది. జిల్లాది ఒకటి. జిల్లాబోర్డుది ఒకటి. గవర్నమెంటుది ఒకటిన్ని.

SRI M. NAGESWARA RAO:— మంత్రిగారు మంత్రసానులను పరిశీలించడానికి M. L. A. లకు అవకాశం ఇచ్చినందుకు వారికి ధన్యవాదాలర్పిస్తున్నాను. అవసరమైతే నర్సులూ, డాక్టర్లూ సరిగ్గా పనిచేస్తున్నారో లేదో మంత్రుల వఱకేచూస్తారా? అదికూడా అందరూ చూడడానికి వీలుంటుందా అండీ ?

THE HON. SRI K. VENKATA RAO:— గౌరవసభ్యుడికి ఆ విషయంలో కూడా ఏదైనా ప్రత్యేకసౌకర్యం కావాలంటే ఆలోచిస్తాం.

SRI S. VEMAYYA:— ఈ maternity centres స్థాపించాలంటే ఏ ఏ qualifications ఉన్నచోట ఈ క్రొత్తగా maternity centres open చేయడానికి వీలుపడుతుందో చెబుతారా ?

THE HON. SRI K. VENKATARAO:— National Extension Service Block లు 5 సంవత్సరాలలో రాష్ట్రంలోయున్న ప్రతిగ్రామానికీ అందుబాటులోకి తీసుకువస్తున్నాం. అధమపక్షం ఒక్కొక్క block కు ఒక్కొక్క maternity centre పెట్టేటటువంటి యత్నంచేస్తాం. ఇవికాకుండా తాలూకా headquarters ఆసుపత్రులు దగ్గరాలు ఇదివఱకే ఉన్నాయి. క్రొత్తగాపెట్టేటటువంటివి సాధారణంగా అందుబాటులో లేనటువంటి మూలగ్రామాలలో పెట్టేటటువంటియత్నం జరుగుతుంది.

SRI N. C. SESHADRI:— ఈ Maternity Centres లో ఎక్కడైనా మగ డాక్టర్లున్నారా, ఉంటే ఎన్ని Centres లో ఉన్నారో తెలవిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO:— పురిటాళ్ళు ఆడవాళ్ళుగాని మగ వాళ్ళు కాదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా! Women Welfare Board తరఫున Maternity సెంటర్సు పెటుతూవున్నారు. అల్లైగవర్న మెంటు కూడా పెట్టుతున్నదా? ఈ రెంటిని co-ordinate చేసి Women Welfare centres ఏమైనా non-recurring ఖర్చు వరకు వాండ్లు ఇచ్చేటట్లును, recurring ఖర్చు ప్రభుత్వం పెట్టేటట్లును ఏర్పాటుచేస్తే ఎక్కువపెట్టడానికి వీలుఅవుతుందని ఆవిధంగా ఏమైనా ఆలోచిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO:— ఇంకా recurring expenditure burden ను భరించే స్థితిలో ఈ ప్రభుత్వంలేదు. గోపాలక్రిష్ణయ్యగారు ముందు కొద్ది రోజులలో ఇవ్వబోయే సహాయంవల్ల ఆదాయం ఎక్కువఅయినట్లయితే తప్పకుండా చేస్తాము.

*Supply of electricity to Addanki for irrigation purposes.*

438—

* 196 Q—SRI N. VENKAIAH:— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) Whether any representation was received by the Government from the villages of Addanki (sub-taluk) for the supply of electritcity for irrigation purposes to Addanki (Guntur district); and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) Representations were received in 1952 from Addanki Panchayat and Multipurpose Rural Credit Society at Addanki for extension of supply for industrial, residential, street lighting purposes and for pumping water from Gundlakamma River.

(b) The proposal for the extension of supply to Addanki and nearby villages was investigated and was found to be not remunerative.

*Government Propaganda vans.*

439

* 487 Q—SRI S. VEMAYYA :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the number of Government propaganda vans in the State now ?

[26th September 1955

THE HON SRI D. SANJIVAYYA :—

There are five propaganda vans with the Co-operative Depara-ment now.

SRI S. VEMAYYA:— ఈ అయిదు propaganda vans ఎచ్చ టెచ్చట ఉన్నాయి ? ఏఏ purpose కోసం ఈ vans ను ఉపయోగిస్తున్నారు ? చెపుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA:— నెల్లూరు, అనంతపురం, కర్నూలు, మచిలీపట్టణం, కాకినాడలో ఉన్నాయి. ఇవి ముఖ్యంగా, మద్యపాన నిషేధంవల్ల కలిగే లాభాలను గురించి film shows చూపిస్తాయి.

SRI. N. SRINIVASA RAO:—Propaganda vans సరిగా propaganda చేయడంలేదనే propaganda ఉంది, అని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI D. SANJIVAYYA:— ఆ propaganda మాకు తెలియదు.

SRI L. LAKSHMANA DAS:— ప్రభుత్వం అనేక ఘనకార్యాలు చేస్తోంది. అది సామాన్య ప్రజలకు తెలియటంలేదు. జిల్లాకు ఒక propaganda van పెట్టి ప్రభుత్వంలో జరుగుతున్న ఈ కార్యక్రమాన్ని అంతా propaganda van ద్వారా ప్రజలకు తెలియ జేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA:— జిల్లాకు ఒకటి ఏర్పాటు చేయవలెననే ఆలోచనఉంది. Information Department లో అదనముగ vans కొనవలెననే proposals ఉన్నాయి.

SRI B. APPA RAO:— అసలు ఈ propaganda vans లో వెళ్ళేటటువంటి propagandists ప్రభుత్వం యొక్క కార్యకలాపాలను క్షుణ్ణంగా తెలుసుకునేందుకు ముందుగా class conduct చేయడం మంచిది అనే ప్రజలు అభిప్రాయ పడుతున్నారు. మంత్రిగారు ఆలోచిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— Classes ఏమీ లేవండీ. ఏమైనా slides, films అవి అన్నీ vans ద్వారా చూపిస్తారు. గాని ఉపన్యాసాలు ఏమీ ఉండవు.

SRI S. VEMAYYA :— ఈ propaganada vans ఇన్ని మైళ్ళకంటే హెచ్చుగ ప్రయాణం చేయకూడదని ఏదైనా నిర్ణయంఉందా? ఉంటే ఏ విధంగా ఉంది.

THE HON. SRI D. SANJIVAYYA:— అటువంటి నిర్ణయం ఏదీ నాకు తెలియదు. కాని ఒకొక్క జిల్లాలో ఉన్నటువంటిది ఇన్నిరోజులు ఈ ప్రాంతంలో తిరగాలని, తరువాత, community development blocks, community projects

ఇవి అన్నీ కలిసి ఉన్నచోట 50% దినాలు అక్కడ తిరగాలని మిగతా ప్రాంతంలో 50% తిరగాలని నియమము మాత్రం ఉంది.

SRI C. SUBBARAYUDU :— వీటిక్రింద ఖర్చు ఏ మాత్రం అవుతుందో చెప్పగలరండీ ?

THE HON. SRI D. SANJIVAYYA :— వేరే ప్రశ్న వేయవలెనని ప్రార్థిస్తున్నాను.

SRI N. P. CHENGALRAYA NAIDU :— Propaganda vans ఆయిదు జిల్లాలలోనే ఉన్నాయి. మిగతా జిల్లాలలో అంతా మద్యపాన నిషేధాన్ని గురించి ప్రజలు పూర్తిగా తెలుసుకొన్నారండీ ?

THE HON. SRI D. SANJIVAYYA :— లేదు. కాకినాడలో ఉండేది East Godavari and Vizagapatanam cover చేస్తున్నాయి. మచిలీపట్టణంలో ఉండేది, క్రిష్ణా, West Godavari, కర్నూలులో ఉండేది కర్నూలు; కడప; అనంతపురంలో ఉండేది అనంతపురం; చిత్తూరు; నెల్లూరులో ఉండేది, నెల్లూరు, గుంటూరు cover చేస్తున్నాయి. Entire State is covered.

SRI P. SURYANARAYANA:— ఈ propagannda vans శ్రీకాకుళం వచ్చినట్లు ఏమీ కనుపించదు. ఏ నెలలో ఇచ్చటికి వచ్చిందో మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA:— అది నిజమేనం . ఉన్నరికార్డులను బట్టిచూస్తే విశాఖపట్టణం శ్రీకాకుళంజిల్లాలకు కాకినాడలో ఉండే van వెళ్ళలేదు. East Godavari లోనే 47 రోజులు మాత్రం తిరిగినట్లు పోయిన quarter ను గురించి చెప్పుతున్నారు. ఇతరఊళ్ళలో తిరిగి ఉండలేదు.

SRI B. SANKARAIAH:— ఈ ప్రచారం అనేది కేవలం prohibition అటువంటిదే కాకుండా అందరూ అన్నిపార్టీల లక్ష్యాలలో ఉండే పయోజన విద్యాసహకారము అయినటువంటి వాటిమీద ప్రచారముచేసేదానికి ఆలోచిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA:— చెప్పానండి. Planning and Development department లో ఆరు van లు, Information & Broadcasting department లో దాదాపు 50 van ల వరకు కొనవలెనని proposals ఉన్నాయి. యింకా finalise కాలేదు. అదిఅయితే తరువాతిఆ కార్యక్రమాన్ని తలపెట్టడానికి అవకాశం ఉంటుంది.

SRI P. NARSIMHAPPARAO:— అధ్యక్షా, ఈ propaganda vans వల్ల prohibition ఏమైనా తగ్గిందని ప్రభుత్వానికి ఏమైనా తెలుస్తున్నదా ?

THE HON. SRI D. SANJIVAYYA:— నిస్సందేహంగా.

SRI P. KOTHANDARAMAYYA:—ఈ propaganda van ను agency ప్రాంతాలకు ఒక మాటు పంపి ప్రజలకు చూపించుటకు ఏర్పాటుచేయించుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA ఏర్పాటుచేస్తామండి.

*Jaggery produced by Co-operative Societies.*

440:—

* 503 Q— SRI S. VEMAYYA :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) the quantity of jaggery produced by the Co-operative Societies in the State for the year ending 1954; and

(b) the amount realized on account of the sales?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) : The quantity of palm jaggery produced by the members of palm jaggery Co-operative Societies in the State in the co-operative year 1953—54 was 3,41,081 maunds (25 lbs. each).

(b) : An amount of Rs. 9,33,600/- was realised by the sale of 2,92,901 maunds.

SRI S. VEMAYYA :— ఈ license ల ద్వారా సరియైనటువంటి jaggery manufacture చేయకుండా వాండ్లు దుర్వినియోగం చేస్తున్నారని పోలీసు department వారు పదేపదే cancel చేస్తున్నారా ? దానిని గురించి ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకొన్నదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ప్రభుత్వానికి ఇంత వరకు అటువంటిది ఏమి రాలేదు. వస్తే చర్య తీసుకొంటుంది.

SRI P. VENKATASUBBAYYA :— సహకారసంఘాలలో తయారుచేసే బెల్లం ధర ఇతర బెల్లం ధర కంటే ఎక్కువగా ఉన్న కారణంచేత, ప్రభుత్వం ఏమైనా subsidy ఇచ్చేందుకుఆలోచిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ప్రత్యేక ప్రశ్న వేస్తే సమాధానం చెబుతాను.

SRI P. GUNNAYYA:—అధ్యక్షా, ఇపుడు చెరుకు బెల్లం గురించి మంత్రిగారు శెలవు ఇచ్చారు.

SRI S. VEMAYYA :— తయారు అయినటువంటి బెల్లం అంతాకూడా dispose of చేయడానికి ప్రభుత్వం ఏదైనా వాండ్లకు సహాయపడుతుందా లేదా ?

THE HON. A. B. NAGESWARA RAO :— Co-operative Societies ద్వారానే అమ్ముతున్నారు.

SRI P. SUNDARAYYA .— పంచదారు లయ్యే తాటి బెల్లంగా గతి ఫ్యాక్టరీలకు పోతాయి కాబట్టి దానికోసం ఉపయోగాలు చాలా మంత్రిగారు సెలవు ఇస్తారా ?

THE HON. SRI A. B. NAGESWRA RAO :— లెక్కల ప్రకారం ఏమిలేదు. లెక్కల ప్రకారం అంతా jaggery క్రిందే convert అయింది.

SRI P. RAJAGOPAL NAIDU :— రేపల్లె సర్కారులో గీత పనివాండ్లకు license లు ఇవ్వకుండా ఉంటున్నారు. అది ప్రభుత్వానికి తెలుసునాండీ ?

( No answer )

SRI A. KALESWARA RAO : Ramamurthy Committee ఏర్పడ్డ తరువాత ఆ controversy ఫలితంగా ఈ నీరాసమస్యలో jaggery Co-operative Societies ఏమైనా హెచ్చుచేసినారా?

THE HON. SRI A. B. NAGESWARA RAO:—అధ్యక్షా ఈ ప్రశ్న 1953-54 సంవత్సరానికి సంబంధించినది. అప్పుడు 689 jaggery Society లున్నాయి. 2075 license లు ఇవ్వబడ్డాయి.

SRI PRAGADA KOTAIAH :— అధ్యక్షా, బెల్లం ఉత్పత్తి కోసం ఏర్పడి నటువంటి సహకార సంఘాలకు మీరు license లు ఇవ్వకుండ, నిరుపయోగంగా ఉంచారు. అలాంటి సంఘాలకు license లు ఆలస్యంగా ఇవ్వడమో, లేక బెల్లంఉత్పత్తికి లేదు అని అంటే liquidate చేయడమో ప్రభుత్వం ఏదో ఒకటి చేస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ప్రభుత్వానికి అటువంటి అర్జీలు ఏమైనా వస్తే తప్పకుండా విచారిస్తుంది.

SRI P. KOTHANDARAMAYYA :— తాటిబెల్లం నుంచి పంచదార తయారుచేసేందుకై చిన్నచిన్న machines Wardha లో తయారుచేస్తున్నారు. వాటిని Co-operative Society లు తీసుకొని, వాటిద్వారా ఈ పంచదార చేసేందు కోసమై గవర్నమెంటు తలపెట్టుతుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— అది ఏదైనా దానివల్ల ఉపయోగం ఉందని తోస్తే తప్పకుండా ప్రభుత్వం ఆలోచిస్తుంది.

SRI A. KALESWARA RAO :— 1953 — 54 సంవత్సరం దరిమిలా అవి ఎక్కువైనవా, లేక తగ్గిపోతున్నాయా, ఉన్నవాండ్ల అందరికీ license లు కొట్టివేస్తున్నారా ? దాని విషయంలో మంత్రిగారు ఏదైనా సంజాయిషీ చెప్పే స్థితిలో ఉన్నారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ప్రత్యేక ప్రశ్న వేయండి.

[25th September 1956

*Representation from the Andhra Rashtra Prathamikopadyaya Parishat*

441—

* 810 Q.— SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) Whether the Government have received recently any representation from the Andhra Rashtra Prathamikopadyaya Parishat about the plight of the elementry school teachers; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI VAVILALA GOPOLA KRISHNAYYA :— అధ్యక్షా, అంతా ఈ ఊరికి వచ్చి మంత్రిగారిని కలిసి వారికి Memorandum ఇచ్చారు. ఆ కాగితం ఆఫీసులో అందలేదా ? అది ఏమైంది అని అడుగుతున్నాను. చేరలేదంటున్నారు.

THE HON. SRI B. GOPALA REDDI :- Secretarait కు చేరలేదన్న మాట.

*Narayanapuram and other Projects of Srikakulam district.*

442—

* 1075 Q:— SRI P. SURYANARAYANA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the stage at which the construction of the following works now stand—

(1) The Narayanapuram Project;

(2) The Nagavali Right Bank Channel; and

(3) Seethanagaram Project of Srikakulam district; and

(b) when they are likely to be completed ?

THE HON SRI N. SANJEEVA REDDI :—

(a) 1. Formation of approach road to anicut from Srikakulam-Palakonda road is under execution.

2. Buildings for staff and stores have been constructed. Construction of Head sluice excavation of channel are in progress.

3. Buildings, for staff and stores, access road, diverasion channel for the dry weather flow have been completed. Works pertaining to masonry for body wall in the gap and excavation of right side channel are in Progress.

| | | Probable Date of completion. |
|---|---|---|
| (b) | Narayanapuram project | 31-3-1957 |
| | Nagavalli right side channel scheme | 31-3-1956 |
| • | Seethanagaram project | 31-3-1956 |

నారాయణపురం ప్రాజెక్టు కొద్దిగా ఆలస్యం కావటానికి కారణం నేను మొన్న P. W. D. Demand move చేస్తూ చెప్పాను. Administrative sanction ఇవ్వడంలో దాదాపు 7, 8 నెలలు delay అయింది. అప్పుడు Ministry పోవడను, తరువాత మళ్లీ Ministry వచ్చిన తరువాత administrative sanction ఇవ్వడం జరిగింది. కాబట్టి అది పూర్తిచేయడంలో కూడ కొన్ని నెలలు ఆలస్యం అవుతుంది.

SRI P. SURYANARAYANA :— అధ్యక్షా, గౌరవనీయ మంత్రిగారు ఇప్పుడైనా ఆ staff కు orders ఇచ్చి వెంటనే చేయించడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— నారాయణపురం ప్రాజెక్టు మాత్రం కొదిగా ఆలస్యంఅవుతుంది. Staff ఏమో ఉంది. కాని, administrative sanction ఇవ్వడంలో కొంత ఆలస్యమైంది. ఈ కొత్తమంత్రివర్గం వచ్చినతరువాత, ఈసంవత్సరమే 28-5-55 న administrative sanction ఇవ్వబడింది. ఈ మధ్యలో మంత్రులు లేనపుడు కొందరు వచ్చి నారాయణపురం ప్రాజెక్టు కట్టకూడదని గవర్నరుకు అర్జీలు ఇవ్వడంవలన గవర్నరు ప్రారంభించకుండ నిలపెట్టారు. ఈ మంత్రివర్గము వచ్చిన తరువాత orders ఇవ్వబడ్డాయి. ఇంజనీర్లు అప్పుడే ఉన్నారు. పని చేస్తూ ఉన్నారు. ఇప్పటికి అప్పుడే దాదాపు నాలుగులక్షలు ఖర్చు అయింది. త్వరలోనే పని ప్రారంభిస్తారు.

*Shell Industry in the State.*

443:—

* 310 Q— SRI S. VEMAYYA :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :—

(a) Whether there are proposals with the Government to start a "Shell" (గుల్లతీయు) Industry in the State now; and

(b) if so, the place at which it will be located in the State?

[26th September 1956

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No Sir.

(b) Does not arise.

SRI S. VEMAYYA :— ఈ గుల్ల సముద్ర తీరపు జిల్లాలలో ఎక్కువగా ఉన్నది. దాన్ని వేలమువేస్తే కొద్దిపాటి డబ్బుకూడ ప్రభుత్వానికు వస్తుంది. దీని కొక Industry పెట్టటానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ industries ప్రభుత్వం పెడితే లాభించదు. ఎవరైనా private వారు పెట్టడానికి తయారైతే వారికి ప్రోత్సాహం ఇవ్వడానికి అభ్యంతరం లేదు.

*Salt Industry in the State.*

444—

* 356 Q— SRI S. VEMAYYA :— Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether there are proposals with the Government to start Salt Industry in the State ?

THE HON. SRI K. VENKATA RAO :—

"No Sir."

SRI S. VEMAYYA :— ఈ కోస్తా జిల్లాలలో ఎక్కువగా ఉప్పు తయారు కావడం దాన్ని దుబారాగా సముద్రంలో పోయడం ప్రభుత్వమునకు తెలిసి ఉంటుంది. కాబట్టి దీన్ని ప్రభుత్వం స్వయంగాగాని, private వాళ్లకు ఇచ్చిగాని industries ను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON. SRI K. VENKATA RAO :— ఇప్పుడు తయారయ్యేటటువంటి ఉప్పు మన దేశానికి కావలసినదానికంటె ఎక్కువ ఉన్నది. ఇతర దేశాలకుకూడ ఎగుమతి అవుతుంది గనుక దీన్ని గురించి ప్రత్యేకమైన శ్రద్ధ అవసరం లేదు.

SRI B. SANKARAIAH:—ఇది ప్రభుత్వానికి మంచి ఆదాయాన్ని ఇచ్చేటటువంటి Industry కాబట్టి, అందులో ఇప్పుడు ఆంధ్రదేశమునకు ఉన్న బడ్జటులోటును పూడ్చేందుకు పనికివస్తుంది. కాబట్టి దీని విషయం ప్రత్యేకంగా ఆలోచిస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :— లాభ నష్టాలలో కాదు. కొన్ని పరిశ్రమలు చేబట్టి మిగిలిన పరిశ్రమలు private sectors కు వదలిపెట్టవలె ననేది ఈ ప్రభుత్వం యొక్క కేంద్రప్రభుత్వం యొక్క, నిర్ధారిక సిద్ధాంతము గనుక దాని ప్రకారమే ఈ విషయంలో కూడ చేయవలసి యుంటుంది.

SRI N. K. LINGAM :— అధ్యక్షా, ఈ చాకలివాళ్లు బట్టలను ఉపయోగించే చవుడు అనే పదార్థము ఈ ఉప్పులో ఒక భాగము. చాకలివాళ్లు చవుడు లేక చాలబాధ పడుతున్నారు. కనుక ప్రభుత్వము ఈ చవుటి factory ఏదైనా మన రాష్ట్రంలో ఏర్పాటు చేస్తారా ?

MR. SPEAKER :— వేరే ప్రశ్న వేయండి.

SRI PRAGADA KOTAIAH :— మనకు ఈ కోస్తా ప్రాంతాలలో ఉప్పు విశేషంగా పండుతున్నది. Soda ash industry కి ప్రధానమైనటువంటి raw material గా ఉన్నది. కాబట్టి ఈ soda ash ఉత్పత్తికి ప్రభుత్వం ఏదైనా ఆలోచిస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO : Soda ash కు salt ఎక్కువగా కావలసినమాట నిజమే ; నేను ఉప్పు పండే ప్రదేశాలకు అంటే కాకినాడా, విశాఖపట్నం వగైరా ప్రదేశాలకు స్వయంగా వెళ్లి ఎవరైనా దీనిని పెట్టుకొంటారేమోనని యత్నంచేశాను. ఎవరు ఇంతవరకు ముందుకు రాలేదు. ఈ soda ash India దేశానికి తగినంత తయారు చేసేందుకు license లు సౌరాష్ట్రములోను, ట్యుటికోరిన్ లోను ఇదివరకే ఇచ్చుకొన్నారు. కాని ఆంధ్రదేశములో ఎక్కడైనా ఇది జయప్రదంగా నడవాలంటే కాకినాడాలోనే జరుగగలదని మనకు సలహా వచ్చింది. కాని ఆ ప్రాంతములో ఎవరు దీనిలో శ్రద్ధపుచ్చుకొనడం లేదు.

SRI PRAGADA KOTAIAH :- గుంటూరుజిల్లా చిన్నగంజాము ప్రాంతములో ఉప్పు విశేషంగా పండుతుంది. అక్కడ ఈ soda ash factory నిర్మించటానికి రైతులు అనేకసార్లు విజ్ఞప్తులు చేసుకున్నారు. ప్రభుత్వం దానిమీద ఏదైన నిర్ణయం చేస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO :— గుంటూరు జిల్లాలో ఉన్నటువంటి ఉప్పుతోటి సరియైనటువంటి Soda ash factory పెట్టడానికి తగినటువంటి వసతులు లేవుఅని Experts యొక్క అభిప్రాయము.

*Loans to rural credit co-operative societies.*

445—

* 1394 Q— SRI PILLALAMARRI VENKATESWARLU :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state whether there is any proposal to grant three years' term loans to rural credit co-operative socities ?

THE HON. SRI D. SANJIVAYYA :—

Yes, Sir.

SRI V. VISWESWARA RAO :— అధ్యక్షా, ఇదివరకు ఎంత మొత్తాన్ని మూడు సంవత్సరాల వాయిదామీద రైతులకు అప్పుగా ఇచ్చారో చెప్పగలరా ?

[26th September 1955

THE HON. SRI D. SANJIVAYYA :— ఇప్పుడు రైతులకు ఎంత మొత్తం ఇచ్చింది actual గా చెప్పలేను. కాని ఈ సంవత్సరం 40 లక్షలు రిజర్వు బ్యాంకునుండి, 20 లక్షలు Government of India నుండి, మొత్తము 60 లక్షలు ఈ medium term loans కు గాను ఇచ్చారు. ఇది 15 District Central Banks కు అందజేశాము. వారు Co-operative Societies ద్వారా రైతులకు అందజేస్తారు.

SRI P. VENKATASUBBAYYA :— ప్రస్తుతం మూడు సంవత్సరాల దీర్ఘ వాయిదాల మీద ఇచ్చే అప్పులు భూముల ఆయకం పైన ఇస్తున్నారు. ఆ rules సడలించి జామీనుపైన కూడ ఇవ్వటానికి ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఆవిధంగా అప్పులు ఇస్తే మళ్లీ మళ్లీ మనకు వసూలు అవుతాయా అనేది సందేహము.

SRI B. SANKARAIAH :— ఈ దీర్ఘ వాయిదాలతో ఇచ్చేది మొత్తంఅప్పులో One-fourth కన్నా జాస్తిగా ఇవ్వడంలేదు. అటువంటప్పుడు, దాన్ని ఇంకా ఎక్కువచేసి, అంటే, సంవత్సరంమీద చెల్లరాసుకునె దాంట్లో సగమైన ఇచ్చేటట్లు ప్రభుత్వము orders issue చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— డబ్బులేదు.

SRI M. NAGI REDDI :— ఇప్పుడు చాలా Credit Soceities లో సంవత్సరం వాయిదాలమీద ఇచ్చేటటువంటివి వసూలు కాకపోవడం, దీనికి మళ్లీ ఎక్కువ వడ్డీచేసి కట్టాలి అనడం దానిపైన జప్తులు మొదలగునవి జరుగుతూ ఉన్నవి. కనుక వాటిని కూడా మూడు సంవత్సరాల వాయిదాలతోటి మూడు terms గా కట్టుకో డానికి ఏదైనా ఏర్పాట్లు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :— దానికి అవకాశం లేదు. ఇప్పుడు మన State Bank ఉన్నది. State Bank లో Paid up share capital, తరువాత all categories of revenue funds excluding accumulated losses ఉన్నాయి. ఈ మొత్తం ఎంత ఉన్నదో అంత మొత్తాన్ని Reserve Bank ఇస్తుంది. అందువల్ల మన State Bank యొక్క Paid up share capital ఎక్కువ చేయడానికి సభ్యులు అంతా కృషి చేసినట్లైతేమనకు ఇంకాఎక్కువ Reserve Bank నుంచి వస్తుంది. రైతులకు కూడ ఎక్కువ మొత్తము అందచేయడానికి వీలు అవుతుంది.

SRI N. C. SESHADRI:—ఈ Rural Credit Societies ను finance చేయడానికి గాను, ఇప్పుడు ప్రతి తాలూకా Head-quarters లో కూడా Rural Banks open చేస్తున్నారు. అయితే area of operation అయిదు మైళ్లని చెప్పుతున్నారు. కాబట్టి ఈ Credit Societies కు finance చేయాలంటే తాలూకా అంతాకూడ area of operation లో వచ్చేటట్లుగా bye-law కు amendment అనుమతిస్తుందా?

SRI N. K. LINGAM :— అధ్యక్షా, ఈ చాకలివాళ్లు బట్టలను [illegible] చవుడు అనే పదార్థము ఈఉప్పులో ఒకభాగము. చాకలివాళ్లు చవుడు లేక చాల బాధ పడుతున్నారు. కనుక ప్రభుత్వము ఈచవుడుకి factory ఏదైనా మన రాష్ట్రంలో ఏర్పాటు చేస్తారా ?

MR. SPEAKER :— వేరే ప్రశ్న వేయండి.

SRI PRAGADA KOTAIAH :— మనకు ఈ కోస్తా ప్రాంతాలలో ఉప్పు విశేషంగా పండుతున్నది. Soda ash industry కి ప్రధానమైన [illegible] raw material గా ఉన్నది. కాబట్టి ఈ soda ash ఉత్పత్తికి ప్రభుత్వం ఏదైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO : Soda ash కు salt ఎక్కువ [illegible] సినమాట నిజమే ; నేను ఇది పండే ప్రదేశాలకు అంతే [illegible], విశాఖపట్నం [illegible] ప్రదేశాలకు స్వయంగా వెళ్లి ఎక్కడైనా పనిని పెట్టుకోవచ్చునేమోనని [illegible]. ఎవరు ఇంతవరకు ముందుకు రాలేదు. ఈ soda ash India [illegible] license లు [illegible] రాష్ట్రములోను, [illegible] చెప్పుచున్నారు. కాని ఆంధ్రదేశములో ఎక్కడైనా ఇది జయప్రదంగా నడవాలంటే [illegible] గలదని మనకు సలహా వచ్చింది. కాని ఆ ప్రాంతములో ఎవరు దీనిలో శ్రద్ధవహించినట్టు లేదు.

SRI PRAGADA KOTAIAH :— [illegible] ప్రాంతములో ఉప్పు విశేషంగా పండుతున్నది. అక్కడ ఈ soda ash factory నిర్మించడానికి రైతులు అనేకసార్లు విజ్ఞప్తులు చేసుకున్నారు. ప్రభుత్వం దానిమీద ఏదైనా నిర్ణయం చేస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO :— [illegible] ఉప్పులోటి [illegible] Soda ash factory పెట్టడానికి [illegible] లేదని Experts యొక్క అభిప్రాయము.

*Loans to rural credit co-operative societies.*

445—

* 1394 Q— SRI PILLALAMARRI VENKATESWARLU :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state whether there is any proposal to grant three years' term loans to rural credit co-operative socities ?

THE HON. SRI D. SANJIVAYYA :—
Yes, Sir.

SRI V. VISWESWARA RAO :— అధ్యక్షా, [illegible] ఎంత [illegible] మూడు సంవత్సరాల వాయిదామీద రైతులకు అప్పుగా ఇవ్వాలో చెప్పగలరా ?

[26th September 1955

THE HON. SRI D. SANJIVAYYA :— ఇప్పుడు రైతులకు ఎంత మొత్తం ఇచ్చింది actual గా చెప్పలేను. కాని ఈ సంవత్సరం 40 లక్షలు రిజర్వు బ్యాంకున్నూ, 20 లక్షలు Government of India గారున్నూ, మొత్తము 60 లక్షలు ఈ medium term loans కు గాను ఇచ్చారు. ఇది 15 District Central Banks కు అందజేశాము. వారు Co-operative Societies ద్వారా రైతులకు అందజేస్తారు.

SRI P. VENKATASUBBAYYA :— ప్రస్తుతం మూడు సంవత్సరాల దీర్ఘ వాయిదాల మీద ఇచ్చే అప్పులు భూముల ఆధారం పైన ఇస్తున్నారు. ఆ rules సడలించి జామీనుపైన కూడ ఇవ్వటానికి ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఆవిధంగా అప్పులు ఇస్తే మళ్లీ మళ్లీ మనకు వసూలు అవుతాయా అనేది సందేహము.

SRI B. SANKARAIAH :— ఈ దీర్ఘవాయిదాలతో ఇచ్చేది మొత్తంఅప్పులో One-fourth కన్నా జాస్తిగా ఇవ్వడంలేదు. అటువంటప్పుడు, దాన్ని ఇంకా ఎక్కువచేసి, అంటే, సంవత్సరంమీద చెల్లరానుకునే దాంట్లో సగమైన ఇచ్చేటట్లు ప్రభుత్వము orders issue చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— డబ్బులేదు.

SRI M. NAGI REDDI :— ఇప్పుడు చాలా Credit Soceities లో సంవత్సరం వాయిదాలమీద ఇచ్చేటటువంటిది వసూలు కాకపోవడం, దీనికి మళ్లీ ఎక్కువ వడ్డీచేసి కట్టాలి అనడం దానిపైన జప్తులు మొదలగునవి జరుగుతూ ఉన్నవి. కనుక వాటిని కూడా మూడు సంవత్సరాల వాయిదాలతోటి మూడు terms గా కట్టుకోడానికి ఏమైనా ఏర్పాట్లు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :— దానికి అవకాశం లేదు. ఇప్పుడు మన State Bank ఉన్నది. State Bank లో Paid up share capital, తరువాత all categories of revenue funds excluding accumulated losses ఉన్నాయి. ఈ మొత్తం ఎంత ఉన్నదో అంత మొత్తాన్ని Reserve Bank ఇస్తుంది. అందువల్ల మన State Bank యొక్క Paid up share capital ఎక్కువ చేయడానికి సభ్యులు అంతా కృషి చేసినట్లైతే మనకు ఇంకాఎక్కువ Reserve Bank నుంచి వస్తుంది. రైతులకు కూడ ఎక్కువ మొత్తము అందచేయడానికి వీలు అవుతుంది.

SRI N. C. SESHADRI:—ఈ Rural Credit Societies ను finance చేయడానికి గాను, ఇప్పుడు ప్రతి తాలూకా Head-quarters లో కూడా Rural Banks open చేస్తున్నారు. అయితే area of operation అయిదు మైళ్లని చెప్పుతున్నారు. కాబట్టి ఈ Credit Societies కు finance చేయాలంటే తాలూకా అంతాకూడ area of operation లో వచ్చేటట్లుగా bye-law కు amendment అనుమతిస్తుందా?

[26th September 1955

THE HON SRI D. SANJVAYYA :— ఇబ్బందులుచాలా ఉంటాయి. తాలూకా కేంద్రములో Rural Bank పెట్టి ఆ తాలూకాలో ఉన్నటువంటి ఊళ్లకంతకు అను వర్తిస్తే షుమారు 20,30 మైళ్ల దూరములో ఉండే రైతుకు అప్పు ఇవ్వవలసి వచ్చినప్పుడు ఆ రైతు పరిస్థితి ఏమిటి, అతడు ఎటువంటి వాడు, అనేటటువంటి విషయాలు గమనించి ఇవ్వవలసి ఉంటుంది అందువల్ల దీనియొక్క opreation విస్తీర్ణము ఎక్కువ చేయడానికి సాధ్యంకాదు.

SRI PRAGADA KOTAIAH :— Reserve Bank యిచ్చేది రు 1-8-0 వడ్డీ అయితే తీరా అది రైతుకు చేరేటప్పటికి, అటు State Bank, Central Bank యిటువంటి intermediaries ఉండడమువల్ల 6% వరకూ పెరిగిపోతున్నది. / ఈ Central Bank అనే intermediaries ను తొలగించి వడ్డీరేటు తగ్గించే సదుపాయము యేద్రైనా చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :— వారు చెప్పేటటువంటి 6% యే కాదు. రైతుకు చేరేది అసలు $6\frac{1}{4}$%, Reserve Bank కు $1\frac{1}{2}$%, కాబట్టి యీ మధ్య వున్న State Bank గాని, Reserve Bank ను గాని తొలగించటానికి అవకాశము లేదు. వీటిని తొలగిస్తే, Reserve Bank వారు మనకు అప్పు యివ్వరు.

SRI P. NARASIMHAPPA RAO:— అధ్యక్షా, కో-ఆపరేటివ్ సొసైటీలు రాష్ట్రంలో 51వ లక్షను ఉన్నది. దాని ప్రకారము ఒక సొసైటీ విషయములో enquiry చేయటానికి Supervisor ను పంపిస్తున్నారు. అది department వారికే మరల పంపిస్తున్నారు. దానిని మరల enquiry చేసి, చివరకు supersede చేస్తున్నారు. దీనిమీద అప్పీలు చేస్తే, మరల దానిని రిజిస్ట్రారు గారికి పంపిస్తున్నారు. ఇదంతా చూస్తే, enquiry అంతా department ద్వారానే జరుగుచున్నది. ఈ విధంగా చేయడములో Departmental sympathy చూపించటము జరుగుచున్నది. అట్లా చేయకుండా వేరే Tribunal ను ఏర్పాటు చేస్తారా ?

MR. SPEAKER :— వేరే ప్రశ్న వేయండి.

SRI V. VISWESWARA RAO :— అధ్యక్షా Rural Banks [illegible] నాట్లాడుతూ మంత్రిగారు యూనిటేల వ్యాపారుల వరకూ share capital [illegible] గాని సాధ్యము కాదని చెప్పారు. [illegible] ముప్పయిలక్షల తగ్గించినట్లుగా ప్రాయమించి [illegible] [illegible] ఏదినికో [illegible]

THE HON. SRI N. SANJIVAYYA :— సమస్యను సరిగా గుర్తించినట్లు [illegible] నా సందేహము. యూనిట్లు [illegible] అని ఖచ్చితముగా వున్నది. [illegible] అక్కడి పరిస్థితుల ప్రకారం [illegible] 25-30 వేలు [illegible] Departmental officers కు చెప్పినాము.

*Constitution of new Panchayat boards.*

446—

* 762 Q— SRI. P. GOPALAKRISHNA REDDI :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state whether the Government propose to give effect to the scheme of opening new panchayat boards for villages with a population of not less than 500?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

The scheme mentioned in the question is what has been embodied in section 3 of the Madras Village Panchayats Act, 1950. The question of amending the above section so as to make panchayats viable by constituting them for big enough areas is under consideration.

1950వ సంవత్సరపు Village Panchayats Act 3 వ సెక్షను ప్రకారము యీ పంచాయితీలు ఏర్పాటు యిదివరకే జరిగింది. అంతకంటే యిప్పుడు 500 జనాభాగల గ్రామాల లో పంచాయితీలు ఏర్పాటు చేయాలని ప్రభుత్వము వుద్దేశిస్తున్నదిగాని అటువంటి ఏర్పాటు చేయటానికి viable గా వుండడము లేదు గనుక ఎక్కువ జనాభాగల areas లో పంచాయితీలు ఏర్పాటు చేయాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

*Midday meals for Harijan and Backward Class boys in elementary schools.*

447—

* 1168 Q.— SRI. G. NAGESWARA RAO : Will the Hon. the Chief Minister be pleased to state whether there is any proposal to introduce the system of midday meals for Harijans and Backward Class boys reading in other elementary schools also?

THE HON. SRI B. GOPALA REDDI :—
The answer is in the negative.

SRI S. VEMAYYA :— లోగడ 1946-47 వ సంవత్సరములో జిల్లాబోర్డు స్కూళ్లు అన్నింటిలోనూ మధ్యాహ్నముపూట భోజనము పెట్టడము కొంతకాలము జరగగా

జరిగింది. ఆ లెక్కలను పరిగణించుకుని యిప్పుడు కొన్ని ప్రదేశాలలోనైనా పెట్టడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— ఇప్పుడు కొన్ని ప్రదేశాలలో మాత్రమే అవిధంగా పెట్టడానికి ప్రభుత్వము పూనుకోటానికి, కొన్నిచోట్ల పెట్టి కొన్ని చోట్ల పెట్టకపోతే అది discrimination క్రింద కనబడుతుందేమోనని భావిస్తున్నాము. అందుచేత అన్నిచోట్లలోనూ భోజనము పెట్టటానికి డబ్బు సుమారు నలభై లక్షలదాకా అవుతుందని అంచనా వేశాము.

SRI SHAIK MOUALA SAHEB :— అధ్యక్షా, బడిపిల్లలకు భోజనము పెట్టే విషయములో ఒక్కొక్క జిల్లాలో అభివృద్ధి చెందని తాలూకాలలో ఎక్కువమంది పిల్లలు వుంటున్నారు. కొన్నికొన్ని తాలూకాలలో కొద్దిసంఖ్యాకులు వున్నారు. పోని సంఖ్యాబలము తగ్గివున్న వెనుకబడిన తాలూకాలలో కొంతమటుకు అయినా ఆ డబ్బును సర్దుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :— ముందుబడ్డ తాలూకాలలో కాని, వెనుకబడ్డ తాలూకాలలోగాని అటువంటి ఆలోచన లేదని చెప్పాను.

*Polytechnic School at Vuyyuru in Krishna district.*

448—

* 1152 Q.— SRI A. KALESWARA RAO : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government are aware that the Polytechnic at Vuyyuru in Krishna district was founded by the contributions of leading local ryots and was functioning satisfactorily for some years;

(b) whether it is a fact that some local people have given some buildings to the same;

(c) whether there is any proposal with the Government to shift the said school from Vuyyuru to a place near Guntur now; and

(d) if so, the reasons therefor ?

THE HON. SRI K. VENKATA RAO :

(a) Yes, Sir.

(b) Yes, Sir.

(c) Yes, Sir.

(d) The late Sri A. Gopalakrishnaiah, the donor offered to give to Government free of cost a site of 10 acres of land for the construction of buildings for the Vuyyuru Polytechnic, and to construct at his

THE HON. SRI N. SANJIVAYYA :— పత్త్యాలు సరిగా గమనించినట్లు లేదేమోనని నా సందేహము. యాభై వేలు అని ఖచ్చితముగా వున్నది. కాని అక్కడి పరిస్థితుల దృష్ట్యా ఆ షేరు క్యాపిటల్ను 25-30 వేలకు కూడా తగ్గించండి అని Departmental officers కు చెప్పాము.

*Constitution of new Panchayat boards.*

446—

* 762 Q— SRI. P. GOPALAKRISHNA REDDI :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state whether the Government propose to give effect to the scheme of opening new panchayat boards for villages with a population of not less than 500?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

The scheme mentioned in the question is what has been embodied in section 3 of the Madras Village Panchayats Act, 1950. The question of amending the above section so as to make panchayats viable by constituting them for big enough areas is under consideration.

1950వ సంవత్సరపు Village Panchayats Act 3 వ శెక్షను ప్రకారము యీ పంచాయితీలు ఏర్పాటు యిదివరకే జరిగింది. అంతకంటే యిప్పుడు 500 జనాభాగల గ్రామాల లోపంచాయితీలు ఏర్పాటు చేయాలని ప్రభుత్వము వుద్దేశిస్తున్నదిగాని అటువంటి ఏర్పాటు చేయటానికి viable గా వుండడము లేదు గనుక ఎక్కువ జనాభాగల areas లో పంచాయితీలు ఏర్పాటు చేయాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

*Midday meals for Harijan and Backward Class boys in elementary schools.*

447—

* 1168 Q.— SRI. G. NAGESWARA RAO : Will the Hon. the Chief Minister be pleased to state whether there is any proposal to introduce the system of midday meals for Harijans and Backward Class boys reading in other elementary schools also?

THE HON. SRI B. GOPALA REDDI :—
The answer is in the negative.

SRI S. VEMAYYA :— లోగడ 1946-47 వ సంవత్సరములో జిల్లాబోర్డు స్కూళ్లు అన్నింటిలోనూ మధ్యాహ్నపుపూట భోజనము పెట్టడము కొంతకాలము జరక్కూ

జరిగింది. ఆ లెక్కలను పురస్కరించుకుని యిప్పుడు కొన్ని ప్రదేశాలలోనైనా పెట్టటానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— ఇప్పుడు కొన్ని ప్రదేశాలలో మాత్రమే ఆవిధంగా పెట్టడానికి ప్రభుత్వము పూనుకోటానికి, కొన్నిచోట్ల పెట్టి కొన్ని చోట్ల పెట్టకపోతే అది discrimination క్రిందకువస్తుందేమోనని భావిస్తున్నాము. అందుచేత అన్నిచోట్లలోనూ భోజనము పెట్టటానికి డబ్బు సుమారు నలభై లక్షలదాకా అవుతుందని అంచనావేశాము.

SRI SHAIK MOUALA SAHEB :— అధ్యక్షా, బడిపిల్లలకు భోజనము పెట్టే విషయములో ఒక్కొక్క జిల్లాలో అభివృద్ధి చెందని తాలూకాలలో ఎక్కువమంది పిల్లలు వుంటున్నారు. కొన్నికొన్ని తాలూకాలలో కొద్దిసంఖ్యాకులు వున్నారు. పోని సంఖ్యాబలము తగ్గివున్న వెనుకబడిన తాలూకాలలో కొంతమటుకు అయినా ఆ డబ్బును సర్దుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :— ముందుబడ్డ తాలూకాలలో కాని, వెనుకబడ్డ తాలూకాలలోగాని అటువంటి ఆలోచన లేదని చెప్పాను.

*Polytechnic School at Vuyyuru in Krishna district.*

448—

* 1152 Q.— SRI A. KALESWARA RAO : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government are aware that the Polytechnic at Vuyyuru in Krishna district was founded by the contributions of leading local ryots and was functioning satisfactorily for some years;

(b) whether it is a fact that some local people have given some buildings to the same;

(c) whether there is any proposal with the Government to shift the said school from Vuyyuru to a place near Guntur now; and

(d) if so, the reasons therefor ?

THE HON. SRI K. VENKATA RAO :

(a) Yes, Sir.

(b) Yes, Sir.

(c) Yes, Sir.

(d) The late Sri A. Gopalakrishnaiah, the donor offered to give to Government free of cost a site of 10 acres of land for the construction of buildings for the Vuyyuru Polytechnic, and to construct at his

cost a hostel building to accommodate 100 boys at a cost of nearly one lakh of rupees in a portion of the above land. The heir of the late donor has now expressed his inability to abide by, the offer made by the late donor except to the extent of a free gift of land of 10 acres worth about Rs. 50,000. This is only a small fraction of the total outlay of about Rs. 25 lakhs required for a proper Polytechnic.

Vuyyuru was not also considered very suitable for the location of a Polytechnic. Guntur was preferred to Vuyyuru for the location of the Polytechnic for the following reasons :—

(1) The students from Guntur and Krishna districts who form the majority of the students at Vuyyuru Polytechnic will not be inconvenienced.

(2) The students from Rayalaseema also will find Guntur as near their home districts as possible especially after the Rayalaseema Polytechnic of Bellary has gone over to Mysore State as a result of the partition.

(3) Guntur has an industrial atmosphere and is not far from Vijayawada which is the main industrial centre of Andhra next to Visakhapatnam.

SRI A. KALESWARA RAO :— గోపాల కృష్ణగారి ధర్మ్మములకు ట్రస్టీలు ఏర్పడి, గవర్నమెంటుకు ఏమోయిస్తామని అన్నారని తెలిసింది. ఏమియిస్తామని అన్నారుః అదిపుచ్చుకుని, యిదివరకు యిచ్చిన ధర్మములతోసహా అన్నిగూడా యిదివరకు అవివున్న చోటనే వుంచినట్లైతే బాగావుంటుంది. మార్చితే బాగావుండదేమోననే సంగతి ప్రభుత్వము ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :— మొట్టమొదట లేదని అన్నారు. మరల యీమధ్య కొంతమంది M. L. A'ల సంతకాలతో ఒక వుత్తరము ప్రభుత్వానికి పంపించారు. ఆవిషయము ప్రభుత్వము విచారిస్తున్నది. కాని ప్రశ్న వేసిన నాటికి వున్న పరిస్థితులను అన్నీ విపులముగా మనవి చేశాను.

SRI M. R. APPA RAO :— ఈ మధ్య గోపాలకృష్ణ ట్రస్టువారు అయిదారు లక్షలు ఖరీదు చేసే buildings కొన్ని వ్రాసియిచ్చారు. ఆ సంగతి మంత్రిగారికి తెలుసునా? దాని విషయములో ఏదైనా కాగితము వారివద్దకు వచ్చిందా ?

THE HON. SRI K. VENKATA RAO:—వ్రాసియిచ్చినసంగతి నాకు తెలియదు.

SRI A. KALESWARA RAO :— ఈ మధ్య ఆ ట్రస్టీలు అనుకున్న ప్రకారము గవర్నమెంటువారికి యిచ్చినట్లైతే, గవర్నమెంటువారు ఆ ప్రకారము చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :— ఈ విషయము మరల పునర్విచారణ చేయాలి. ఒకసారి వేసిన ఆర్డరును ప్రతిరోజూ మార్చుకోవటం అంటే, కొంచెము కష్టముగా వుంటుంది.

SRI A. KALESWARA RAO :— ఇందులో రెండు విషయాలు వున్నవి డబ్బు వచ్చింది అంటే, దాన్ని పోగొట్టుకోకుండా వుంచడము, రెండవది, యీ ధర్మము వెనుక వుండిన చోటులోనే వుంచడము కనుక యీ విషయములో యీ మాత్రపు పెద్ద ఆర్డర్ల మార్చడమునేది ప్రభుత్వానికి కష్టమా ?

THE HON. SRI K. VENKATA RAO :— ఏమి వున్నది ? మహమ్మద్ బీన్ తుగ్లక్ అని అనుకుంటారు ?

SRI K. VENKATARATNAM :— అధ్యక్షా, నాలుగు లక్షలు ఖరీదు చేసే స్థలము buildings యింకా పది యకరాల భూమి trust వారు వ్రాసి యిస్తామని అన్నారు. ఆ విషయములో మంత్రిగారిని పునర్విచారించామని వారికి ఒక మెమోరాండము యిచ్చారు. దాన్ని గురించి ఏదైనా ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :— అలాంటి వుత్తరము ఒకటి వచ్చిందని నేను చెప్పాను. దీన్ని గురించి విచారణ చేస్తున్నామని చెప్పాను. కాని నన్ను యివ్వాళ కమిట్ కమ్మని అంటే, ఎంత చెప్పినను, వేళ తప్పిపోయిన తరువాత కొంచెము కష్టమవుతుందేమోనని అనుకుంటున్నాను.

SRI B. APPA RAO :— Hindustan Ship Building yard యొక్క మేనేజిమెంటు వారు చాలా వరకు ఖర్చు భరించుకుంటామనిన్నీ అక్కడ Polytechnic ను start చేయమని ప్రభుత్వాన్ని కోరినట్లు తెలుస్తున్నది. ఈ సంగతి నిజమేనా ?

THE HON. SRI K. VENKATA RAO :— నా వద్దకు అలాంటిది యేమీ రాలేదు. వచ్చినప్పటికిన్నీ, అక్కడ పెట్టటానికి వీలులేదు. ముందు chance రాయలసీమకు యిచ్చి అక్కడ పెట్టితీరాలి.

*Raid by Communists in Bandalayacheruvu of Divi taluk*

449—

* 772 Q—SRI S. R. Y. SIVARAMA PRASAD BAHADUR : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether it is a fact that a party of Communists raided the house of one Simhadri Ramakrishnayya of Bandalayacheruvu, hamlet of Avanigadda in Divi taluk of Krishna district immediately after the elections;

(b) whether one of the leaders of the 'raid party' by name; Paruchuru, admitted before the police that the party went there to raid the house;

(c) whether any action was taken in the matter; and

(d) if so, the nature of the action taken?

THE HON. SRI N. SANJEEVA REDDI .—

(a) Yes.

(b) No, Sir.

(c) and (d) The Police immediately rushed to the scene, arrested eleven persons under section 151 Cr. P. C. and prevented further trouble.

SRI V. VISWESWARA RAO :— ఆ తాలూకాలో గ్రామాలమీద దాడి చేయటానికి నాయకత్వము వహించినవారికి చల్లపల్లి జమీందారుగారు భూములు పంచిపెట్టుతున్నారని తెలిసింది నిజమేనా ?

MR. SPEAKER :— That is a different question.

*Cherukupalli Tanning Demonstration Party.*

450—

* 1446-F Q—SRI M. RAJARAM : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) when the tanning demonstration party was started at Cherukupalli;

(b) Whether it is a fact that it has stopped work for want of materials;

(c) whether it is a fact that the trainees have not been paid for the last 3 (three) months; and

(d) who is the officer-in-charge of the Tanning Demonstration Party?

THE HON. SRI K. VENKATA RAO :

(*a*) :— The Tanning Demonstration Party was started at Cherukupalle on 2—4—1955.

(*b*) :— It has been late for want of complete set of required materials since 15—6—1955.

[26th September 1955

(c) :— The trainees have been paid upto the end May 1955.

(d) :— The Assistant Director of Industries and Commerce Vijayawada is the officer incharge of the Tanning Demonstration Party at Cherukupalli in the Guntur District.

SRI M. RAJARAM :— ఈ సెంటర్స్‌లో training పొందేటటువంటి విద్యార్థులు వారికి మూడు నాలుగు నెలల నుంచి జీతాలు రావడము లేదని complaint చేస్తున్నారు. అది త్వరలో యివ్వటానికి ప్రభుత్వము ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :— వారికి యిచ్చేది జీతాలు కావు. అది వారికి నే training period లో వారి పోషణకుగాను యిచ్చే డబ్బు. అక్కడ పని వున్న రోజులలో జూన్ నెల ఆఖరు వరకూ యిచ్చేస్తామని చెప్పాను. ఈ మధ్య అక్కడ material లేని కారణముచేత పనులు జరగటము ఆగిపోయింది. కాబట్టి అది ఒక హక్కుగావారు కోరి పుచ్చుకోటానికి వీలులేదు. వారు అక్కడనే గనుక నివాసముగా వుండడానికి సమ్మతిస్తే, వారిని పోషించటానికి ప్రభుత్వము ఆలోచిస్తుంది.

SRI S. NARAYANAPPA :— ఇటువంటి Training centres ఎన్ని వున్నవి ? ఉంటే, ఏఏ చోట్లలో పనిచేస్తున్నవో మంత్రిగారు చెబుతారా ?

THE HON. SRI K. VENKATA RAO :— రెండే వున్నవి.

## II. ADJOURNMENT MOTION RE :—

*Deciding dispute about the Southern borders of the Andhra State*

MR. SPEAKER :—Sri Vavilala Gopalakrishnayya has given notice of an adjournment motion, which reads thus :

"This House stands adjourned to discuss the situation arisen in the border areas out of the Andhra Government's acceptance of the conditions laid down by the Residuary Madras State Government on the issue of deciding the dispute about the southern borders of Andhra State, without the consent of the local inhabitants of the border areas."

If the Chief Minister has anything to say on the matter it is quite welcome.

THE HON. SRI B. GOPALA REDDI :— ఇప్పుడు ముంచుకు వచ్చే ప్రమాదము ఏమీ జరగలేదు. ఆ ప్రభుత్వానికి ఈ ప్రభుత్వానికిమధ్య బహుశా నవంబరు మాసములో సంప్రతింపులు జరుగుతున్నవి అను కొంటాము. అందువల్ల దానిని అంగీకరించవలసిన అవసరములేదు. కాబట్టి సభ adjourn చేయవలసిన అవసరము లేదనుకొంటాను.

MR. SPEAKER :—There is no urgency about the motion so the motion I rule out of order.

## III. MESSAGE FROM THE GOVERNOR.

MR. SPEAKER :—I have to announce to the House that the following message dated the 15 th July 1955 has been received from the Governor of Andhra:—

"In pursuance of Article 207, clause (I) of the Constitution of India, I,C.M. Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Andhra Legislative Assembly of the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955."

## IV. SUPPLEMENTARY ESTIMATES OF EXPENDITURE FOR 1955—56.

THE HON. SRI B. GOPALA REDDI :— Mr. Speaker, Sir, I beg t present the Supplementary Estimates of Expenditure for 1955-56.

SRI B. SANKARAYYA :— On a point of order; Sir, ఇక్కడకు వచ్చిన తరువాత సప్లిమెంటరీ డిమాండును మాకు సప్లయి చేసినారు కాబట్టి దీనిని మేము చూసుకొనుటకు టైము లేదు. అందువల్ల దీనిని మరొకరోజు agenda లో చేర్చవలసినదిగా కోరుతున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— ఇప్పుడు గౌరవనీయులైన సభ్యులకు సమర్పిస్తున్నామే కాని దీనిమీద చర్చలేదు.

Sir, under Article 205 of the Constitution of India, when the amount authorised by the Appropriation Act to be expended for the purpose of that year, or when a need has arisen during a financial year for expenditure upon some service net contemplated in the annual Financial Statement, another statement showing the estimated amount of that expenditure shall be laid before the House of the Legislature of the State.

2. The Supplementary Statement of expenditure now presented to the Legislature relates to "New Services" sanctioned during the current year and also a few "New Service Schemes" sanctioned late in 1954-1955 for which advances from the contingency fund were sanctioned during that year, but no supplementary grants were obtained from the Parliament.

*Grant XV Education* :

The Supplementary Demand under this head is due to the grant of Rs. 8 Lakhs to the Andhra University towards the starting of an Engineering College at Waltair during the current year in order to increase the number of Engineering personnel required for schemes in the Second Five Year Plan, the opening of Compressed Diploma Courses at the Government Engineering Colleges at Anantapur and Kakinada, the opening of new elementary schools and a large number of single teacher schools in the Schoolless villages, and the payment of a grant to the Osmania College at Kurnool for consructing additonal buildings to cope with the increased admissions into the College consequent on the location of the capital at Kurnool.

*Demand XVI. Medical* :

The Medical Benefit Scheme under the Employees' State Insurance Act has been introduced in the State in the current year. The Government have also decided to open a Chemical † Examiner's department, and a Regional Laboratory at Visakhapatnam. For starting clinical courses in the Medical College, Guntur, certain improvements have to be made to the College and Hospital at Guntur in accordance with the University Commissions' recommendations.

*Grant XX. Co-operation* :

This supplementary Estimate included schemes sanctioned for giving grants-in-aid etc., to co-operative societies for intensive milk supply in the two municipal towns of Kurnool and Guntur. It also covers the grant-in-aid sanctioned by the Government of India from the Handloom Development Fund to the Andhra Co-operative Spinning Mills Limited, at Guntakkal, which amount has been credited to a receipt head.

*Grant XXI. Industries*:

The Supplementary Demand under this head has been necessitated by the introduction of 18 schemes relating to small scale Industries during the current year.

*Grant XXII. Welfare of Schedule Tribes, Castes and Other Backward Classes* :

The Demand is due to expenditure sanctioned by the Government for the development of roads, and the formation of new roads to facilitate transport of forest produce in the Agency areas.

*Grant XXIV. Civil works :*

This grant is intended to cover expenditure to Government on account of the acquisition of the house in Madras where Sri Potti Sreeramalue died. It also covers expenditure sanctioned for laying road from Macherla to Nagarjuna Sagar Dam side.

*Grant XXV. Civil Works - Establishment and tools and plant :*

This grant is in respect of expenditure sanctioned for the erection of Workshops and stores at Vijayawada for undertaking major repairs to tools and plant and also for the purchase of plant and machinery at a cost of Rs. 17.74 Lakhs.

*Grant XXVI. Civil works - Grants - in-aid :*

This is to cover grant to the Cuddapah District Board towards the expenditure on road works undertaken for the relief of unemployed agricultural labourers.

*Grant XXXI. Miscellaneous :*

Owing to the inadequacy of the existing basic agricultural schools and extension training centres for training village guides, the Government have sanctioned the opening of additional institutions.

*Grant XXXIV. Capital on Irrigation :*

This is intended to cover larger expenditure under the Additional minor Irrigation programme for which loan assistance from the Government of India is available.

*Grant XXXVIII. Capital outlay on civil works :*

The Supplementary Demand has been necessitated on account of sanctions relating to improvements to the Government General Hospital at Kurnool, construction of additional buildings in the Government Mental Hospital at Waltair, construction of residential quarters for the staff working in the National Extension Service, Community Development, and Community Project Areas and the construction of the Office buildings for the Block Development Officers.

*Grant XXXIX. Capital outlay on Electricity schemes :*

This covers expenditure anticipated on the acquisition of the Rajahmundry Company Electrical undertaking, and the sanction of

schemes by the Government for extension of supply of power for agricultural, Industrial, domestic, street lighting etc., services. Sir, I move.

## V. GOVERNMENT BILLS

### (1) THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) BILL, 1955.

---

THE Hon. SRI K. CHANDRAMOULI : Mr. Speaker, Sir, I beg to introduce the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955 and move that the Bill be referred to select Committee consisting of the following members:

THE HON. SRI N. SANJEEVA REDDI
THE HON. SRI K. CHANDRAMOULI
SRI M. NAGESWARA RAO
SRI S. K. V. KRISHNAVATHARAM
SRI KAKANI VENKATARATNAM
SRI T. RAMACHANDRA REDDI
SRI P. THIMMA REDDI
SRI K. PUNNAYYA
SRI P. SUNDARAYYA
SRI PILLALAMARRI VENKATESWARLU
SRI T. PAPA RAO
SRI C. S. SURYANARAYANA RAJU
SRI G. JAGANNATHA RAJU
SRI M. SATYANARAYANA RAJU

1947 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీన, ఆ తరువాత మనము ఏవైనా ఇరిగేషను సదుపాయములు చేస్తే వాటిలో 25 వేల రూపాయిలకన్నా ఎక్కువ అయిన స్కీములవల్ల, నీటిసదుపాయములు ఏర్పడిన భూములకు విలువ ఎక్కువ రావడమే కాకుండా; పంటలు కూడా ఎక్కువగా పండుటకు అవకాశము, పంటలు పండుటకు సెక్యూరిటీ ఎక్కువగా ఉంటుంది కాబట్టి వాటిపై betterment levy వేయువలెననేది ఈ బిల్లు యొక్క ప్రధానోద్దేశము. ఇది చిన్నచిన్న పనులకు అన్వయించదు. 25000 రూపాయిలు తక్కువ అయిన వాటికి మాత్రము అన్వయించదు. పనిపూర్తి కావడము తోటి భూమినుంచి హెచ్చుపంట రాదుకనుక 2,3 సం|| లు అయిన తరువాత betterment levy వేయడానికి ఈ బిల్లులో ప్రావిజను ఉన్నది. అంతేకాకుండా ఈ లెవీని రైతులు వాయిదాల మీద సులభముగా తీర్చడానికి వీలున్నది. ఇంకా చిన్నచిన్న

విషయములు ఏవైనా ఉంటే వాటినన్నింటిని సెలక్టు కమిటీవారు ఆలోచించిన తరువాత శాసన సభలో వాటిని చర్చించవచ్చు. అప్పుడు ఇంకేమైనా విషయములు ఉంటే ఆలోచించుకో వచ్చును.

ప్రభుత్వమువారు ఎక్కువధనమును ఖర్చుపెట్టి సౌకర్యములు కలుగజేసి ఎక్కువ పంటలు పండుటకు అవకాశ మిచ్చినందులకు, భూములకు ఎక్కువగా రక్షణ కలుగ చేసినందుకు కొంత betterment levy ప్రభుత్వము తీసుకొనవలెననే ప్రధానోద్దేశ్యముతో ఈ బిల్లును తీసుకొనివచ్చినాము. ఇది న్యాయసమ్మతమైనది. కనుక సభ్యులందరూ ఇది సెలక్టు కమిటీకి పోవడానికి ఒప్పుకోవలసినదిగా కోరుతున్నాను.

MR. SPEAKER :— Motion moved—

"that the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, be referred to a Select Committee consisting of the following members :

THE HON. SRI N. SANJEEVA REDDI
THE HON. SRI K. CHANDRAMOULI
SRI M. NAGESWARA RAO
SRI S. K. V. KRISHNAVATHARAM
SRI KAKANI VENKATARATNAM
SRI T. RAMACHANDRA REDDI
SRI P. THIMMA REDDI
SRI K. PUNNAYYA
SRI P. SUNDARAYYA
SRI PILLALAMARRI VENKATESWARLU
SRI T. PAPA RAO
SRI C. S. SURYANARAYANA RAJU
SRI G. JAGANNATHA RAJU
SRI M. SATYANARAYANA RAJU

Sri Vavilala Gopalakrishnayya has given notice of an amendment which runs thus :

"That this Bill be taken into consideration after 1st April, 1956."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I am not moving my amendment. I shall speak on the motion.

అధ్యక్షా, ఇంగ్లీషులో సామెత ఒకటి ఉన్నది : "చావు, పన్నులు తప్పవు అని." చావు ఒకేసారి వస్తుంది. పన్నులు ప్రతి సంవత్సరం వస్తాయి అని ఇంగ్లీషులో సామెత

ఉన్నది. ఆ సామెత ఇక్కడ నాకు జ్ఞాపకం వస్తోంది. Betterment జరిగింది, దానికి పన్ను వేయాలన్నా ఒక ప్రయోజనకరమైన పనికి పన్ను వసూలుచేస్తే ఎవరూ కాదన లేరు. అసలు పన్నులు వేసే విధానం ఏమిటి? దేశవ్యాప్తంగా ఉన్న పన్నుల విధానం ఏమిటి? రాష్ట్రవ్యాప్తంగా ఉన్న పద్ధతి ఏమిటి? ఆదాయం ఎంత పెరిగింది? ఎంత తగ్గింది? Taxation burden పెరిగిందా? తగ్గిందా? ఈ ప్రధాన సూత్రాలమీద పన్నుల విధానం గురించి ఆలోచించాలి. నటరాజన్ గారు joint state లో ఉండగా ఒక పుస్తకం వ్రాశారు. అందులో ఆదాయం పన్నులు గురించి చెబుతూ ఇలా అన్నారు.

"Both per capita money and real burdens of the Central Revenues (without deducting the Province's share of income-tax) have increased in the past decade ...... the money burden from Rs. 2-15-6 (for undivided British India) to Rs. 14-11-3 (for Indian Union) or 4.95 fold; the real burden, from Rs. 2-15-6 to Rs. 3-14-6 or by 31.63 per-cent. In other words, along with a fall of 10.1 per cent in the per capita real income, the burden of taxation at the Centre has also risen by 31.63 per cent making the net burden heavier than before.

The Nation Income of Indian Union has mounted from Rs. 1,482.4 crores in 1938-39 to Rs. 5,657.5 crores in 1949-50 or 3.82 fold, and National Real Income has risen but slightly to Rs. 1504 crores or by 1.45 per cent. The average per capita income has risen from Rs. 67-8-10 to Rs. 228-10-0 or 3-36 fold, but the per capita real income has fallen from Rs. 67-8-10 to Rs. 60-12-0 or by 10.1 per cent.

The combined per capita money burden of revenue both in the Provinces and at has Centre the however risen from Rs. 6-8-4 to Rs- 23-11-11 or 3.64 fold only while the combined per capita real burden has decreased from Rs. 6-8-4 to Rs. 6-5-4 or by 3.39 per cent. Thus, the decline in the burden of Provincial revenues is considerably offest by the increase in the burden of Central revenues, resulting in a net decrease in per capita real burden to the extent of 3.39 per cent."

కాని తరువాత వచ్చిన పరిస్థితులనుబట్టి చూస్తే పన్నులు వేయడం విషయంలో direct taxes వేయడమా, indirect taxes వేయడమా పన్నుల భారం పెరిగిందా, తగ్గిందా అని చూస్తే పన్నుల భారం తగ్గలేదని తెలుస్తుంది.

Incomes రెండు రకా లున్నాయి. Real income, calculated income అని. Calculated income అంటే ఈ రోజున వుండే ధరవరలను రూపాయలలో లెక్క-

వేయడం. Real income అంటే జీవితంలోని అనుభవాన్ని పురస్కరించుకొని చూడడం; జీవితంలో పెరుగుదల ఉన్నదా ? తిండి, గుడ్డ విషయాలలో పెరుగుదల ఉన్నదా ? తగ్గిందా ? నివాసయోగ్యమైన పరిస్థితులలో పెరుగుదల ఉన్నదా ? సాంస్కృతిక పరిస్థితులలో మార్పు వచ్చిందా ? అభివృద్ధి వచ్చిందా ? ఈ విషయాలను పరిశీలించి చూస్తే real income 10% వరకు తగ్గిపోయిందని చెప్పారు. ఈ వేళ వచ్చిన మార్పును గురించి మహాలనోబిస్ గారు తమ రిపోర్టు (1951) Statistical department వారి తరఫున publish చేశారు. Real income పెరగలేదని అందులో ఖచ్చితంగా చెప్పారు. తగ్గిపోయిన standard అట్లాగే ఉన్నది. Tax burden ఎవరిమీద పడుతుంది? ధరలు పెరిగాయి అని inflation time లో అనుకున్నారు. ఇపుడు ధరలు తగ్గిపోతున్నట్లు కన్పిస్తున్నది. భూమి ధర ఎంతగా తగ్గిపోయిందో రెండు మూడు సంవత్సరాల పరిణామం చూస్తే అర్థం అవుతుంది. సామాన్య జీవియొక్క real income పెరిగిందా, లేదా అంటే పెరగలేదని లెక్కలు చెబుతున్నాయి. ధరవరలలో వచ్చిన డబ్బు తగ్గినట్లు కన్పిస్తున్నది. ప్రభుత్వంలో నూతన విధానాలవల్ల ఎక్కువ ఖర్చు అవుతోందా, లేదా, అంటే ఎక్కువఖర్చు అవుతోంది. కాని ఆ ఖర్చు జీవితంలో reflect కానందువల్ల ప్రజాజీవితంలో సమన్వయం కానందువల్ల వేసిన పన్ను ఇస్తుంటే భారం పెరిగిపోవడమేకాని తరగడంలేదు. Indirect taxes, direct taxes విషయం తీసుకుంటే మనకు ఎక్కువగా direct taxes ఉన్నాయి. మీరువేయబోయేది direct taxes. Indirect tax వేయడంలోకూడా ఒక పద్ధతి ఉన్నది. సామాన్యునిపై పడకుండా కాస్త బాగా ఉన్నవానిపై పడేట్లు ఉండాలి. అగ్గిపెట్టెలమీద వేసేది sales tax. ఇవి indirect taxes. వీటిని వసూలు చేయటంలో చిన్నవాళ్లను రక్షించడం చాలాఅవసరం. Highest level మీద వాటిని తీసుకురావాలి. ప్లానింగు కమీషను ఈ పరిణామానికి Taxation Enquiry Committeeని వేసినారు. వారు కొన్ని taxes ఉపహరించినారు. అందులో కొన్నింటిని వ్యతిరేకించారు.. Higher incomes మీద ఎక్కువగా పన్నును వేయాలని అన్నారు. Agricultral Income-tax బాగావేయాలని చెప్పారు. Betterment tax గురించి రేపు consideration కు వచ్చినప్పుడు మాట్లాడ వచ్చును. ఈ వేళ general porposals మీద మాట్లాడుతాను.

ఈ రోజున పన్నుల విధానము ఎట్లా ఉండవలెనంటే భారము మొయ్యగల్గిన వాడి మీద వెయ్యవలెను. మొయ్యలేనివాడిని దానినుండి రక్షింపబడే పద్ధతిలో ఉండవలెను. ప్రయోజనము ఎవరైతే పొందుతారో వారు భరించేటట్లు చేసే పద్ధతి కావలెను. నూతన చైతన్యాన్ని కల్గించేటట్లు చూడవలెను. మనది Co-operative Commonwealth. Welfare State. మనకు wealth లేకపోతే అది Commonwealth ఎలాగుఅవుతుంది? Welth create చేస్తే Commonwealth అవుతుంది. గోరవాలా రిపోర్టులో వ్రాస్తూ

మొత్తం మనదేశములో indebtedness చాలా ఎక్కువగా ఉన్నదన్నారు. ప్రతివాడికి wealth ఎక్కువ కావలెను. Wealth అంటే రూపాయలు మాత్రము కాదు. భారతదేశము Co-operative Commonwealth. Welfare State కు ఈ నాడు Socialist pattern అని చెపుతున్నారు. చిక్కుపడుతున్న సమస్యలను సమన్వయము చేసి సమాజములో నూతన విధానాన్ని తీసుకొనివచ్చినపుడే మార్పు వస్తుంది. ప్రతివ్యక్తి కూడా ఈ 5 సంవత్సరాలలో మార్పు వచ్చిందా అని అనుకుంటాడు. ఖర్చు ఏమీ తగ్గడం లేదు. మొదట పంచవర్ష ప్రణాళిక క్రింద 2000/- కోట్ల రూపాయలు ఖర్చు చెయ్యడం జరిగింది. గాని 2000 కోట్ల ఖర్చుకు తగ్గట్టుగా లెఖ్కప్రకారం India Income అయిదు రెట్లైనా పెరగాలి. ఆదాయం 4000/- కోట్లైనా ఉండాలి. ఆ పద్ధతిలో మార్పు రాలేదు. అయితే విత్తుపెట్టగానే పండువస్తుందా? ఇది గారడీవాని మామిడాకుల పంట కాదు. వాడు పండు తీస్తాడు. చెట్టు వెయ్యగానే పెరగదు. కొన్ని రోజులకు ఫలితము కనబడాలి. మొదట పంచవర్ష ప్రణాళిక, రాబోయే రెండవ ప్లానులో ప్రజలకు కలిగేది ఏమిటో ప్రతి సంవత్సరం 5% increase కనబడేటట్లు మార్పు రావలెను. అంటే 25% రాష్ట్ర ఆర్థిక విధానంలో మార్పు చూపవలెనని వారు ఖచ్చితముగా చెప్పారు. దానిని గురించి మనము ఏమి చేస్తున్నామని ప్రతివారు ఆలోచించుకొనవలెను. సమాజం వ్యక్తులతోకూడి వుంది. వ్యక్తి సమాజము కావలెనంటే అది కాదు. ప్రతి వ్యక్తి తాను బాగుపడినట్లు అగపడాలి. ఈ రెండింటినీ కలసి ఆలోచించినపుడే spiral పెరిగినట్లు కనబడుతుంది. మార్పు తీసుకొని రావడానికి Commonwealth అమలు జరపడానికి ప్రయత్నం చెయ్యవలెను.

రూరలు క్రెడిటు కమిటీ చెప్పింది. దేశములో Tax burden, Debt burden వల్ల రైతులు బాధపడుతున్నారని మొత్తము ఋణభారము 900 కోట్లుఉందని చెప్పింది. ఇది ఎందుకు పెరిగింది? దానిని సరిదిద్దడానికి కావలసిన facilities create చెయ్యవలెనని చెప్పారు. ఇది ఎందువల్ల పెరిగింది అని ఆలోచిస్తే పన్నులు చెల్లించే సమయములో ధరలు పడిపోవడమువల్ల తాకట్టు పెట్టో, తనకా పెట్టో డబ్బు కట్టడమువల్ల ఋణభారము పెరుగుతుందన్నారు. అప్పు పెరుగుతుంది. ఆదాయము లేదు. పంట రైతు చేతులో ఉన్నంతకాలము ధరలు ఉండవు. వేరుశనగ, పొగాకు, చెరకుగడలు తీసుకొనండి. వాని చేతులలోనుండి పోతే పెద్ద తమాషా జరిగిందా అన్నట్లు ధరలు పెరుగుతాయి. తరువాత నాలుక కరచుకుంటాడు. దీనికి కారణము monopoly వేరే వుంది. ఇది నివృత్తి చేయాలంటే taxation వల్ల ధరల నిర్ణయ పద్ధతివల్ల ప్రభుత్వం control పెడితే పరిస్థితులు మారుతాయి. ఎవరెవరి capacity ఎంత పెరిగిందన్నీ, ఎవరు ముందుకు పోగలరో చూడవలసి వున్నది. ఈ రోజున taxation చెయ్యబోతున్నాం. Recurring expenditure ఖర్చు పెట్టవలెనంటే taxation proposals

మీద ఆధారపడాలని అంటున్నారు కళా వెంకటరావుగారు. ఎవరెక్కువ డబ్బు వస్తే వారికే ఇస్తారా అని అంటున్నాను. సమాజము మొత్తములో ఖర్చు పెట్టాలి కదా. కలిగినవారి పెద్దతనంకు వచ్చి లేనివారికి ఖర్చు పెట్టాలికదా. ఆవు దగ్గర పాలు పితుకు తారు. రోగికి పోస్తారు. అంతేగాని ఆవు పాలు ఆవుకు పొయ్యరు. అట్లాగే సమాజము మొత్తములో ఎక్కడ పితక గలమో అక్కడ పితికి ఎవరికి అవసరమో వారికి ఇస్తాము. క్రింది Speaker వారికి కావలసి ఉంటుంది.

MR. SPEAKER:— We are now discussing about betterment levy

SRI VAVILALA GOPALAKRISHN AYYA :— దానిమీదే ఆధారపడు తుంది కాదా ?

MR. SPEAKER :— Betterment levy ను గురించి చెప్పండి.

SRI. VAVILALA GOPALAKRISHNAYYA :— General taxation గురించి చెప్పిన తరువాత ఈ Special tax చెయ్యవచ్చునో లేదో చూడవచ్చును.

MR. SPEAKER :— Shall we close discussion on this Bill at four o'clock and introduce the other two Bills ?

SRI PILLALAMARRI VENKATESWARLU :— నాలుగు గంటలు అంటే దానిలో చాలా చిక్కువుంది. ఈవిషయం 1930 నుంచి అనేక రూపాలతో వస్తున్నది. దీనిమీద thorough discussion కావలెను. ఈ వేళ కాకపోతే రేపు introduce చేస్తారు.

THE HON. SRI B. GOPALA REDDI :— సాధ్యమైనంతవరకు నాలుగు గంటలకు పూర్తి discuss చెయ్యండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— General discussion ఇప్పుడు చేస్తాము. Details లోకి తరువాత పోతాము.

MR. SPEAKER :— ఈ బిల్లును సెలెక్టు కమిటీకి తొందరగా పంపినట్లైతే వారు చర్చించి వారి రిపోర్టును మనకు వెంటనే ఇస్తారు. తరువాత మనము దీనిని ఇక్కడ చర్చించుకొనవచ్చు.

SRI. PILLALAMARRI VENKATESWARLU:—ఆ కార్యక్రమ మంతా 30 వ తారీఖులోపల కాదు. ఇది అంత త్వరగా అయ్యేటట్లు లేదు. Betterment tax Bill ను next sitting కు పెట్టుకొనవచ్చును. మిగిలినవి ఎట్లా ఉన్నా గుత్తలమీద సిగరెట్ల మీద పన్నుల బిల్లులు ఇంకా ఉన్నవి. Hurry up చెయ్యడం అంత మంచిది కాదు. అని

మంత్రిగారికి చెబుతున్నాను. Betterment levy మీద thorough discussion allow చేయండి.

THE HON. SRI B. GOPALA REDDI :— దీనినిగురించి 5 to 5.30 వరకు discuss చెయ్యండి. Select Committee కిస్తే పూర్తిచేసి ఈ sitting లోనే శాసనంచేస్తే మంచిది అని నా ఉద్దేశము. 4 లేక 5 వ తేదీవరకు ఉంటుంది అసెంబ్లీ.

SRI PILLALAMARRI VENKATESWARLU :— సిగరెట్లు, వజ్రాల బిల్లు చాలా Complicated గా ఉంది. Drafting లో మార్పులు ఉన్నవి. అన్నీ కూడా Select Committee Discussions రాత్రిపూట చేస్తాము అంటె సరికాదు.

THE HON. SRI B. GOPALA REDDI :— 1st 2nd శెలవలు, 9 నుంచి 12-30 వరకు ఉదయంపూట ఉత్సాహంగా ఉంటుంది. కాబట్టి పూర్తిచేయడానికి ప్రయత్నం చెయ్యండి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— ఇప్పుడున్న ఆర్థిక విధానము సామాన్య ప్రజలకు సుఖము వచ్చేటట్లుగా రాగలిగినచోట పనులు చేసే పద్ధతిలో ఉండవలెను. ఇపుడు Betterment Tax ఒక particular section, area మీద వేస్తాము. నిజమే. దాని ప్రయోజనము ఎవరు పొందుతారో వారి మీద పడవలెను. ఈ భారము వహించేవారు చిన్నచిన్నవారు, పెద్దపెద్దవారు ఉన్నారు. నీరు ఇచ్చినందువల్ల ఇతర సౌకర్యములవల్ల ధరలు పెరగవచ్చును. గాని అమ్ముకునే వాడికి ప్రయోజనముగాని, శాంతిగాని ఉండదు. ఒకటి రెండు ఎకరాలు ఉండేవానికి లాభములేదు. Tax చెల్లించేటప్పుడు డబ్బు కావలెను. మనకు credit లేదు. కాబట్టి వీలైనంత వరకు lower strata ను exempt చెయ్యవలెనని నేను అభిప్రాయ పడుతున్నాను. Details ఇప్పుడు suggest చేసేబదులు, general suggestions కనుక, Select Committee కిస్తే అక్కడ చర్చ చేయడానికి అవకాశం ఉంటుంది. నేను చెప్పేది lower strata లో ఉన్నవారికి exemption ఇచ్చి 50 ఎకరాలు, వంద ఎకరాలు, 400 ఎకరాలు; ఉన్నవాళ్ళకూ అంటే ఎక్కువ పొలం ఉన్నవాళ్ళకీ, money crops వేస్తుండే వాళ్ళకూ ఎక్కువ పడేటట్లుగా చూస్తే బాగుంటుందని చెబుతున్నాను. ఈ బిల్లులో రాష్ట్రాలు మొత్తంలోకి వచ్చినటువంటి వాటిని అన్నింటిని చూస్తే చాలా తేడా అవుపడుతోంది. U. P. లో Canal water Tax అని ఒకటి ఉన్నది. ఇప్పటికి 9 రాష్ట్రాలలో betterment levy వేయడానికి శాసనాలు తీసుకు

Sri Vavilala Gopalakrishnayya] [26th September 1955

వచ్చారు. ఈ తొమ్మిది రాష్ట్రాలు Assam, బొంబాయి, Punjab, Pepsu, Rajasthan, Mysore, Hyderabad, Andhra, Madras. బెంగాల్‌లో ఇది రెండో Act. ఇదివరకు ఒకసారి బిల్లు తీసుక వచ్చారు. Taxation Committee enquiry చేసినప్పుడు ఈ బిల్లున్నది. ఇప్పుడు మళ్ళీ దాన్ని మార్చారు. ఈ మార్పులలో ఒకదానికీ వేరొకదానికీ అట్టే సంబంధం ఉన్నట్టులేదు. కాని విధానంలో సంబంధం లేదా? Betterment లో సంబంధంలేదా? లేక సాంఘిక జీవితంలో సంబంధం లేదా? అంటే, ఇండియా మొత్తం అంతా ఒకటే. ఇండియాలో ఏ ఏ వైపున కదిలించినప్పటికీ, అన్నీ ఒకటే పద్ధతిని కదలించాలని అక్కడ చెబుతాము. ఇంకోవైపున చూస్తే local peculiarities ఉంటాయి. ఎక్కువ వేయడానికి వీలుంది అంటారు. దేశం అంతా ఒకటే uniform పద్ధతి ఉండాలంటారా? అప్పుడు దేశం మొత్తంమీద ఒకే పద్ధతిని తీసుకురండి. అదికాదు. ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రంలో స్వాతంత్ర్యం ఉంది. పన్నులు వేసుకునే విధానంలో అంటారు. కాని ఈ betterment tax రాష్ట్ర ప్రభుత్వం స్వయంగా ఇష్టపూర్వకంగా వేస్తున్నదికాదు. కేంద్రప్రభుత్వం planning లో ప్రతిచోటా betterment tax వేయండి. అని చెప్పినందువల్ల వెయ్యకపోతే ఇబ్బంది వస్తుందని, వేసితీరాలని, ఒక All India policy క్రింద వేస్తూ ఉన్నటువంటి పద్ధతి. All India policy క్రిందవేస్తున్నప్పుడు, policy ఒకటేఐనప్పుడు చెల్లించేదానిలో తేడాలున్నాయి. పన్నులువేసే rate లో తేడాఉంది. వాళ్లకిచ్చే rebate లో తేడాఉంది. చెల్లించేటప్పుడు interest లో తేడావుంది. ఇన్ని తేడాలు ఒకరాష్ట్రానికీ వేరొకరాష్ట్రానికీ తీసుకువస్తున్నారు. ఈ బిల్లు ఏ రూపంలో వస్తుందో చూసి, మార్పులున్నట్లయితే అప్పుడు చర్చచేస్తే బాగుంటుందనే ఉద్దేశ్యంతో, details లోకి ఎక్కువగా పోదలుచుకోలేదు. ఎందుకంటే Assam లో ఉన్న పద్ధతి ఒకటి, బొంబాయిలో ఉన్నపద్ధతి ఒకటి. అదే Pepsu లో 30 సంవత్సరాల లోపల తీర్చుకోమన్నారు. కొన్నిచోట్ల 10 percent rebate ఇస్తామన్నారు. మొట్టమొదట ఒకసారే డబ్బు కట్టేసినట్లయితే, మరోచోట 20% rebate ఇస్తామన్నారు. కొన్నిచోట్ల 5 percent వడ్డీ వసూలుచేస్తామన్నారు. కొన్నిచోట్ల 12 percent వడ్డీ వసూలు చేస్తామన్నారు. ఈ విధంగా వడ్డీ వసూలు చేయడంలోకూడా తేడా ఉన్నది. మొట్టమొదట ఆలోచించవలసినది ఈ betterment వెయ్యడం న్యాయమా? కాదా? ఇదిఅవసరమా? కాదా? అనేది ప్రశ్న Betterment వేయడంవల్ల కొందరికి ప్రయోజనం ఉన్నది. కనుక వేస్తామనుకుంటే ఆ వేసేటప్పుడు lower strata exempt కావాలి, పై strata కు ఉండాలి అనేవిషయంలో, దానికి కావలసిన పద్ధతిఏమిటనేవిషయంలో Select Committee ఆలోచిస్తుందనుకుంటున్నారుకనుక, అందరూకూడాSelect Committee mood లో ఉన్నారుకనుక, నేనుకూడాఆ Select Committee నిర్ణయాలకొరకు ఎదురుచూస్తాను. నేను చెప్పేది ఒక్కటే ఈ lower

strata నిమాత్రం ముట్టుకోవద్దు. ఇప్పటికే ఋణభారంతో వాళ్ళు బాధపడుతున్నారు. వాళ్ళ ఉత్పత్తి చేసేవాటి ధరలన్నీ పడిపోయి అమ్ముడుపోకుండా వాళ్ళు బాధపడుతున్నారు. వాళ్లుకొనుక్కునే industrial goods ధరలేమీ తగ్గకుండా రోజురోజుకూ భారం ఎక్కువై బాధపడుతున్నారు. ఇవన్నీ గుర్తుంచుకుని మీరు ఆలోచించాలి. బలం ఉన్నది కనుక వేస్తామనే పద్ధతి కాకుండా, వారికి ఎక్కువ సౌకర్యాలిచ్చేందుకు ప్రయత్నించమని కోరుతున్నాను. సంవత్సరాలలో కూడా తేడా ఉన్నది. కొందరు 5 సంవత్సరాలు వేశారు. 1947 లో మనం వేశాం. 1949 నుంచీ అమలు జరపాలన్నారు. 1953 October 1 వ తేదీ వేసుకోండి. ఆరోజు వరకూ తయారుచేసింది తీసుకుంటే బాగా ఉంటుందేమో అది ఆలోచించండి. అల్లాకాదు, వాళ్ళు పూర్వం బాగా ప్రయోజనం పొందిఉన్నారు, మేము వదలిపెట్టం రూపాయికి పావలా చొప్పున నీటి తీరువా ఎక్కువ వేయబోతున్నారు. అల్లా ఎక్కువ వేయబోతున్న పరిస్థితులలో దీన్ని కూడా వేసేటప్పటికల్లా ఈ రెండింటిదీ ఎంత భారమవుతుందో ఆలోచించాలి. అందువల్ల నేను మనవి చేసేది ఈ రెండూ సమగ్రంగా ఆలోచించి, బీద ప్రజానీకానికి, lower strata కి relief వచ్చేటట్లు చూడండి. బాగా వున్న ఆవును ఎంత వరకు పిండగల్గుతారో పిండేసి పంచండి అనీ, అసలు taxation యొక్క ప్రధాన సూత్రాలు చర్చించమనీ కోరుతున్నాను.

SRI P. NARASIMHAPPA RAO :— అధ్యక్షా ! ఈ బిల్లులో కొంచం మార్పుచేయవలసినదని Select Committee వారినికోరుచున్నాను. 47నుంచీ అని బిల్లులో పెట్టారు. ఆరోజులలో ఇష్టంవచ్చినట్లుగా గవర్నమెంటు డబ్బుఖర్చు పెట్టింది. ఆడబ్బుఖర్చు పెట్టడానికి ప్రజల అనుమతి తీసుకోలేదు. ఆరోజులలో grow more food campaign క్రింద గవర్నమెంటు ఇష్టంవచ్చినట్లుగా డబ్బు ఖర్చు పెట్టారు. ఇప్పుడు ఖర్చు పెట్టేది ప్రజల కోరిక పై ఖర్చు పెడతామంటున్నారు. ఇది 47 నుంచి తీసుకువస్తున్నామంటే కూడా ఆరోజులలో ఖర్చు పెట్టిన డబ్బు ఇప్పుడు మళ్ళీ ప్రజలమీద రుద్దు దామంటే అది చాలా కష్టంగా వుంటుందని మీకు మనవి చేస్తున్నాను. ఇదివరకు చేసిన work విడిచిపెట్టి ఇప్పుడు ప్రజల కోరికపై చేసే టటువంటి దానికి ఈ betterment శిస్తులు వేస్తే చాలా బాగుంటుంది. ఇది revision of rules లో ఉంది. Act లో లేదు. Act లోలేనప్పుడు అది ప్రమాదకరమైనటువంటి పని. అది మార్చమని కోరుతున్నాను. Revision హక్కు Act లో ఉండాలి. ఇప్పుడిందులో rules పెట్టారు. ఈ శిస్తు నిర్ణయించే అధికారం జిల్లా కలెక్టర్లకూ దిగువ అధికార్లకూ పెట్టారు. అది వాళ్ళకివ్వకుండా ముందు మీ చేతులలో ఉంచుకునే టట్లు Act లో పెట్టాలని కోరుతున్నాను. లేనియెడల అది మార్చడానికి మళ్ళీ బిల్లు ఒకటి పెట్టవలసి ఉంటుంది. అది మార్పు లేనప్పుడు దిగువనున్న ఆఫీ

సర్లు వాళ్ళ ఇష్టానుసారము వెళ్ళొచ్చు. అందుచేత ఇప్పుడు Act లోనే దాన్ని ఉదహరించుకుంటే అది చాలా బాగా ఉంటుందని నా ఉద్దేశ్యం. ఆ ప్రకారంగా ఇదివరకు ఉన్న వాళ్ళకు తగ్గించి ఇప్పుడు కొత్తగా వేసేవాళ్ళకే శిస్తు వేస్తే బాగుంటుందేమో నని అభిప్రాయ పడుతున్నాను.

SRI B. SANKARAIAH :— అధ్యక్షా ! ఇప్పుడు ప్రవేశపెట్టిన బిల్లు Betterment tax అని చెప్పి ఆదేదో పెద్ద ఆదాయం వచ్చే పన్ను వేసే బిల్లుగా తెలియజేశారు. ఈ బిల్లు ఆచరణలో పెడితే వచ్చే ఫలితాలేమిటి ? దీన్ని ఏ విధంగా అమలు జరుపగలరు ? నిజంగా దీనివల్ల గవర్నమెంటుకు ఎంత ఆదాయం వస్తుంది. ఈ విషయాలన్నీ పరిశీలించినప్పుడు చాలా complications వస్తాయి. ఈ బిల్లును ఇదివరకు మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు తీసుకువచ్చి, ఇవన్నీ చర్చకు వచ్చేటప్పటికి, దానిని మళ్ళీ pass చెయ్యడానికి పూనుకోలేదు. ఒప్పు దేశైనా graded tax ఆదాయాన్నిబట్టి వేసేదాన్ని అన్ని పార్టీలుకూడా అంగీకరిస్తున్నాయి. ప్రభుత్వంకూడా తీసుకువస్తామని అనేకసార్లు తెలియజేశారు. ఇప్పుడు ప్రత్యేకంగా దీన్ని తీసుకురావడంవల్ల ప్రభుత్వానికి అదనంగా రావడానికి ఏమీ ఆస్కారం ఉండదు. ఒక విషయం ఉదాహరణగా తీసుకుంటే సాగుపడని ఒక బీడుభూమినే తీసుకుందాం. అటువంటి బీడుభూమిలో 25 వేలకు మించి ఒక చెరువు వేశారనుకుందాం. ఆ బీటిభూమిమీద సంవత్సరానికి 5 రూపాయిలో 6 రూపాయిలో పుల్లరి వసూలయ్యేది; ఇప్పుడు చెరువు వేశారు కాబట్టి ఒక పుట్టెడు వడ్లు పండాయని లెక్క వేస్తే దానికి 200 రూపాయిలు ధర వేస్తే, 10 సంవత్సరాలు పెడతాం అనుకోండి. 10 × 200 రెండువేల రూపాయలు ఆ కాలం చేయనుకూడా చేయదు.

THE HON. SRI B. GOPALA REDDI :— ఆరు రూపాయిలు వచ్చేది, రెండు వేల రూపాయిలు ఇప్పుడు వచ్చిందిగదా ? అది ఆయన కృషివల్ల వచ్చిందా ?

SRI B. SANKARAIAH :— ఆరు రూపాయిలు వచ్చేది రెండువేల రూపాయిలు వచ్చిందనే విషయం ఆలోచించవలసినదే. అక్కడుండే పరిస్థితులలో వాళ్ళు రెండువేల రూపాయిలు కట్టగలరా అనికూడా ఆలోచించాలి. తుంగభద్రా Low Level canal క్రింద భూములలో ఇదివరకు జొన్న పండిస్తే ఎకరానికి 70 రూపాయిలు, 80 రూపాయిలు వారికి ఆదాయం వస్తూండేది. అందులో 20 రూపాయిలు ఖర్చులు తీసివేసినా 50 రూపాయిలు మిగులుతుంది.

అసలు ఇదివరకు ఉమ్మడి రాష్ట్రంలో ఉండగా వచ్చినటువంటి బిల్లులో net income అని ఇచ్చారు. ఇప్పుడు ఇచ్చిన బిల్లులో gross income అని ఇచ్చారు. దీనివల్ల ఇప్పుడు ఏమంటే అక్కడ 5, 6, బస్తాల జొన్నలు పండేది రేపు 10, 11బస్తాలు

ధాన్యం క్రింద వేసి దానికేమంటే రెండువందల రూపాయలు వాండ్లకు వచ్చింది అంటూ ఉన్నారు. నిజంగా అది betterment వచ్చినట్లా ? అక్కడ ఇదివరకు జొన్నలు పండినపుడు ఈ జొన్నలనే రోజుకు అర్ధ శేరో పావుశేరో ఆవిధంగా సంవత్సరం మొత్తంమీద ఏ 5, 6 వందల రూపాయలతోనూ ఒక కుటుంబాన్ని గడుపుకోవలసిన పరిస్థితి, నెలకు 40, 50, ఖర్చు పెట్టుకోలేక ఒట్టి జొన్నలనే తినే పరిస్థితి. ఇప్పుడు ఎప్పుడైతే దానిలో ధాన్యంపండించినారో దానివల్ల రెండువందల రూపాయలు income వేశారు. ఇప్పుడు తప్పని సరిగా ధాన్యం పండిస్తారు. ఎవరు జొన్నలు తినరుకదా ? అటు వంటప్పుడు ధాన్యంతిన్నప్పుడుఅదిఏవిధముగా అతనికి betterment అవుతుంది.ఏవిధంగా మళ్ళీ పన్ను కట్టగలడు ? ఈవిధంగాధాన్యంపడించేటప్పుడు రైతు ధాన్యమేవాడుకోవటం సహజం.ఇపుడు ఈ పండించినటువంటి నాలుగు ఎకరములు ఉండేరైతును తీసుకొంటే నాలుగు పుట్లు ధాన్యం పండినపుడు ఇదివరకు జొన్నలతో గడుపుకొనే వాండ్లకు ఎంత మిగులుతుందో ఆలోచించండి. ఇప్పుడు తుంగభద్ర low level canal క్రింద సాగు చేయడానికి కూడ రైతుకు స్తోమతు లేకుండా ఉన్నది. ఇపుడు ప్రభుత్వం ఎన్నో సౌకర్యాలు కలుగజేసి ఎన్నో అప్పులు యివ్వవలసిన పరిస్థితులుకూడా ఏర్పడ్డాయి. ఇప్పుడు తీసుకొన్న అప్పులు వీటి అన్నింటినికూడ తీర్చి, ఇపుడు ఉండేటటువంటి శిస్తుకు ఎటూ water rate అని ఒకటి వేస్తారు. Water rate 7, 8 రూపాయలు. ఇపుడు betterment levy ప్రకారం 10 × 2 = 20 వందలు కట్టి, లేక 5 వందలు కట్టి దీనిపై వడ్డీ 20 సంవత్సరాలకు అని ఇంకొక 50 రూపాయలు, అంటే సంవత్సరానికి ఒక వందో, 70, 80 రూపాయలో కడతారు. అక్కడ కృష్ణా, గోదావరి delta ల క్రింద 8, 9 రూపాయలు శిస్తు ఉంటే, పెన్నారు delta క్రింద 18, 10, 11 రూపాయలు శిస్తు ఉంది. ఇపుడు కట్టినటువంటిదాని క్రింద మాత్రం 70, 80 రూపాయలు శిస్తు వేయడం న్యాయం కాదు. ఒక ఉదాహరణ తీసుకొందాం.

THE HON. SRI CHANDRAMOULI:— ఇది శిస్తు అని అభిప్రాయం express చేస్తున్నారు. అది కాదండి. శిస్తుకు దీనికి సంబంధం లేదండి.

SRI S. SANKARAIAH :— 1947 తరువాత ఒక ఇరిగేషన్ facility 25 వేల రూపాయలకు పైగా ఉండేటటువంటి దానిని చేస్తే, దానిమీద వచ్చేటటువంటి ఆదాయాన్ని ఒక సంవత్సరానికి లెక్క వేసి, దానిపై 10 రెట్లు వేసి 20 సంవత్సరాలలో తీర్చుకోమనడం న్యాయంకాదు. ఉదాహరణకు Gudur విషయం తీసుకొంటాం. Gudurలో 1948 లోనో 1949 లోనో పంబలేరు project అని ఆ చెరువుకు కట్టారు. పదివేలో

ఎంతో ఖర్చు అయింది. నాదగ్గర సరిగా లెక్కలులేవు. అటువంటిది ఇప్పుడు గూడూరులో అదివరకు మనము 5 సంవత్సరాలు average లెక్కలు వేస్తే అదివరకు ఒక సంవత్సరమో రెండు సంవత్సరములో పండి, 2, 3 సంవత్సరాలు ఎండిపోతూ ఉండగు దీనివల్ల 2 సంవత్సరాలు పండి 3 సంవత్సరాలు ఎండిపొయ్యే పరిస్థితి ఉంది. అంతకన్నా దానికి లేదు. అదివరకైనా కాస్త better అయిందా అంటే better అయింది. ఇప్పుడు అక్కడ better అయినపుడు ఇపుడు దానిక్రింద వచ్చేటటువంటి ఆదాయాన్ని 3 సంవత్సరాల average వేయాలన్నారు. 3 సంవత్సరముల average వేసి ఒక సంవత్సరం ఆదాయం తీసుకోవాలన్నారు. అటువంటప్పుడు ఇది వరకు ఏ పండుమో పండుతుంది అని లెక్క వేసి, ఇపుడు పుట్టెడు పండుతుందని లెక్క వేస్తే ఇంకొక వందరూపాయలు ఆదాయం పెరిగిందని చెప్పి దానికి పదిరెట్లు వేసి పదివందల రూపాయలు వేసినట్లయితే, పెరిగిందని లెక్క వేసేది. వర్షాలు ఉంటేతప్ప, సంబలేరుకు నీళ్లు రావు. అందువల్ల ఇప్పుడు గవర్నమెంటు లెక్కలలో ఏదో ఒకసంవత్సరం పండిస్తే దానిని తీసుకోనివెయ్యాలి. 10 తూములు పెరగనాయి అని అంటారు. 10 తూములు 10 × 10 రూపాయలు లెక్క వేస్తారు. దానిని 10 రెట్లు పెంచేది. దానిని 20 ఏండ్లకు భాగించండి. 50 రూపాయలు అందువల్ల ఇప్పుడు ఉండే శిస్తు ఒక పది, పదకొండు రూపాయలు. 50 + 10 = 60 రూపాయలు. గూడూరు తాలూకాలో 60 రూపాయలు 20 సంవత్సరముల పర్యంతం, ప్రతిసంవత్సరం tax చెల్లిస్తూ ఉండాలి.

ఇక్కడ కోవ్వూరు తాలూకాలో మాత్రం 9 రూపాయలో 10 రూపాయలో చెల్లిస్తుఉండాలి, అయితే ఏవిధముగా చూచినప్పటికి కూడ న్యాయముకాదు ? తరువాత ఇందులో చాల చిక్కు ఉంది. ఇపుడు ఏమంటే ఈసంవత్సరం ధరలు తగ్గిపోయినవని నెలక్రిందట అనేక వ్యవసాయ వస్తువుల ధరలు తగ్గిపోయినవని చెప్పి ఎంతో ఆందోళనపడ్డాము. అందువల్ల ప్రభుత్వం ఈ బిల్లు వేసినప్పుడు ఈరోజుఉండే ఏ రెండు వందలో 220 యో ఆ లెక్కను తీసి దానికి 10 ఏండ్లు ప్రభుత్వమే లెక్కలుకట్టివేస్తారు. అసలు వచ్చే సంవత్సరానికి ధరలు ఎట్లాఉంటాయో ఆవచ్చేసంవత్సరం ఏలా ఉంటాయో ఇప్పుడు ఏమి తెలియదన్నమాట. అందువల్ల అప్పుడే ధరకట్టివేస్తే దానికి ప్రతి సంవత్సరము కూడ, దీనిప్రకారమే చెల్లించుకోవాలి. ఇక వచ్చే సంవత్సరం వ్యవసాయ వస్తువులకు ధరలు సగానికి సగము పడిపోయినా ఇక్కడ tax మాత్రం 100 రూపాయలకు పెట్టుతున్నారు. తరువాత దీనిని వసూలుచేసేది ఎవరుఅని నిర్ణయించవలెనని చూచినపుడు దానికి ఖచ్చితంగా ఎవరులేరు. ఎవరో ఒకఉద్యోగిని నియమించవలెనని చెప్పి ప్రభుత్వం ఒక ఉద్యోగిని నియమిస్తుంది అని అన్నారు. ఆయన ఎవరు ? Revenue inspector కావచ్చును. పైవాండ్లు కావచ్చును. ఇంకా క్రిందివాండ్లు కావచ్చును. అందువల్ల దానిని

ఏవిధంగా లెక్కకట్టుతారు. ఏవిధంగా దానిని వసూలు చేయడానికి పూను కొంటారు ? ఈవిధంగా వసూళ్ళు ఎన్నిచోట్ల సరియైనలెక్కలు రాగలుగుతాయి ? రాష్ట్రం మొత్తంమీద ముఖ్యమంత్రిగారు కూడ ఇక్కడ చెప్పిఉన్నారు: ఈ ఇరిగేషన్ రేట్లంతాకూడారాష్ట్రంమొత్తంమీద ఒకవిధముగ avereage చేస్తామన్నారు. మన electricity విషయంలోకూడ కొన్ని thermal stations లోఎక్కువ ఆదాయం కొన్నిచోట్ల, తక్కువ ఆదాయం కొన్నిచోట్ల, వచ్చినదానిని ఒక average రేటు చేశారు. అటువంటప్పుడు ఇప్పుడు రాష్ట్రములోనే ఆదాయం వచ్చేవాండ్లమీద ఎక్కువ పన్ను వేయడానికి మేము తప్పకుండా దానిని బలపరుస్తాము. ఆ విధంగా ఆవరేజి చేయండి అనేది న్యాయమే అవుతుంది. కాని ఇపుడు ఉండేటటువంటి వాండ్లకు హెచ్చుచేయటానికే average కాదు. ఇపుడు ఎంత తక్కువగ ఉందో దాని ప్రకారం అందరికికూడ తక్కువ చేసి ఇంకా income రావటానికి graded tax వేసి ఆదాయంమీద వేస్తే అది న్యాయంగా ఉంటుంది. ఇపుడు electricity కూడా ఆలాగే చేశారు. అటువంటప్పుడు ఈ విషయంలో మాత్రం ఈ విధంగా betterment అని ఏదో పేరుపెట్టి ఏ 40, 50 సంవత్సరాల నుంచి better అయినటు వంటి రైతు లందరిని కూడ betterment కాదని, ఇప్పుడు 47 నుంచి మాత్రం betterment, ఇన్ని సంవత్సరాలనుంచి వాండ్లను అధ్వాన్న పరిస్థితులలో పెట్టి, అసలు వాండ్లు జీవించడానికికూడ పొలాలు లేకుండా, పశువులు పోగొట్టుకొన్న వాండ్లకు ఇపుడు గ్రామాలు అంటిపెట్టుకొని సంకటి ఏదో తింటూ గ్రామాలలో ఉన్నందుకు నేరంగా, ఇపుడు వాండ్లకు త్రవ్వించినదానికి మనము ఇంకా ఏమిటంటే, ఈ విధంగా ఎన్నో విధాలుగా వాండ్లకు సహాయం చేస్తేనేతప్ప ముందుకు రాలేని స్థితిలో రోజుకు రోజు మనము చూస్తున్నాము. ఎన్నో ప్రయత్నాలు చేస్తేనేతప్ప ఇంత పెద్ద guarantee water గ ఉండేటటువంటి ఈ తుంగభద్ర low level canal లోనే రైతులందరిని starve చేసే పరిస్థితులు, ప్రభుత్వం ఇంత కృషి చేస్తున్నప్పటికికూడ, ఇంకా 2, 3 సంవత్సరాలు పట్టే పరిస్థితి ఉంది. అటువంటప్పుడు ఇక్కడ ఎక్కడనో ఒక చిన్న Project 30, 40 వేలు ఖర్చుపెట్టమని చెప్పి ఏ ఉదయగిరి తాలూకాలోనో ఇంకా ఎక్కడో వెనుకబడిన రాయలసీమలో గాని, ఎక్కడైన ఒక 40వేలు ఖర్చు పెట్టితే ఇప్పుడు దాని వల్ల ఈవిధంగా 10 రెట్లు దానిమీద ఎక్కువ ఆదాయం తీసుకోవాలి. అన్నట్లయితే అందులో gross income అని పెట్టడం చాల నష్టకరమైన విషయం. Gross income అని పెట్టినపుడు కొన్ని పరిస్థితులు delta area లో చూస్తే రెండు వందలు వచ్చే ఎకరానికి వందరూపాయలు ఖర్చులు వుంటె పన్ను వేయకుండా సరిపోతుంది. ఇప్పుడు కనిగిరి area లో తీసుకుంటే ఒకవందరూపాయలు ఒకపొలమునుంచి మనం లాభంతీయాలంటే

దానికి 60, 70, 80, రూపాయలు ఖర్చు పెట్టినా రానటువంటి వ్యవసాయ పద్ధతులు ఉన్నవి. అటువంటప్పుడు Gross Income పెట్టినపుడు మొత్తం అక్కడ ఎంతపండు తుందో పండేదానిని అంతా లెక్కతీస్తారుగాని ఆ పండటానికి కావలసిన రోజువారి ఖర్చులు ఎంత అవుతున్నయో లెక్కలోకిరాదు. గట్లు వేసిన లెక్కలు వేరే ఇస్తామని చెప్పారు. గాని అసలు పండించటానికి కావలసిన ఖర్చు మాత్రం దీంట్లో మినహాయించమని ఇదివరకు మద్రాసులో పెట్టిన బిల్లుకన్నా లేదు. పొలాన్ని irrigated గా చేయడానికి కావలసిన first establishment కు పెట్టిన ఖర్చుమాత్రమే తీసివేస్తామన్నారు. గాని అసలు నాటు వేయటానికి ఎరువు వేయటానికి..............

THE HON. SRI K. CHANDRAMOULI:— వ్యవసాయం చేయడానికి అయ్యే ఖర్చులు పూర్తిగా తీసివేసే arrangement ఉంది. permanent గా improvement చేసినదానికి, రెంటికి Provision బిల్లులో ఉంది.

SRI B. SANKARAIAH :— నేను అడిగేది ఆఖర్చులు కాదు. నాటటానికి ఎరువులు వేయటానికి. అసలు gross income అంటే పొలంలో పండే మొత్తం వస్తువుల ఖరీదు. అందులోనుంచి ఎంతతీసివేసేది, ఇపుడు ఈ irrigation facilities వచ్చిన తరువాత దానిని ఈ system కు మార్చవలెనంటే దానికి కావలసిన కాలవలు దానికి కావలసిన గట్లు అదితప్పితే అది పండించే దానికి కావలసినటువంటి రోజువారీ ఖర్చులు ఎరువులు, విత్తనములు వేయుటగాని, ఇతర ఖర్చులుగాని, సంవత్సరం పొడుగునా, 360 రోజులు ఎంత ఖర్చుపెట్టితే, దానిలో అంత పంట వస్తుంది. ఆఖర్చులు మాత్రం మినహాయించినట్లు నాకు కనబడడంలేదు. అట్లా పెట్టినపుడు gross income అనివార్యావలసిన అవసరం కూడవుండదు. Net income అని చెప్పి పెట్టిఉంటే ఈ చిక్కులన్ని కూడాలేకుండ ఉండేదన్నమాట.

ఆవిధంగా చేస్తే gross income వేయవలసిన అవసరముండదు. అటు net income అనే దాంట్లో చిక్కులు ఉండవు. అందువల్ల ఏవిధంగా అసలు మనం పన్నులు ఎక్కువ వేయాలి అనేటటువంటి విషయాలు పరిశీలిస్తు ఉండినపుడు, ఈసందర్భంలో దీన్నిమాత్రం తీసుకురావడం సరియైనటువంటిది కాదు.ముందు అందరము కూడ agree అయి రాష్ట్రంమొత్తంమీద ఈవేళ ప్రభుత్వానికివచ్చే sources ఏమేమి ఉన్నాయో ఆలోచించి అటువంటి విషయాలను ముందుకు తీసుక రావడం సబబుగా ఉంటుంది. అప్పటికి ప్రభుత్వము చాలదు అనుకొంటె తప్పనిసరిగా ఇవిచేయాలి అనుకొని తీసుకొని వచ్చినపుడు, దాంట్లోని సాధక బాధకాలు చూడవచ్చు. కాని, వాటి కంటెముందు ఈ betterment levy అనేది తీసుకు రాకూడదని మనవి చేస్తున్నాను.

ఇదివరకు గత ఉమ్మడి రాష్ట్రంలో కూడా దీనిని చర్చించి చర్చించి ఇది సరియైనటు వంటిది కాదు అని ఎక్కువమంది సభ్యులు, ఇక్కడ ప్రతిపక్షములో ఉన్నవారేకాక ప్రభుత్వ పక్షములో ఉన్నవారుకూడ ఈ betterment tax గురించి చాలాతీవ్రంగా వ్యతిరేకించారు. దీనివల్ల చాలావిధాలుగా కూడా చాలమంది, ప్రభుత్వపక్షములోఉన్న వారు కూడ ఆస్థులు కోల్పోయినట్లున్నది. మొత్తంమీద అందరుకూడ కోల్పోయే పరిస్థితి ఉన్నది. మధ్యతరగతివాళ్ళు దీన్ని చెల్లిద్దామనుకొనే పరిస్థితి కూడ ఏమీలేదు. అందువల్ల దీనిని మాత్రం ఇప్పుడు Select committee కి పంపించినా, మరెక్కడకు పంపించినా కూడ, ఇతరవాటికంటె ముందు తీసుకురాకూడదు అని చెప్పుతున్నాను. తరువాత దాన్ని మూడు సంవత్సరాలు తరువాత వేస్తామని అన్నారు. 1947 నుంచి అని మళ్ళీ అన్నారు. 1947 నుంచి అని అంటూ, కొన్నింటికి మూడుసంవత్సరాలు అన్నారు. ఈ మూడు సంవత్సరములలో దీనికి పెట్టే పెట్టుబడి ప్రభుత్వందగ్గర తీసుకొనే అప్పులు వీటి విషయం ఏమి ఆలోచించినట్లు లేదు. ప్రభుత్వందగ్గర తీసుకొన్న అప్పులు తీర్చ వలసిన పరిస్థితి ఒకటి. ఇంతవరకు ఉన్నపన్నులు తీర్చవలసియుంటుంది. తరువాత ఇప్పుడు అదనంగా ఈ tax కూడ చెల్లించుకోవలసిన పరిస్థితి ఉన్నది. ఇదిమొత్తం రైతాంగానికి అంతకు సంబంధించిది కాబట్టి కాంగ్రెసుపార్టీలోవారు కూడా ఈవిషయంలో తమ తమ అభిప్రాయములను నిర్మొగమాటంగా నిష్పక్షపాతముగా తెలియపరచేందుకు అవకాశము ఇవ్వవలె నని కోరుతున్నాను. ఇది పైకి ఏదో betterment గదా అని అగుపడుతుంది గాని, నిజంగా ఇది రైతాంగానికి చాలా నష్టదాయకమైనటువంటిది కనుక దీనిని మీరు కూడ నిష్పక్షపాతంగా చేస్తారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER :— Shall we observe a convention that gentlemen who are in the Select Committee should not take part in this general discussion. There is a Parliamentary convention like this. Why not we also follow it ?

SRI PILLALAMARRI VENKATESWARLU :— From next time onwards, we shall observe it.

MR. SPEAKER :— Why postpone it.

THE HON. SRI K. CHANDRAMOULI :— Select Committee కి పోతున్నప్పుడు, తరువాత discussion ఎట్లాగో జరుగుతుంది. కనుక ఇప్పుడు discuss చేయడం అనవసరం.

MR. SPEAKER :— Select Committee లో ఉన్నవారు general discussion లో పాల్గొనడం మానివేస్తే బాగుంటుందని సూచిస్తున్నాను.

I am just asking the House to observe this convention.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, దీనికి ఒక చిక్కు ఉంటుంది. ఇక్కడ general గా అందరి అభిప్రాయాలు తీసుకొనిన తరువాతనే Select Committee లో చర్చించవచ్చు.

MR. SPEAKER :— You can express your opinion in the Select Committee.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Other members also must know what I feel about the Bill. ఉదాహరణకు ప్రస్తావనతారంగారు ఇంతకంటె ఎక్కువ వేయమని చెప్తారనుకోండి, then personally I feel that such a person should not be in the Select Committee. At least to fecilitate that.

MR. SPEAKER :— It is my desire to observe this convention.

THE HON. SRI K. CHANDRAMOULI :— ఆయన details లోకి పోతున్నారు.

MR. SPEAKER :— you should confine only to the principles and not details.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Next Bill నుంచి ఆ విధంగా చేస్తాము. ఆ లోపల మన కమిటీవారంత కూర్చొని ఆలోచిద్దాం.

SRI S. VEMAYYA :— అధ్యక్షా, ఈ Bill చాలామంది సాగుబడిదార్లకు నిరుత్సాహాన్ని, అధైర్యాన్ని కలుగజేస్తుందని నేను భావిస్తున్నాను. 1947 సంవత్సరం దరిమిలా చేసినటువంటి అభివృద్ధి పన్నులు ఇచ్చుకోవడమంటే, ఈ పన్నులు ఇచ్చుకొనే టటువంటి రైతులంతాకూడ ప్రక్కన ఉన్నటువంటి ఇతర రైతులను చూచి చాలా బాధపడుతారని నేను భావిస్తున్నాను. ప్రక్కన ఉన్నవారు అంతకుముందే భూమిని అభివృద్ధి చేయించుకొని ఎకరాకు 10 రూపాయలు కడుతూ ఉంటే, 47 తరువాత అభివృద్ధి చేయబడినటువంటి నీటివనరుల గురించి అంత హెచ్చుగా చెల్లించుకొనడం చాలా కష్టంగాను, నిరుత్సాహంగాను ఉంటుందనే విషయం ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాను. ఒక ప్రక్కనే ఉన్నటువంటి రైతులు తక్కువ శిస్తులు కట్టడం, ఇప్పుడు కొత్తగా సాగుచేసు కున్నటువంటి రైతులు మామూలుగా రైతులతోపాటు పన్నులు కట్టుకోవడమే కాకుండా, ఈ betterment levy కూడ కట్టుకోవడం అనేది అంత న్యాయంగా అగుపడదని నేను భావిస్తున్నాను. అంతేకాకుండా 25 వేల పెట్టుబడి పెట్టినదానికి ఇంత వేస్తామని చెప్తూతున్నారు. ఇప్పుడు నెల్లూరు జిల్లాలో ఆత్మకూరు తాలూకాలో చేజెర్ల అనే కాలువ త్రవ్వించారు. మన ముఖ్యమంత్రిగారే

మద్రాసులో ఆర్థికశాఖామంత్రిగా ఉన్నప్పుడు ఈ కాలువను ప్రారంభించారు. దానికి 70 వేలకు పైగా ఖర్చుపెట్టబడినది. కాని ఈ రోజుకుకూడా, ఏ 4, 5 ఎకరాలకు మాత్రమే అది ఉపయోగపడుతున్నది. అది 500 ఎకరాలు పారుదల క్రిందికి వస్తుందని ఎస్టిమేట్లు వేసి ఆ కాలువను త్రవ్వించారు. డబ్బు ఖర్చు చేశారు. కాని దానివల్ల రైతుల కేమి సహాయం జరుగలేదు. కనుక ఈ రోజున 25 వేలకు పైన ఖర్చుపెట్టి irrigation వసతులు చేశాము, కనుక ఈ అభివృద్ధి పన్ను ఇచ్చుకోవాలి అంటే ఎట్లా సాధ్యమవుతుంది. ఈ రోజుకుకూడ ఆ భూములు సాగులోకి తీసుకువచ్చే పరిస్థితిలోలేదు. దానికి గట్లు వేయలేదు. తరువాత అదనంగా వారి దగ్గరనే కొంత అప్పులు తీసుకొనివచ్చే పరిస్థితి వచ్చినప్పుడు ఈ betterment levy అనేది కట్టేదానికి ఎంతమాత్రము ఆస్కారం లేదు. ఎంత చిన్న అభివృద్ధి తీసుకొన్నప్పటికీ ఎస్టిమేటులో 25 వేలు రూపాయలు సులభముగా అవుతుంది. పోనీ ఒక కాలువ త్రవ్విస్తారనుకోండి, ఆ కాలువ త్రవ్వించి వదలిపెడుతారు. తరువాత ఆ కాలువ పూడిపోవడమో మరేదో జరుగుతుంది. ఆ విధంగా ప్రభుత్వం నామకార్థంగా అది చేయడమే జరుగుతుంది. దరిమిలా దాన్ని maintain చేసుకోవలసిన భారము రైతులమీద పడుతుంది. కాని, మేమేమో ఫలాన పని చేశాము, 25 వేలు ఖర్చు పెట్టాము, కనుక మీరు betterment tax ఇచ్చుకోవాలి అంటే, ఆ కాలువలో నీళ్లు రాకపోయినా పన్నులు మాత్రం కట్టుకోవలసి యుంటుందన్నమాట. నీళ్లు రాకపోయినా, పంట పండకపోయినా, ఎలా పన్ను వసూలు చేస్తారని రివిన్యూమంత్రిగారికి సందేహము రావచ్చు. కాని, అక్కడ local గా ఉండే రివిన్యూ అధికారులకు పూర్తిగా అధికారాలు ఇవ్వబడుతున్నాయని ఇందులో సూచించబడింది. అటువంటప్పుడు ఆ అధికార్లు రైతుల యొక్క neglect వల్ల ఈ విధంగా సంభవించింది. గనుక తప్పకుండా వీరి దగ్గర నుండి ఈ పన్ను వసూలు చేయాలనే ఒక రిపోర్టు పంపుతారు. దాన్ని ఆధారంగా తీసుకొని, మేమేమో కాలువ త్రవ్వించాము, మీరు దాన్ని దరిమిలా అర్జీ పెట్టుకోలేదు కనుక ప్రభుత్వానికి ఈ డబ్బు ఇచ్చుకోక తప్పదు అని ప్రభుత్వము ఆదేశించడం జరుగుతుంది. ఇపుడు మామూలుగా మేము చూస్తున్నటువంటి అనేక ప్రదేశాలలో ఇదే జరుగుతున్నది. కాబట్టి, ఒక పనిచేసిన తరువాత ఇవి క్రమంగా ఉన్నదా లేదా, తరువాత దాన్ని maintain చేసే రైతులకు నిజంగా ఇది లాభదాయకంగా ఉన్నదా లేదా అని చూచి, లాభదాయకంగా ఉన్నపుడు, ఈ betterment levy అనేది వసూలు చేసేటట్లు సవరణలు Select Committee లో గాని, ఇక్కడగాని తీసుకొనివచ్చి, ఆ విధంగా చేసినట్లైతేనే, రైతులకు నిరుత్సాహం లేకుండా ధారాళముగా డబ్బు ఇచ్చుకోడానికి వీలుంటుంది. కాని అటువంటిదేది చేయకుండా, క్రింద ఉద్యోగస్థులకే అంతా వదలిపెట్టినట్లైతే, వారు రైతులను neglect అని వ్రాయడం జరుగుతుంది. రైతులమీద పన్నులు పడడం జరుగుతుంది. కాలవ

త్రవ్వించి ఖర్చుపెట్టుకోడం జరుగుతుంది. ఇక్కడ 25 వేలు అనే మాటలోని గూఢార్థం నాకు బోధపడడం లేదు. ఎందుకంటే, ఏ పని తీసుకొన్నప్పటికి, ఒక చెరువు పని తీసుకొన్నా, ఒక కాలువ తీసుకొన్నా ఒక వాగు తీసుకొన్నా కనీసం ఒకలక్ష రూపాయలకు గాని, 50 వేలకు గాని తక్కువ ఎస్టిమేటు ఉండదు. ఒక పెద్దదానిమీద చిన్న అభివృద్ధి చేయాలన్నా, ఉదాహరణకు కనిగిరి రిజర్వాయరు ఉన్నది; దానికి ఒక చిన్న improvement చేయాలన్నా లక్ష రూపాయలకు తక్కువ కాదు. దానివల్ల అదనంగా సాగుకావచ్చు. కాని ఈ చిన్నదానికికూడ అభివృద్ధి అయిందని, 25 వేలకు పైగా ఖర్చుపెట్టామని, కనుక మీరు తప్పకుండా betterment levy ఇచ్చుకోవాలని నిర్ణయించడమనేది అంత సబబుగా లేదు గనుక ఇటువంటి వాటిని కొన్నిటిని మినహాయించవలెనని కోరుతున్నాను.

ఇక్కడ removal of seawage అని వున్నది. ఇది నీటిలో వుండే నాచు, పాచి, మురుగు తీయడము అనేది వున్నది. ఇది తీసే సందర్భములో చాలా అక్రమాలు జరుగుచున్నవి. ఈవిషయము నాకు personal గా బాగా తెలుసును. నాకు తెలుసునని చెప్పడము లేదు. అక్కడ Buckingham Canal లో నీళ్లువుండగానే మరమ్మతులు చేస్తున్నారు. అంటే కాలవలోనుంచి మట్టితీసి లోతు చేస్తున్నారు. ఎంత లోతు తీసింది ఎంతవరకు మరమ్మతు జరిగిందిన్నీ, బైటవారికి తెలియడము కష్టము. అది P. W. D, వారిలో technical staff కే తెలుస్తుందట. ఎస్టిమేట్లు గూడాఎట్లా వేస్తున్నారోగాని, ఎవరినైనా Technical Expert సహాయముతో యిదిపరిశీలింపజేస్తే ఈ estimates యొక్క నిజానిజములు బైటపడుతాయి. Technical expert వల్లఈ verification జరగలేదు. P.W.D. వారు వ్రాసినంత డబ్బు ప్రభుత్వము యిస్తున్నది. ఇందులో మాత్రం డబ్బు దుబారా అవుతున్నమాట వాస్తవమని అక్కడ Technical staff వారే చెబుతున్నారు. నీటిలో లోతుపట్లా కనిపెట్టేది, కాలవఎంతలోతు త్రవ్వారు, ఎంత మట్టుకు అడుగునవున్న నాచు, పాచి, మురుగు, తీశారనేది ఎవరు కనిపెట్టగలరు? ఈ ఎస్టిమేట్లకు 50 వేలరూపాయలనుంచి లక్షరూపాయలకు తక్కువ లేకుండా వున్నాయి. అక్కడ పనిచేసే వారిని ఎంతలోతున త్రవ్వారు అని అడిగితే జవాబు చెప్పరు. అదంతా రహస్యముగా వుంచుతున్నారు. అది ఆ contract దార్లకు P.W.D. వారికి Technical staff కు మధ్యనే గుట్టుగా ఉంచుతున్నారు. Information చెప్పకపోతే అనుమానానికి కారణముగా వుంటుందిగదా? ఈమరమ్మతుల ఖర్చునంతా రైతునుంచి రాబట్టటానికి Betterment tax వేస్తున్నారు. ఎంతఖర్చు చేశారు. Betterment tax కట్టే రైతులకు అయినా ప్రభుత్వము తెలియపరచవలసిన బాధ్యత ఉన్నదని గుర్తించాలి. Betterment tax వేసేముందు, ప్రభుత్వము ముందుకువచ్చి, ఇదుగో ఈ మరమ్మతులమీద యింత డబ్బు ఖర్చు చేశాము. అందువల్ల యింత Betterment tax యివ్వవలసి వుంటుందని

రైతుకు నచ్చచెప్పవలసిన అవసరమున్నది. డిటేల్డుగా ఈకాలవలోనుంచి యింతలోతున త్రవ్వి, మరమ్మతు చేశాము, యింతవరకు సిల్టుతీశాము, యింతవరకు మరమ్మతు జరిగింది అని చెప్పవలసిఉంది. లేకపోతే అపోహలకు కారణమవుతుంది. ఇటువంటి details రైతులకు చెప్పటము తప్పా అని అంటున్నాను. ఈబిల్లు పరిశీలనకు వేసిన సెలెక్టుకమిటీ సభ్యులు యీవిషయాలు అన్నీ consider చేస్తారని ఆశిస్తున్నాను.

1947 వ సంవత్సరము దరిమిలా చేసిన అభివృద్ధికార్యక్రమాలలో నాకు తెలిసినంత వరకు అభివృద్ధిపనులు G. M. F. campaign క్రింద తీసుకున్నారు. ఇప్పుడు నేను చెప్పిన చేజెర్ల బ్రాంచి ఛానల్ కు 70 వేలు ఖర్చు పెట్టారని మనవిచేస్తున్నాను. అంతా G.M.F. campaign క్రింద తీసుకున్నారు. ఈవిషయము అనేకసార్లు ప్రశ్నల సమయములో వచ్చింది. G.M.F. Campaign క్రింద కొన్నితీసికొని, అవిఅన్నీకూడా, 1947 వ సంవత్సరముదరిమిలా పనులు చేసి యున్నారు. అందులో Government of India వారిదగ్గరనుంచిమనకు కొంత డబ్బువచ్చిందని ప్రభుత్వమువారే చెబుతున్నారు. అక్కడనుంచివచ్చిన డబ్బుతో చేసినపనులు 1947 దరిమిలా చేసినపనులన్నీ మినహాయించి కూడా ఇండియా గవర్నమెంటువారు దయతో యిచ్చిన సొమ్మునుకూడా లెక్కకట్టి రైతుమీద అభివృద్ధిపన్ను వేసి వసూలుచేశారు. ఈ విషయము మంత్రిగారు పరిశీలించాలని అంటున్నాను. ఈ G. M. F. works అన్నీ ఎన్ని ఉన్నవి ? Government of India వారి డబ్బుతో చేసిన పనులు ఎన్ని ? అవన్నీ మినహాయించటానికి యీ ప్రభుత్వము పూనుకుంటుందా అని అడుగుతున్నాను. G. M. F. campaign క్రింద కాకుండా regular గా Revenue Department క్రిందగాని, P. W. D. వారి క్రిందకాని ఏఏ పనులు విడివిడిగా చేశారు ? ఇవి ఎంతవృద్ధి కరంగా వచ్చినవి ? ఈనోటిస్ అన్నీ క్రింద original estimates లో ఎన్ని వేయించారు ? చేజెర్ల కాలవక్రింద అయిదువందల యకరాలకుగాను, 70 వేలరూపాయిలు ఖర్చుపెట్టారు. ఇంత ఖర్చుచేస్తే ఈ అయిదువందల యకరాలకు పూర్తిగా నీరుఅందుతుందా ? అయిదువందల యకరాల కంటె ఎంత తక్కువ పారుతుంది ? ఎంత అభివృద్ధిఅయింది ? ఎంత వస్తుంది ? ఈవివరాలన్నీ దీర్ఘముగా మనరాష్ట్రమునకు సంబంధించినంత వరకు లెక్కలు సేకరించి ఈ G.M.F. క్రింద ఇండియా గవర్నమెంటు ఇచ్చిన డబ్బు కాకుండా యీపన్ను వేసేటప్పుడు యీరెంటిని మినహాయించి, దరిమిలాప్రభుత్వము చేసిన దానిమీద, అభివృద్ధి చేసిన దానిమీద, పన్నులు తీసివేయటానికి పూనుకుంటె కొంతవరకు మేలుగా ఉంటుందని చెప్పి మంత్రిగారికి తెలియజేస్తున్నాను. ముఖ్యంగా ఈ విషయంలో నేను మొదట్లో చెప్పినట్లు యీరూల్సు చేయడము కాని, దరిమిలా పన్ను fix చేయడముగాని, అధికార్ల లెక్కలు యివ్వడంలో గాని, రైతులకు చాలా యిబ్బందులు కలుగుతున్నవి. ఈవిష

యము నేను మొదట్లోనే చెప్పాను. దీన్ని పురస్కరించుకొని మనము రూల్సులో పెట్టడములో కొంతవరకు మార్పులు చేస్తారని ఆశిస్తు విరమిస్తున్నాను.

SRI. D. KONDAIAH CHOWDARY:—అధ్యక్షా, శ్రీ రెవెన్యూమంత్రిగారు ప్రతిపాదించిన యీ Betterment Tax బిల్లును నేను బలపరుస్తూ కొన్ని విషయములు చెప్పదలచుకున్నాను. ఈ పన్ను వేయుటములో ప్రతిపక్ష సభ్యులు వ్యతిరేకించడ మనేది చాలా దురూహ్యమైన విషయముగా వున్నది. ఇది సాధారణముగా ఆర్థిక సూత్రాలను బట్టి చూస్తే ఒక విధమైన unearned income గా తయారౌతున్నది. అలాంటప్పుడు ఏ ఆర్థిక సూత్రాల ప్రకారమ అయినప్పటికీగూడా యీ unearned income లో ప్రభుత్వము హెచ్చు భాగము తీసుకోవాలనే సిద్ధాంతాన్ని నవీన ఆర్థిక శాస్త్రులు అన్నీ ఒప్పుకుంటూ వున్నవి. అలాంటప్పుడు ఆర్థిక శాస్త్రులలో అమితంగా సభ్యులు నిత్యము తరిఫీదు పొందుతూ, నిత్యము ఉదయం మొదలుకొని సాయంకాలము వరకూ, ఆర్థిక శాస్త్రము ప్రకారమే నడిచే మన కమ్యూనిస్టు సోదరులు దీన్ని విమర్శించడములో గాని, దీన్ని ఆమోదించలేక పోవడములోగాని అర్థము యేమీ కన్పించడములేదు. కొన్ని సంగతులు మన గోపాలకృష్ణయ్యగారు చెబుతూ యీ అభివృద్ధిపన్నువల్ల అమ్ముకునే వారికి లాభమేగాని, యితరులకు ఏ మాత్రము లాభము లేదని చెప్పారు. కాని ఇందులో సత్యము యేమి లేదని అంటున్నాను. అమ్మకొనక పోయినప్పటికీగూడా, ఒక అభివృద్ధి పొందిన తరువాత ఆ భూమికి అధికంగా నీటివసరులు ప్రభుత్వము కల్పించిన తరువాత యిదివరకు ఆ భూమిలో ఉత్పత్తి అయ్యేదానికన్నా అధిక వుత్పత్తి ప్రభుత్వము చేసే పనులద్వారా సాధింపబడినదని, యీ అధికోత్పత్తిలో ప్రభుత్వానికి అంటే సంఘానికి దీనిలో లాభము రావాలనేది వారు గమనించక పోవడము చాలా దురూహ్యముగా వున్నది. కాబట్టి యిది అమ్ముకోక పోయినప్పటికిగూడా, లేకపోతే నూరు ఎకరాలుగల ఒక ఆసామి అభివృద్ధిపొందిన తరువాత భూమిని అమ్ముకోకుండా వుంటే, అంత మాత్రము చేతనైనా దానిలో లాభము సంపాదించలేరనేనా, దాని అర్థము? అందు చేత అమ్ముకునేవారికే కాకుండా అమ్ముకోకుండా అనుభవించేవారికిగూడా దానిలో అభివృద్ధి పొందారని, అందుచేత ఆ అభివృద్ధి ప్రభుత్వము చేసిన సహాయమువల్ల ప్రభుత్వము వెచ్చించిన డబ్బువల్ల జరిగినది కాబట్టి అందులో అధికంగా ఉత్పత్తి అయిన లాభములో ప్రభుత్వానికి కొంత భాగము చెందవలసి వున్నదని నేను మంత్రి గారికి మనవి చేస్తున్నాను. అయితే దీనిలో యింకొక విషయము చెప్పారు. అది యేమి టంటే, higher strata ను వదిలివేసి పెద్ద status గలవారు అంటే అధికంగా భూములు కలవారి మీదనే వేస్తే బాగా వుంటుందని వారు చెప్పారు. అభివృద్ధి పొందడ మంటే ఒక ఎకరమైనా, నూరుఎకరాలైనా, వెయ్యిఎకరాలైనా, ఒకటే. వెయ్యి ఎకరాలు గలవారుకూడా యీఅభివృద్ధిని సమానంగా పొందినట్లే అభివృద్ధిపొందే విష

యములో భూములుకలవారు వారివారికివున్న భూమికిసమానంగా పొందినట్లే. అందువల్ల అభివృద్ధిపొందినవారిలో lower strata కలవారికి తక్కువ అభివృద్ధి, higher strata కలవారికి ఎక్కువఅభివృద్ధి పొందినారనా? వారివారిభూములకు సరిపోయేది, సమానంగానేపొందుతున్నారు. కాబట్టి యిటువంటివి చక్కగా లేకుండా Select Commitee వారుచూడాలి. అభివృద్ధి అనేదానిలో lower strata గలవారు తక్కువ పొందలేదు. వారుకూడా ఎకరముఒకటింటికీ రావలసిన, అభివృద్ధి అన్ని ఎకరాలకు సమానంగానే వచ్చిందిగనుక, lower strata గలవారిని వదలటము న్యాయముకాదు. వీలుగావుంటే, యీ అభివృద్ధి పన్నువిషయములో graded tax గా తయారుచేసి, కొద్దికొద్ది భూములు కలవారికి Betterment Tax ను తగ్గించి, ఎక్కువభూములు కలవారికి ఎక్కువగా రేటు వేస్తే బాగావుంటుందేమో కాని, అసలుయీపన్ను అభివృద్ధిపన్ను lower strata గల వారిని పూర్తిగా వదిలివేయడమనేది, గోపాల కృష్ణయ్యగారు చెప్పినట్లు అది ఏమాత్రము సబబుకాదని మనవి చేస్తున్నాను.

అయితే ఒక విషయము మాత్రము మనమందరము కూడా ప్రభుత్వానికి మనవిచేయాలని నేను అభిప్రాయబడుతున్నాను. ఈ tax వేయడము అన్నివిధములుగానూ న్యాయమనే నా అభిప్రాయము. అభివృద్ధి పొందని ప్రాంతాలనుంచి యీ పన్నువగైరాలు వసూలుచేసి దానిద్వారా ఆప్రాంతాలను అభివృద్ధిపొందిన ప్రాంతాలనుగా అభివృద్ధిచేశారు. కాబట్టి యీఅభివృద్ధి పన్నుద్వారా ప్రభుత్వానికి వచ్చేఆదాయమునుతీసుకొనివచ్చి అభివృద్ధి పొందని గ్రామాలను అభివృద్ధి చెందించడము న్యాయము కాబట్టి, అందువల్ల ఈ పన్ను వేయడమనేది న్యాయమే. అట్లాకాకపోతే అభివృద్ధి పొందినవారు ఇంకా అలాగే అభివృద్ధి పొందడము, తరువాతి ప్రభుత్వానికిగల ధనాభావముచేత యీ అభివృద్ధిపొందని ప్రాంతాలు అదే stages లో వుండిపోవడమువల్ల అపాయము జరుగుతుంది కాబట్టి అభివృద్ధిచెంది బలపడినవారిచేత పనిచేయించి బలహీనునకు తిండి పెట్టి బలవంతునిచేయడము ఏవిధంగా న్యాయమో అదేవిధంగా యిప్పుడు ప్రభుత్వము ఈపన్నుమూలంగా వసూలు చేసి పెచ్చించడము ద్వారా అభివృద్ధిచెందిన ప్రాంతాలనుంచి వచ్చిన డబ్బును అభివృద్ధిచెందని ప్రాంతాలకు వుపయోగించటానికి వుపయోగముగా వుంటుంది. ఈకారణముచేత ఈ పన్ను వేయడము న్యాయమనే మనవిచేస్తున్నాను. ఇంకొక విషయము. ప్రాంతాలను అభివృద్ధి చెందజేసే విషయములో ప్రభుత్వము చేయవలసిన పనులు చేసింది. అందులో ఎక్కువగా డబ్బువెచ్చించింది. ఒక ఉదాహరణ యీ సందర్భములో చెప్పదలచాము. నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలో చుండి అనే గ్రామానికి చెందిన చెరువు ఒకటివున్నది. ఈ చెరువు దాదాపు 24 సంవత్సరాల క్రిందట breach అయిపోయింది. అప్పటినుంచి 1952 వ సంవత్సరందాక మరమ్మతులు లేకుండావుంది. ఆ చెరువుక్రింద పంటలు కొద్దో గొప్పో పండించుకొన్నటు

వంటివారు, యిన్ని సంవత్సరాలుగా చెరువు మరమ్మతు చేయక పోవడమువల్ల రైతులు నష్టపడుతూ వచ్చారు. వారుపడిన బాధలు చెప్పాలంటే వర్ణనాతీతముగా వుంది. రైతులు ఆందోళన చేయగా చేయగా చివరకు 1952 వ సంవత్సరములో రు 2,80,000 లు ఖర్చుపెట్టి ఆ breach ని close చేశారు. ఇన్ని సంవత్సరాలుగా ఆ చెరువు మరమ్మతు లేనందు వల్ల రైతులకు వచ్చేఆదాయములేకపోగా నష్టమువచ్చిందనే మాటచెప్పక తప్పదు. నష్టము ఏ విధంగా వచ్చిందంటే, తిండికి గింజలు ప్రతిసంవత్సరము కొనుక్కోవలసినప్పుడు, యీ డబ్బు అప్పుచేయటమనేది, నష్టమనే అంటాను. ప్రభుత్వము ఆ రైతుల మీద Betterment Tax ఆ చెరువు మరమ్మతు చేయించారు, ఆ డబ్బు యీ tax ద్వారా యివ్వండి అనడము న్యాయముకాదు. నిజానికి ఆచెరువు బాగుచేయవలసిన బాధ్యత ప్రభుత్వముదైవున్నది సరేకదా, యిన్ని సంవత్సరాలు దాన్ని మరమ్మతు చేయించక పోవడము వల్ల రైతులు నష్టపడ్డారు. ఈ నష్టము ఎవరుయిచ్చేటట్లు ? ప్రభుత్వము యిస్తుందా ? న్యాయముచూస్తే, ప్రభుత్వమే రైతులకు యివ్వాలంటాను. చెరువు 24 సంవత్సరాలుగా రిపేరు చేయించకపోగా, రైతులను నష్టపరచి చివరకు Betterment Tax యివ్వండి అంటే, యిది యేవిధంగాను సబబుకాదు. నిజానికి ప్రభుత్వము రైతులను నష్టపరచి నందులకు, రైతులు కోర్టుకుపోయినట్లైతే, కోర్టువారు జుల్మానా విధించవలసిన పరిస్థితి తప్పిపోయింది. కాబట్టి ప్రభుత్వము యీవిషయములో చేసినతప్పును గ్రహించు తారని అనుకుంటున్నాను. 24 సంవత్సరాలుగా రైతులకు రావలసిన ఆదాయము పోగొట్టినవారైనారు యీ ప్రభుత్వమువారు. ధనాభావము వల్లనైతేనేమి, మరేయితర కారణముల వల్లనైతేనేమి, యీచెరువు రిపేరు చేయించలేదు. చివరకు 1952 వ సంవత్సరములో రిపేరు చేసి betterment taxను వేయాలని చూస్తున్నారు. రైతులకు కలిగిన నష్టపరిహారం గానైనా ప్రభుత్వము యీ Betterment Tax వేయకుండా ఆచెరువు క్రింద సాగుచేసుకునే రైతులను, యీ Tax నుండి మినహాయించవలసిందిగా కోరుతున్నాను. ఈ అభివృద్ధి పన్నును 1947 ఆగష్టునుంచి ఎందుకు వేయాలి, అంతకు ముందు నుంచి ఎందుకు వెయకూడదు అని చెబుతున్నారు. మనం కొంతవరకు న్యాయంకూడా విచారించాలి. 100 సం॥ ల నుంచో, 50 సం॥ల నుంచో అనాదిసిద్ధంగా వున్న వాటిమీద ప్రభుత్వం ధనం వెచ్చించి అభివృద్ధిపన్ను వేసి నటువంటి భూములు రైతులు ఈ గోజువరకు చెల్లించిన శిస్తులువల్ల అయితేనేమి, నీటితీరువ వల్లఅయితేనేమి దానిమీద వెచ్చించిన ధనం ఇంతవరకు recover అయినది కాబట్టి ఇప్పుడు మరల వీటి మీద అభివృద్ధి పన్ను వెయ్యడము న్యాయము కాదు. అందువల్ల కొత్తగాఅభివృద్ధి చెందిన ప్రాంతాలలో కొత్తగా అభివృద్ధిపనులు సాధించి తద్వారా భూమికి ఎక్కువసాగు బడి అయి, ఎక్కువ ఉత్పత్తికి లాయకీ చెందినటువంటి ప్రదేశాల్లో ఈ పన్ను వేయడము న్యాయము. అయితే కొత్తగా ప్రభుత్వమువారు రిపేర్లు చేసినటువంటి భూములను మిన

హాయించి ఎక్కువ వాయిదాలు వారలకు కలుగచేసి, వడ్డీ లేకుండా 20 మొదలు 30 వాయిదాల వరకు పెంచి చిన్నచిన్న వాయిదాలమీద రైతు డబ్బు కట్టుకొనేట్లు చేయవలెను. నిజముగా రైతులు క్రుంగిపోయి ఉన్నారు. ధనములేదు. ధరలు పడిపోయినాయి. అందువల్ల ఆ పద్ధతిగాచేస్తే రైతులకు బాధలేకుండా న్యాయంగా ప్రభుత్వానికి రావలసిన డబ్బు రాబట్టుకొని, ఇతర ప్రదేశముల అభివృద్ధిని సాధించటానికి అవకాశము ఉంటుంది కాబట్టి ఈ పన్నును నేను సమర్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI A. VENKATRAMA RAJU:—అధ్యక్షా, ఇప్పుడు మంత్రిగారు ఈబిల్లును సెలక్టుకమిటీకి పంపిస్తున్నారు కాబట్టి వారి సిఫార్సులు వచ్చేవరకు ఏరకంగా దీనిని వ్యతిరేకించాలో, బలపరచాలో నిర్ణయించుకొన లేని పరిస్థితిలోవున్నాము. ఈ సందర్భములో సెలక్టు కమిటీవారికి కొన్ని సలహాలను ఇవ్వవలసిన అవసరము వున్నది. ఎందుచేతనంటే గతంలో ఉన్నటువంటి ఆంధ్ర ప్రభుత్వము కూడ ఈ బిల్లును తీసుకురావడము అది సెలక్టు కమిటీలోనే ఆగిపోవడము అనేది సంభవించినది. అందువల్ల ఈ బిల్లు సెలక్టు కమిటీలోకి వెళ్లి ఏరూపములో మరల బయటకు వస్తుందో చూచిన తరువాత గాని దానిని గురించి స్పష్టముగా చెప్పలేని పరిస్థితిలో ఉన్నాము. దీనిని మంత్రిగారు మనముందుకు తీసుకువచ్చి వివరాలు చెప్పినప్పుడు 2, 3, genaralisations మాత్రమే చెప్పడము జరిగిందేగాని అది ఆచరణలోకి వెళ్లేసరికి ఎటువంటి ప్రభావంకలిగిస్తుందోస్పష్ట పరచలేదు. ఉదాహరణకు రాష్ట్రంలో ఏ ఏ జిల్లాలో 1947 తరువాత అభివృద్ధి అయిన స్కీములు ఉన్నాయి. అవి ఎన్ని వేలఎకరాలు భూమిఉన్నది, ఎన్నిలక్షల ఎకరాలు వీరునూచించిన స్కీముప్రకారము రాబోతున్నది, అది ఏజిల్లాల్లో ఏప్రాంతాల్లోఉన్నది, ఆస్కీముల యొక్క nature ఏమిటి, అవి అన్నీకూడా వివరించినట్లయితే దానిని మనం ఎంతవరకు బలపరచవచ్చునో, ఎంతవరకు వ్యతిరేకించవచ్చునో కూడా చెప్పగలిగి వుండేవాళ్లము. అటువంటి వివరాలను మనము ముందు practical గా చెప్పనందువల్ల వారికి ఎటువంటి సలహాను ఇవ్వలేని పరిస్థితిలో ఉన్నాము. ఇంతలో అనేక అనుమానాలు కలుగుతున్నవి. ఒక్కొక్క ప్రాంతములో ఉన్నటువంటి ఒక్కొక్క స్కీము 1947 ఆగష్టు తరువాత వచ్చినటువంటిస్కీము దేనికిపడుతుందో అనేది తెలియక అనేకఅనుమానాలకు దారి తీస్తున్నది. ఆంధ్ర దేశంలో కోస్తాప్రాంతాలలో డెల్టాప్రాంతాలు ఉన్నప్పటికికూడా Grow More Food scheme క్రింద 1947 తరువాత పరిశీలించబడి estimate చేయబడి 1947 తరువాత అమల్లోకి వచ్చిన స్కీములుకూడా ఉన్నాయి. అలాగే 1945 - 46 లో ప్రారంభించబడి 1947 లోను 1947 ఆఖరులోను ఉపయోగించబడి నటువంటి పరిస్థితులు కూడాఉన్నాయి. మంత్రిగారు 1947 ఆగష్టు తరువాత ప్రారంభించి వచ్చినవి కాక 1947 ఆగష్టుతో ముగించిన వాటికి కూడా ఇదివర్తిస్తుందని చెప్పారు. ఏ ఏ కేసులకు దీనిని అన్వయించుకోవాలో

కొంచెము వివరంగా ఆలోచించు కోవలసిన విషయము. ముఖ్యముగా దీనిని డెల్టా ప్రాంతములో అమలుజరపడానికి వీలుంటుందని అందుచేత వాళ్లు 25 వేలు రుపాయలుపైన మళ్లీ వాయిదాల ప్రకారం ఇవ్వడముఅనేది కష్టమనే అభిప్రాయం అనేక మెట్టప్రాంతముల వారికికూడా ఉండవచ్చును. ఆ డెల్టా ప్రాంతాలలో ఉన్నటువంటి వారి సాధక బాధకాలనుకూడా పరిశీలించవలసి వుంటుంది. ఉదాహరణకు ఇప్పుడు కోస్తాప్రాంతం అంటే తూర్పు సముద్రము పొడుగునఉన్న జిల్లాల్లో అనేకభూములు 1946-47 సం॥లోను తరువాత అమల్లోకివచ్చినటువంటి స్కీముల్లోకి వచ్చినవి. అవి కేవలం బంజరుభూములుగా ఉండి ఈ Grow More Food scheme తరువాత అభివృద్ధిచేయబడి వున్నది. అందులో సెలైన్ భూములు ఉన్నాయి. అంటె ఎక్కువ ఉప్పుచవుడుగా వుండేటటువంటి భూములు. అక్కడకు కాలువలు తీసుకువెళ్లిన తరువాత అభివృద్ధిఅయినవి వున్నాయి. కాని అది 5, 6 స॥ల్లో పరిపూర్ణస్థితిలోకివచ్చి సరియైన పంటలు పండుచున్నవా అనేది దృష్టిలో పెట్టుకోకుండా కాలువ వెళ్లినది కదా, అని కాలవవెళ్లినప్పట్నుంచీ మరల మనము వాటికి ఈ పన్నును అన్వయించవలసివుంటుందని అంటే, చాలావిపరీతమైన పరిస్థితులు మనముందుకు వస్తాయి. అందువల్ల దీనిని మార్చుకోవలసిన అవసరము ఉన్నది. ఉదాహరణకు గుంటూరుజిల్లాలో వున్నటువంటి రొంపేరుగాని, పశ్చిమ కృష్ణాజిల్లాలో ఉన్నటువంటి కొల్లేరు గాని ఈ రకమైన భూములు ఉన్నాయి. వీటిలో ముఖ్యమైన మురుగు నీటిసౌకర్యాలు కలుగ చేయవలసిన అవసరము గురించి అనేక సంవత్సరాలుగా ప్రభుత్వమునకు విజ్ఞాపనలు వస్తున్నవి. అందులో ఈ మురుగు నీటిసౌకర్యాలను తాత్కాలిక సౌకర్యాలను ఈ grow more food scheme క్రింద చేసినవికూడ వుండవచ్చును. ఈ మురుగునీటిసౌకర్యాలు కూడా ఈనాడు మంత్రిగారు తీసుకువచ్చినటువంటి ఈ అభివృద్ధి స్కీములోకి వస్తున్నవి. అందుచేత ఈ పరిస్థితులన్నీ తొలగించవలసిన అవసరం ఉన్నది. అంతే కాకుండా alteration అనేపదం ఇందులో ఉదహరించారు. దీనికి అర్థం ఏమిచెబుతారో అనేది తీవ్రంగా ఆలోచించ వలసిన అవసరంవున్నది. ఈ సవరణను మార్పు చేసినప్పటికీ, అంటే రెగ్యులేటర్సు మార్పు చేసుకోవటముగాని లేకపోతే ఇతర డాములు వగైరాలు కట్టడము గాని లేకపోతే ఈ పైపింగ్ సిస్టములో వాటి మార్పులుగాని annual repairs annual changes వీటిన్నింటికి కూడా ఈగోజున ఇది వర్తింప చేసేటటువంటి పరిస్థితులు మనకువచ్చినట్లయితే, కృష్ణా గోదావరి ఇరిగేషను area లో వున్నటువంటి remodelising scheme లు గాని, ఇంకేమైనా స్కీములు గాని వున్నట్లయితే సాధారణముగా 25 వేలు రూపాయలుకు తక్కువ వున్నటువంటి స్కీములు చాలా తక్కువ వుంటాయి. ఎక్కువ రు 25 వేలకు మించే వుంటాయి.

(At this stage Temporary Chairman Sri Gottimukkala Jagannadha Raju occupied the chair)

అయితే దీనివల్ల ప్రత్యేకమైన మార్పురాదని మనవి చేస్తున్నాను. ఈపరిస్థితిలో ప్రతిసంవత్సరము వచ్చే దానిని workout చేసుకోవలసిన అవసరము ఉన్నది. నాకు ముందుమాట్లాడినటువంటి సోదరసభ్యులు దీనివిషయమై స్పష్టముగా చెప్పారు. Classify చేయవలసిన అవసరము ఉన్నది. ఎవరిపని ఇందులో వచ్చినప్పటికీ కూడా మినహాయించవలసి వుంటుందనేది ప్రాతిపదికగా ఈ బిల్లు కూడా తీసుకోగలిగినట్లయితే చాలా చిక్కులు ఏర్పడుతాయనేది ముఖ్యముగా ఆలోచించాలి. అయితే 1947 సం|| మునకు పూర్వము రు 100 లు ఆదాయము వచ్చే భూమి ఈ రోజు రు 400 లు ఆదాయము వచ్చే భూమిగా మారపోయినప్పుడు వారందరు కూడా ఎందుకు కట్టలేకపోయారు అనేది మనము చాలా గట్టిగా చెప్పవచ్చును. అప్పులు ఎంతవరకు తీర్చారో కూడా ఆలోచించుకోవలవిన అవసరండున్నది. ఆ అప్పులకు ఏ ఏ భాగంలో చేసి దానినిమార్పు చేసు కొన్నాడో కూడా పరిశీలించవలసిన అవసరము ఉన్నది. ఆ రకంగా ఒకదాన్నిగురించి వున్నటువంటి తరగతులను మినహాయించకుండా మొత్తము అందరూ కూడా స్కీములో వచ్చినమార్పును అంతనూకూడా వున్నది వున్నట్లుగా అన్వయించే పరిస్థితిలో కనుక ఈ బిల్లును తీసుకువచ్చినట్లయితే చాలాచిక్కు పరిస్థితులు ఏర్పడుతాయనికూడా ముఖ్యముగా మంత్రిగారి దృష్టికి ఇప్పడు చేసిన సెలక్టుకమిటీ దృష్టికి కూడా తీసుకురావలసిన అవుసరంవున్నది. మెట్టప్రాంతాలలో ముఖ్యముగా చెఱువుల క్రింద ఆయకట్టగా వున్నటువంటి భూములు పరిస్థితిని మనసభ్యులు చెప్పారు.

అనేక చెఱువులు ముఖ్యముగా జమిందారీ abolition వచ్చినతరువాత అనేక చెఱువులు 8 సం|| లు 10 స|| లు ఏమాత్రము మరమ్మతులు చేయకుండా విడిచిపెట్టడంవల్ల వ్యవహారం ప్రతి సంవత్సరం annual repairs లో 4 వేలు 5 వేలు రుపాయలు మరమ్మతులయి పోయినటువంటి tank లు అన్నికూడా ఒకొక్క టాంకు అదే రు 40 రు 80 లు ఎస్టిమేటు మార్పుచేయాలనే ఘటనలు 7, 8, సం|| లుమిగిలి పోయినందువల్ల ఒక్కొక్కరికి ఈ స్కీముక్రిందకు వచ్చిపడుతున్నాయి. ఈ రోజు మనకు 25 వేలరుపాయలుకు మించివున్న స్కీములు చాలాఉన్నవి. ఈ పరిస్థితులుచాలా జాగ్రత్తగా పరిశీలించి 25 వేలరుపాయలు అని వున్నటువంటి limit ను జాగ్రత్తగా అన్వయించవలసిన అవసరముఉన్నది.

ఈ 10% మామూలుగా వచ్చేఆదాయములోనుంచి సగభాగము అఖర్చులుతీసి వేసి దానిమీద 10 రెట్లు ఆదాయము 20 వాయిదాలమీద తీసుకోవటం అనే estimate ను తీసుకువస్తున్నాము. దీనిని ఆలోచించి చేయాలి. తప్పితే ఇందు ఆంధ్రరాష్ట్రంఅంతటా

ఒకరకమైన percentage లో ఒకేరకమైనపద్ధతిలో మనం వసూలుచేసే టటువంటి కార్యక్రమాన్ని మనముతీసుకొన్నట్లయితే రైతాంగానికి వచ్చేటటువంటిప్రత్యేక లాభాలు లేడావుంటుంది. మనము తీసుకొన్నటు వంటి tax అందరికి ఒకేరకంగా పడేటటువంటి ప్రమాదముఉంటుంది. ఈ పరిస్థితిని వివరంగా కమిటీ పరిశీలనలోకి తీసుకొని ఆలోచించ వలసినఅవసరముఉన్నదని ముఖ్యముగామనవి చేస్తున్నాను. డెల్టా ప్రాంతాలలోఎన్నో channels ఉన్నాయి. ఒక్కొక్క ఇంజనీరు వచ్చి ఒక్కొక్కస్కీము తయారుచేస్తారు. తరువాత ఆ స్కీము పై 40 వేల రూపాయలు ఖర్చు చేయడం, అంతటితో ఆగిపోవడం, మరొక Superintending Engineer వచ్చి మొత్తంగా మార్చడం జరుగుతుంది. దానికి నాలుగైదు లక్షలు ఖర్చుఅవడంతప్ప మరొక proposals వచ్చిన సందర్భాలులేవు. ఖర్చు మాత్రం అయిపోయింది. ఫలితాన్ని మాత్రం అనుభవించలేదు. తిరిగి దీనిని మరొక రూపంలో తీసుకరావాలనే proposals ఉన్నాయి. ఇదివరకుఖర్చు చేసినది కూడా తీసుకొంటే ఇదివరకుసాగు అయ్యేభూములపైకూడా Betterment Levy పడేప్రమాదం ఉన్నది. ఏ ఏ జిల్లాలలో ఎంతెంతభూమి ఈ పన్ను వేసేదానిక్రింద కు వస్తుంది? డెల్టా ప్రాంతంలో ఎట్లాఉన్నది? మెట్టప్రాంతాలలో ఎట్లా ఉన్నది? వచ్చేఆదాయం ఎంత? ఈ వివరాలు ఏమి చెప్పకుండా ఈబిల్లు తీసుకరావడం సరిగ్గాలేదు. ఇవన్నీ కమిటీవారి దృష్టిలోనికి తీసుకొని పరిశీలించాలని కోరుతూసెలవు తీసుకొంటున్నాను.

Sri RAJA V. V. KRISHNAMRAJU BAHADUR:—అధ్యక్షా, గౌరవనీయులైన రివిన్యూమంత్రిగారు ప్రవేశపెట్టిన అభివృద్ధి పన్ను విషయములో వారిని అభినందిస్తూ, ఈ బిల్లును బలపరుస్తూ, కొన్నిసూచనలు మాత్రం మీద్వారా గౌరవనీయులైన మంత్రి గారికి, ఈ బిల్లును పరిశీలించే సెలక్టుకమిటీవారికి కొన్నిసూచనలు చేయదలుచుచున్నాను. ఈ బిల్లులో చర్చించవలసిన విషయాలు గురించి చాలామందిచెప్పారు. అందులో కొన్ని అభిప్రాయాలకు భిన్నంగాఉన్నవి. 1947 సంవత్సరంతరువాత అభివృద్ధిపరచిన ప్రతిదాని విషయమై పన్నువేయాలని ఉద్దేశముతో మాట్లాడుతున్నారు. ఎక్కువడబ్బు ఖర్చుచేసే Capital works మాత్రమే తీసుకుందురు. 100 ఎకరాలు ఆయకట్టుగల చెరువును ఎక్కువఆయకట్టును వృద్ధిచేసి బాగుచేసి ఎక్కువ storage ఏర్పాటుచేస్తే క్రొత్త ఆయకట్టు వచ్చేపరిస్థితిఉంటే తద్రూపేణా పన్నువసూలుచేసే విధానంలో మాట్లాడుతున్నారు. కె.సి. కెనాల్ లోని నీరు క్రింద సిమెంటు వేస్తే నీరుబాగాసప్లయిఅవుతుంది అంటారు. క్రొత్తకాలువనో క్రొత్తచెరువునో త్రవ్వించుకొని పాతచెరువులను బాగుచేసి ఆయకట్టు develop చేసినపుడు ఇటువంటిది వేయరాదు. తూర్పు గోదావరి జిల్లాలో రామచంద్రపురం తాలూకాలో పంపుసెట్లుద్వారా ఇదివరకు నీరుసప్లయికాని ప్రాంతాలకు సప్లయి చేస్తున్నారు. పెద్దపనులు చేసినపుడు ఈ పన్ను వేయాలని ఉద్దేశములో దీనిని

తీసుకు వచ్చారనుకొంటాను. N. G. O. లకు జీతాలు లేవని చెబుతున్నారు గవర్నమెంటు యీ విషయం చూడటం లేదంటున్నారు. మహాఅవస్థలు పడుతున్నారని పోషిస్తున్నాము. దీని కంతకు బొక్కసంలోడబ్బు కావాలంటే ఏమి చేయాలో ఆలోచించు కోవాలి. ప్రభుత్వం ఏలా జరుగుతుందనేది మీరు కూడా ఆలోచించి దీనిని సమర్థించాలని, ప్రభుత్వాన్ని oppose చేయడమే ముఖ్యోద్దేశముగా ఉండకూడదని మనవి చేస్తున్నాను. ఈ పరిపాలనలో జరిగే ప్రతి దమ్మిడీ ఖర్చుకు మనం బాధ్యులము. పన్నులు ద్వారా గవర్నమెంటు డబ్బు సేకరించి పేద ప్రజానీకానికి ఉపయోగకరంగా దానిని పంపిణీ చేయాలనే ఉద్దేశంతో పన్నులు వసూలు చేస్తున్నారుకాని ప్రజానీకాన్ని బాధపెట్టి డబ్బు తీసుకొని దుర్వినియోగం చేయడానికి కాదని గుర్తించాలని నామనవి. 1947 లగాయితు నూతనంగా Capital Works ఏర్పాటు చేస్తున్నారు. రెండు సంవత్సరాలు ఫలసాయం అయిన మీదట అప్పటి value ప్రకారం తీసుకుని పన్నులు వేస్తారు కాని మరొక ఉద్దేశముకాదు. ఇటువంటి పన్నులు. ఏ రూపంలో ఏస్థాయిలో వేయాలనేది సూచించాలికాని అసలు పన్నులనే వేయకూడదని చెప్పకూడదు. పెద్ద భూస్వాముల మీద పన్నులు వేయాలని మీరు ఉద్ఘాటిస్తున్నారు. 100 ఎకరాలు ఉన్న భూస్వామి ఉంటాడు. ఎకరానికి రు. 500 లు Betterment Levey వేసినా ఎంత అవుతుందో ఆలోచించాలి. ఎంత చెట్టుకు అంత గాలిఅని సామెత ఉంది కదా. చెరువుఆధారంగా ( Tank bed ) లో ఉండే చిన్నరైతుకు Betterment tax వేయరాదు. Saline land విషయంలోను water source సరిగా ఉన్నది లేనిది చూచుకొని Bettement tax వేస్తారు కాని అన్నింటికి ఒకేరీతిగా వేస్తారు అనిఅనుమాన పడనవసరంలేదు. ఆ విషయాలన్నీ మంత్రిగారే కాకుండా సెలక్టు కమిటీ సభ్యులు కూడ పరిశీలించి సరియైన నిర్ణయాలు చేస్తారు. అంతమాత్రాన ఈ పన్నును వేయకూడదనిచెప్పడంసరికాదు. తప్పకుండా ఈబిల్లును ఆమోదించాలని ఆ విధంగా ఎక్కువ భూమిని సస్యశ్యామలం చెయాలని దేశకల్యాణానికి కృషిచేయాలని కోరుతున్నాను. సెలక్టుకమిటీ వారు సూచించిన సూచనలతో ఈబిల్లు తిరిగి సభవారిఎదుటకు వచ్చినపుడు తిరిగి తగుసూచనలు చేసియోచించవచ్చును. 25 వేలరూపాయలుఅంతకుపైబడినవాటిమీద నే వేస్తాం అంటున్నారు. ఇది చాలాఅన్యాయం. Engineering Estimates మొదలైన వాటికే సగానికిపైగా అయిపోతుంది. కనీసం 50 వేలు, లక్ష రూపాయిలు పెడితే బాగుంటుంది. సరియైనసూచనలు ఇస్తే బాగుంటుంది. కాని అడ్డంకులు కల్పించి ప్రజల మీద పన్నునే వేయవద్దని చెప్పడం సరికాదని విజ్ఞులైన సోదర సభ్యులను కోరుతున్నాను.

SRI R. B. RAMAKRISHNA RAJU:— మహాశయా, ఈ బిల్లు యొక్క ముఖ్యాంశాలను ఖండించి ఈ నాడు చర్చజరుగుతుంది కాబట్టి ఈ బిల్లు వెనుక ఉన్నట్టు

సూత్రాల విషయము కొంత చక్కగా విమర్శించ వలెనని నా అభిప్రాయము. ఈ బిల్లులో మనకు కనబడే సూత్రము ఏమిటంటే ఇపుడు ఏ విధమైనట్టి నీటి వనరులు లేనటు వంటి భూములకు గవర్నమెంటు వారు డబ్బు ఖర్చుచేసి మంచి నీటి వనరులు ఏర్పాటు చెయ్యడానికి వారు ఖర్చుచేస్తారు కాబట్టి అందువల్ల భూములయొక్క విలువ జాస్తి అయినది కాబట్టి ఆ విలువలో కొంతభాగము గవర్నమెంటుకు ఇవ్వవలెను అనే సూత్రము అగుపడుతుంది. ఈ విషయములో గవర్నమెంటు వారికి రైతులకు ఉండే సంబంధము ఏమిటో ఎటువంటి సూత్రాలమీద ఆధారపడి ఉన్నవో చక్కగా విమర్శించవలసిన అవసరం కలదు. మెట్ట భూములకు గవర్నమెంటు వారిచేత ఏర్పాటు చెయ్యబడినట్టి తీరములలో భూములకు తీరువా వేస్తారు. గవర్నమెంటు వారు ఖర్చు చేసిన చెరువులకు, కాలవలకు తగినట్టి తీరువా వేస్తారు. ప్రస్థుతము గవర్నమెంటువారు ఏర్పాటు చేసిన Act లో పెట్టిన works వాటిని అనుసరించి తీరువా విధిస్తారు. పూర్వపు రాజులచేత ఆ ప్రకారమే వేయబడింది. ఇప్పుడూ ఆ ప్రకారమే జరుగుచున్నది. కాలువలు ఎక్కువగా చేసినాము కాబట్టి మీరు మాకు ఎక్కువగా ఇవ్వలేదనే సూత్రము మీద ఆధారపడి ఉన్నది అని తెలుస్తుంది. ఎక్కువ చేసినాము కాబట్టి మీ దగ్గర పన్ను తీసుకుంటున్నాము. మీకు ఏమీ చెయ్యలేదు కాబట్టి తక్కువ పన్ను తీసుకొంటాము అని అంటున్నారు. మీరు పెట్టిన డబ్బుకు ప్రత్యామ్నాయముగానే ఎక్కువ తీసుకొంటున్నారు. కాబట్టి ఈ నెలలో కూడా మాకు ఇవ్వాలి అనడం ఏ సూత్రంపై ఆధారపడి ఉన్నదో నాకు అర్థముకాలేదు.

రెండవ విషయము, జమీందారుకు, రైతుకు, గవర్నమెంటుకు రైతుకు ఉండే సంబంధము (relation) ఏమిటంటే నాకు తెలిసినంతవరకు చెబుతున్నాను. జమీందారు నీరువల్లగాని,గవర్నమెంటు నీరువల్లగాని రైతు పైరు చెస్తే నీరుతీసుకున్నందుకు తగినట్టునీటి తీరువా ఆయనకఇవ్వవలెను. అంతేగాని గవర్నమెంటు నీరుఇవ్వకపోతే నీరుఇవ్వలేదు,పైరు ఎక్కువ చెయ్యలేదు, నాకు కష్టముగా వుంది, నష్టముఅయినది కాబట్టిపన్నులు ఇవ్వము అనే అధికారములేదు. జమిందారుగాని, గవర్నమెంటు గాని చట్టప్రకారముగా వసూలు చేసుకోవచ్చునని హైకోర్టులో decisions లు ఉన్నవి. అది తమకు తెలియును. గవర్నమెంటుకు రైతుకు ఉండేసంబంధము unilateral. సాధారణముగా ఇది contract పద్ధతిమీద జరుగుతుంటుంది.వస్తువులు అమ్మేవాడికి మాకు agreement జరిగితే ఇవ్వకపోతే నాకుబాదరాయం తీసుకోకపోతే ఆయనకుబాదరాయం.ఇదిఅటువంటిదికాదు గవర్నమెంటువారు నీరుఇస్తే తీరువా తీసుకోనండి. మాకునీరుఇవ్వలేదు కాబట్టి, నాకు వచ్చేలాభం పోయింది కాబట్టి, నష్టం వచ్చింది కాబట్టి దానికి తగిన పరిహారము ఇవ్వవలెనని గవర్నమెంటును గాని జమీందారునుగాని అడగడానికి లేదని తీర్మానంఅయినది. ఇప్పుడు జమీందారీలు పోయిన తరువాత గవర్నమెంటు భద్రమైన స్థితిలో ఉన్నారు

జమీందార్లు కోర్టులకుపోయి దావాలు వేసి నీరు పారిందని రుజువుచేయవలసిన పరిస్థితులు వారికి ఉండేవి. గవర్నమెంటువారు వేసిన తీరువాకు కోర్టుకుపోవలసింది లేదు. నీరు ఇచ్చినాము కాబట్టితీరువా ఇవ్వకపోతే ఆస్తి జప్తి చేసి తీసుకొని పోతామనే అధికారము మీచేతులలోఉన్నది. ఇప్పుడు గవర్నమెంటువారు ఎక్కువ works చేసినారనుకోండి. ఏకారణము చేతనో అవిచెడిపోయి నీరు రాకపోతే Betterment Levy ఏవిధంగా తీసుకొంటారు? భూమివిలువ అధికము అయినది. Work కు 1000 రూపాయలుఖర్చు అయినది 10%.తీసి వేసి 90%.లో సగము రూ 450- మాకుఇవ్వవలెనంటున్నారు.తరువాత ఈ work చెడిపోతే మాకు మీకు ఉన్నసంబంధాలు ఏమిటి? మాకురూపాయలు వాపసు ఇస్తారా? తీరువాతగ్గిస్తారా? ఏసూత్రం మీద Bettement Levy వేస్తున్నారో న్యాయబద్ధంగా నాకు అర్థంకావడములేదు. ఇందులో ఉన్న రహస్యం నాకు తెలిసినంత వరకు:- మీరుడబ్బుఖర్చుచేసి work చేస్తే దానికి అయినట్టి డబ్బు ప్రత్యామ్నాయంగా తీసుకొనండి. నీరులేకపోతే అప్పటికి అంతయుఅయిపోతుంది. రైతులకు, ప్రభుత్వానికి కొత్తపరిస్థితులఏర్పడవచ్చును. పెంపకము వచ్చిన విలువను బట్టిమాకు ఇవ్వండిఅనడానికి కారణము ఏమిటి? గవర్నమెంటు వారి బిల్లులో ఏమిటివుంది? ముందువచ్చే ఆదాయము కన్న ఇప్పుడు ఆదాయము ఎక్కువఅయినది కాబట్టి దానికి విలువగట్టి, పదిఇంతలు తీసి వేసి ఇవ్వమంటున్నారు. ఇది 1947 తరువాత చేసిన works కు అని అన్నారు.

ఇప్పుడు చూడండి. గోదావరి డెల్టాభూములు ఉన్నవి. వాటికి అరవై ఏండ్లుగా వారు Betterment ఇచ్చి వుండరు అని నా అభిప్రాయము పొరపడితే మన్నించండి. 60 ఏండ్లుగా అందులో లాభములు అనుభవించు చున్నారు. కొవ్వి మదించి ఉన్నారు. వారి మీద Betterment Levy లేదు. ఈ నాడు 1947 సంవత్సరంనుంచి Betterment Levy తీసు కుంటున్నారు. రెండేళ్లపంట మీద వేస్తాము అన్నాము. ఎంతో డబ్బు ఖర్చుచేసి భూములు చక్కచేసుకోవాలి. రెండు సంవత్సరాలలో ఇవ్వకపోతే Land Revnue rules ప్రకారము ఆస్తి జప్తీచేసి తీసుకొన వచ్చునని అన్నారు. దానిలో discrimination ఏమి న్యాయముగా ఉంది? ఈ Betterment Levy ఏ సూత్రము మీద ఆధారపడి ఉన్నది? మెట్ట భూముల మీద acre కు రెండు, మూడు రూపాయిలు తీసుకుంటే, ఈ పన్ను వేస్తే రేపు పది, పదిహేను రూపాయలు తీసు కుంటున్నారు. అదేమాదిరిగా మాగాణిమీద తీరువాతీసుకుంటున్నారు. ఈ Betterment Levy అడగడంలో ఎంతన్యాయంఉంది? మనకు డబ్బు కావలెననే సూత్రముతప్పమరేమి లేదు. నా మనస్సుకురాకుండా ఉంది. ఈ భూములు చక్కచేసు కొనడానికి ఎంతో అవసరము. దాని మీద అప్పీలులేదు. రివెన్యూ అధికారితీరువా వేస్తే దాని మీద appeal ఎవరికి prescibed అన్నారు. అంటేఇంకో రివిన్యూఅధికారికి ఇస్తారు. ఏ విధముగానైనా

కోర్టుకు పోరాదు It shall not go to a Court of Law అనిఉన్నది. ఇది FromPhlip Sober to Phillip Drunk అన్నట్లుగా ఉంది. క్రింది అధికారి కొంత sober గా ఉంటాడు. పైఅధికారి కొంచెంమత్తులోవుంటాడు. అలాంటప్పుడు న్యాయం కల్గుతుందని నా మనస్సులో లేదు. Land acquisition విషయ్యా అధికారికి చెప్తే దానిమీద court కు appeal ఉన్నది ఆ ప్రకారము కోర్టుకు అప్పీలు చేయడానికి అవకాశం ఉంటే బాగుం టుందనే అభిప్రాయము నాకు ఉన్నది.

ఇప్పుడు జమీందారీ ఇలాకాలో చెరువులున్నవి. అవి అనేక సవంత్సరాలుగా పాడుపడి ఉన్నాయి. బొత్తిగా చెడిపోయినటువంటి చెరువులున్నాయి. కొద్దిగానో గొప్పగానో పనిచేసి నటువంటి చెరువులున్నాయి. ఇటువంటి చెరువు లన్నిటికీ కూడా చేయవలసిన repair లు చేస్తే అది work క్రింద వస్తుందా లేదాఅ నేటటువంటివిషయం కూడా సందిగ్ధంగా యుంది. స్పష్టంగా లేదు. Construction అన్నారు, Expansion అన్నారు, Alteration అన్నారు. ఏది ఎక్స్పెషనో ఏది ఆల్టరేషనో నిర్ణయించడం గవర్నమెంటు వారియొక్క ఇష్టం. గవర్నమెంటు కున్నూ, జమీందారీలకున్నూ ఉన్న వ్యత్యాసం ఏమిటంటే గవర్నమెంటులో ఇవి ఎప్పుడైనా చెడి పోతే త్వరగా బాగు చేస్తారు. ఐతే జమీందారీ ఇలాకాలో శతాబ్దాలుగా చెరువులు repair లేక ఏవిధం గానూ పని చేయక పోయినా కూడా, వాటిలో ఒక మాసానికి, లేక రెండు మాసాలకు సరిపడే నీళ్ళు నిలవక పోయినా కూడా తీరువలు మామూలుగానే ఎకరం ఒకటింటికి 50 రూపాయిలు 60 రూపాయిలు లేక 70 రూపాయిలు ఇంత వఱకూ కడుతూనే ఉన్నాం. Rent Redtucion Act వచ్చే పర్యంతమూ ఆప్రకారం కడుతూనే ఉన్నాం. గవర్నమెంటు తీసుకున్న తరువాత కూడా ఎకరంకు 10 రూపాయిలు కడుతున్నాం. ఇటువంటి సందర్భంలో ఈ జమీందారీ ఇలాకాలో ఉండేటటువంటి చెరువులన్నీ చక్కచేస్తే అవన్నీ works క్రింద వస్తుందా ? రాదా? దాన్ని సందిగ్ధంగా పెట్టకుండా ఉండాలి. జమీందారీలలో క్రొత్త పనులేవైనా చేయిస్తే Betterment Levy వేసు కోండి. Betterment Levy కూడదని నా అభిప్రాయంకాదు. ఒకవేళ Betterment Levy వెయ్యాలని అభిప్రాయం ఉండి, మీకు శక్తి ఉన్నది కాబట్టి దాన్ని pass చేసు కుంటే కూడా ఈ జమీందారీ ఇలాకాలో ఉండేటటువంటి చెరువులూ బావులూ కుంటలూ నీటిని చక్కచేసి క్రొత్తగా వేసుకుంటే వేసుకోండి. ఎకరంకు 50, 60, 70, 150 కూడా ఇచ్చి శతాబ్దాలుగా భరించిన రైతులంతా ఉన్నారు. అటువంటి వారిని ఇప్పుడు క్రొత్తగా Betterment Levy ఇవ్వమంటే పుండుమీద పొడిచి నట్లుంటుంది. నా మనవి ఏమిటంటే. ఈ జమీందారీ ఇలాకాలో ఉండిన వాటికి దీన్ని అన్వయింపు చేయకుండా, పాత irrigation sources ఏవి ఉన్నాయో, వాటిని చక్కచేసి

కూడా, ఈ చట్టం వాటికి అన్వయింప చేయకుండా ఉండవలసినదనిన్నీ, ఈ పద్ధతి ఈ సభలో pass ఐతే, కొత్తగా చేసిన వాటికి వేసుకోవచ్చును అని నాకు తోస్తోంది. ఇవీ ఈ చట్టవిషయంలో నాకు తోచిన సందేహాలకు మంత్రిగారు సరియైన సమాధానం చెబుతారని నేను ఆశిస్తున్నాను.

SRI K. V. S. PADMANABHA RAJU :— అధ్యక్షా ! ప్రస్తుతం మన ముందు Revenue మంత్రిగారు తీసుకువచ్చి పెట్టినటువంటి Bettermet-Tax Bill అసలు మనముందు రావలసినదికాదు. కాని అది ఈవేళవచ్చిందికాదు. గత ప్రభుత్వము ఈ Betterment–Tax Bill తీసుకువచ్చి పెట్టిందికాని ఆరోజున ఆ House లో ప్రభుత్వానికి స్తోమతులేదు. ఆ Betterment Tax వెయ్యటానికి ధైర్యమూలేదు. అందు చేత ఆ ప్రభుత్వం దాన్ని విడిచి పెట్టుకొన్నారు. మళ్ళీ ఈ రోజున వారికిబలంఉన్నది. కాబట్టి ఆబలాన్ని ఉపయోగించు కుందా మనేటటువంటి ఉద్దేశ్యంలో తీసుకువచ్చారు. అది ప్రజలే అర్థంచేసుకుంటారు. ఈ Betterment Tax తీసుకువస్తున్నారంటే ఈ వేళ దేశంలోయున్న పరిస్థితి ఏమిటి ఒక ప్రక్కన agricultural prices పడిపోయా యన్న విషయం గవర్నమెంటే ఒప్పుకుంటుంది. ఒక్క మనరాష్ట్రంలోనే కాదు. భారత దేశంమొత్తంమీద ఇదిజరుగుతోంది. అటువంటి పరిస్థితులలో ఈవేళ Betterment Tax తీసుకువచ్చి మనముందు పెట్టారంటే అది ఎంతవరకూ సమంజసమో నాకర్థంకావడంలేదు. ఈ బిల్లులో వివరాలేమీ clarify కాబడలేదు. మంత్రిగారు సెలవిస్తూ 1947 సంవత్సరం దాటిన తరువాత కట్టినటువంటి project లైతే నేమి, లేక పోతే పెద్ద పెద్ద కాలవలైతేనేమి, చెరువులైతే నేమి చేసిన మరమ్మతులైతేనేమి వాటిమీద పడుతుంది. 20 వేలు దాటిన తరువాత ఈ taxation పడుతుందని వారు సెలవిచ్చారు నిజమే. కాని రామకృష్ణరాజు గారు మాట్లాడుతూ మన రాష్ట్రంలో మూడు నాలుగు జిల్లాలలో హెచ్చుగా జమీందారీ ప్రాంతం ఉన్నది. ఆ ప్రాంతంలో చిరకాలం నుంచి చెరువులు మరమ్మతు లేకుండా ఉన్నాయి. గత 15, 20 సంవత్సరాల నుంచీ జమీందారీ ప్రాంతంలో చెరువులు మరమ్మతులు లేకుండా పోవడంవల్ల ఈ వేళ ఒక్కొక్క చెరువుకూ మరామత్తుకు 25 వేలుగాని, 30 వేలు, 40 వేలు, 50 వేలుకూడా మరమ్మతుకు అయ్యే చెరువులున్నాయి. లక్షరూపాయలు చేసేవికూడా ఉన్నాయి కాని వారు చెప్పినటువంటి policy ప్రకారం 20 వేల రూపాయిలు దాటిన తరువాత ఈ పన్ను వర్తిస్తుంది. కాని ఈ రోజున జమీందారీ ప్రాంతాలలో చెరువుల క్రింద పండేటటువంటి పంటకు ఎంత వరకూ గ్యారంటీ ఉంది ? ఎంత వరకూ నమ్మకంగా పండు [illegible] మంత్రి గారికీ ప్రభుత్వానికీ కూడా [illegible] తెలుసును. చెరువులలో నీరున్నప్పటికి పెద్ద పంట [illegible] భూములు కావు. ప్రస్తుతం ఉన్న ధరలనుబట్టి చూచినా, దేన్నిబట్టి

చూచినా రైతు ఈ పన్ను ఇచ్చుకో లేని పరిస్థితిలో ఉన్నాడు. అది మాత్రం బాగా అర్థం చేసుకోవాలని నేను మంత్రి గారిని కోరు తున్నాను. ఈ బిల్లు Select Committee కి కూడా వెడుతుంది. బాగా ఆలోచించి ప్రభుత్వం ఈ బిల్లును ఉపసంహరించు కుంటే మంచిది. ఈ రోజు శాసన సభలో మాట్లాడుతూ కృష్ణంరాజుగారు చెప్పారు. ప్రతిపక్షం N. G. O. ల జీతాలు పెంచాలని చెబుతారు. ప్రభుత్వానికి డబ్బు కావాలి. ప్రతి దానికీ ప్రతి పక్షం ప్రతి ఘటిస్తారే అని చెప్పారు. ప్రభుత్వం చేసే మంచి పనులు ప్రతి పక్షం ఎప్పుడూ ప్రతి ఘటించదు. అటువంటి ప్రతి పక్షం ఎప్పుడూ మనలేదని స్పష్టంగా చెబుతున్నాను. ప్రభుత్వానికి డబ్బులేదనే వాదన ఈవేళ వచ్చింది కాదు అసలు ప్రభుత్వ రాజ్యాంగ విధానంలోనే ఉంది పెద్దలోటు. ఈవేళ భారత దేశం మొత్తంమీద ఈ జమీందార్లకు ఇస్తూ ఉన్నటువంటి compensation 519 కోట్ల రూపాయిలు, ప్రభుత్వ ఖజానాకు ఆదిలోనే లోటు వచ్చింది. ఆ రోజున ప్రభుత్వం అటువంటి నిర్ణయాలు తీసుకుని, ఈ వేళ ప్రతిపక్షం ఇల్లాంటి సలహాలు ఇస్తుంది. ప్రభుత్వం దగ్గర డబ్బులేదు అని చెప్పడం మాత్రం సమంజసం కాదని నేను చెబుతున్నాను. ఈ వేళ congress అధికారంలో యున్నదని చెప్పి నిర్ణయాలు తీసుకు రావచ్చు. Faizpur కాంగ్రెసు మహాసభలో 1936 సంవత్సరంలో నీటి తీరువాపన్ను ఎప్పుడూ కూడా హెచ్చించ కూడదు అది సమంజసంకాదు అన్నారు. Agricultural Income-Tax కూడా అంతకంటె better అని ఒప్పుకుంటాను. Agricultural Income-Tax వెయ్యండి. Agricultural Income ఎక్కువైతే వస్తుందో దానిమీద tax వెయ్యండి. అప్పుడు కొంతవరకూ పేదరైతు మిగిలి పోతాడు. పెద్ద income వచ్చే రైతుకే తగులుతుంది. ఈ Betterment-Tax అనేటటువంటిది మెట్టప్రాంతాలలో చెరువులక్రింద వ్యవసాయం చేసే బీదరైతులకు ఈ పన్ను తగులుతుంది. దాంట్లో ఏమీ సందేహంలేదు. ప్రభుత్వం ఒక్కొక్క చెరువును బాగుచేయడానికి 40 వేల రూపాయిలు sanction చేసిందంటే క్రొత్తగా తీసుకు వచ్చిన ఆయకట్టు కానీ, నీటి సౌకర్యంగాని ఏమీలేదు. ఈ Betterment-Tax Bill withdraw చేసుకుని Agricultural Income-tax Bill తీసుకురండి. దీనివల్ల ప్రజలను బాధపెట్టటం మంచిది కాదు. మీరు నమ్మేటటువంటి socialistic pattern of society ఎంత మాత్రంరాదని మరొకసారి మీకందరకూ విజ్ఞప్తి చేస్తున్నాను. Select Committee సభ్యులు ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించాలని కోరుతున్నాను.

Select Committee కూర్చొంటుంది కాబట్టి Select Committee కూర్చొనే ముందు ఈ వేళ ఏదో కొంత discussion జరిగింది. కాబట్టి Select Committee లో ఉండే సభ్యులు కూడా చాలా జాగ్రత్తగా ఆలోచించి చేయాలని మనవి చేస్తూ [illegible]

తున్నాను. దేశంలో 1936 సంవత్సరంలో ఉన్నటువంటి పరిస్థితులు వేరే. ఇప్పుడు 1955 లో కాలం మారినా దేశంలో ఇంకా మార్పులు రాలేదు. ఇది మాత్రం బాగా గుర్తుంచు కోండి. ఈ వేళ ఆంధ్రదేశంలో ఉండే రాజకీయ పక్షాలు గాని అందులో ఉన్న వ్యక్తులు గాని, ఎంత తారుమారు జరుగుతూ ఉన్నవో ఒకటి మీ ఉదాహరణకు చెప్తాను. G. Lachanna గారు గతసారి Betterment tax బిల్లును ఇక్కడ introduce చేసి నపుడు వారు ఇచ్చి నటువంటి ఉపన్యాసం (మద్రాసులో)

MR. SPEAKER:— How is it relevant ?

SRI K. V. S. PADMANABHA RAJU:—It is relevant Sir. గతసారి శాసన సభలో

MR SPEAKER:— That is his individual opinion as an Opposition Member.

SRI K. V. S. PADMANABHA RAJU:— సభ్యులకు House లో చెప్పడానికి అవకాశం ఉందని అను కొంటున్నాను. కొద్దిగా నేను చదువు తున్నాను. Principle అనే పేరుతో వెనుక బడిన ప్రాంతాలలో ఉన్నటువంటి ప్రజలు ఇప్పుడు ఇతర ప్రాంతాలలోని ఈ ప్రభుత్వంవల్ల తమకు అభివృద్ధి కలుగుతుందని ఆశించినంత మాత్రాన వారికి కూడ ఈ పన్ను విధించడం అంటే ఇంతకంటే అన్యాయం లేదు. ఈ విధానం కాంగ్రెసు పేరుతో నడుపబడుతున్న ప్రభుత్వాన్ని వీరు పూర్వంచేసిన వాగ్దానాలను భగ్నపరచడానికే చేస్తున్న ప్రయత్నాలని చెప్పకతప్పదు. ముఖ్యంగా ఈ Select Committee లో నేను సభ్యుడుగ ఉన్నంత మాత్రాన ఈ Betterment tax ప్రస్తుత విధానాన్ని ఏ మాత్రం పార్టీ అంగీకరించదు. దీనిని తీవ్రంగా ప్రతిఘటిస్తుందని నేను మనవి చేస్తున్నాను. ఇంకా ఈ Betterment-tax అనేది న్యాయమైన principles ప్రకారం న్యాయమైన దృష్టితో సమానబుద్ధితో ఈ principle అమలు జరపాలంటే ఈ రోజు మద్రాసు రాష్ట్రంలో ఉండేటటువంటి developed areas ను undeveloped areas ను అంటూ దానిని quote చేశారు వారు. విభజించి ఇది వరకు ప్రభుత్వం మొత్తం ఆదాయం మీదనే అభివృద్ధిపొంది నటువంటి developed area లో electricity లో గాని, జలాశయాలలోగాని మరి ఇతర్రాగాని ఎంత వరకు సౌకర్యాలు కలిగింపబడినవో, దానికి అభివృద్ధి పొందినటువంటి వెనుకబడిన ప్రాంతాలకు కూడ సౌకర్యాలు మొదట కల్గచేయుటకు వాటికి priority ఇవ్వాలనే ఉద్దేశించేదే అంతే గాని ప్రస్తుతం ప్రభుత్వం తల పెట్టిన విధానం గత [illegible] సంవత్సరం నుంచి కాంగ్రెసు పేరుతో మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వ పక్షంగా ప్రజలకు చేస్తున్న వాగ్దానాలను భగ్న పరచడానికి దోహదం ఇచ్చినట్లు అవుతుందని, ఇది ప్రజలు ఎంత మాత్రం అంగీకరించరు అని చెప్పక తప్పదని వారు చెప్పారు. చెప్తూ ఇంకొకటి.

MR. SPEAKER :— It is the inherent right of every Member to change his opinion.

SRI K. V. S. PADMANABHA RAJU :— అధ్యక్షా పేజీనంబరు 800. వారు change చేసుకోవచ్చు. దానితో నీకు సంబధంలేదు. ఎందు కోసం చెప్పాతున్నానంటే ప్రస్తుతం House కు కొంచెంసంబంధం ఉంది. ఇంకో point వారు చెప్పింది ఏమంటే, దానిని ప్రతి ఘటించేందుకు మా K. L. P. party ఏ మాత్రం సహించదు అని వారు చెప్పారు. అందుచేత ఈ ఐక్య కాంగ్రెసు legislative party లో ఒక భాగముగ ఉన్నటువంటి సభ్యులు చాల మంది అందులో ఉన్నారు. కాబట్టి వారిని

MR. SPEAKER :— There is no K. L. P party now.

SRI K. V. S. PADMANABHA RAJU :— లేదు sir. ఐక్య lesiglature కాంగ్రెసు పార్టీలో ఉన్నటువంటి సభ్యులు, అందులో Lachanna గారు వారు అంతా ఉన్నారు కాబట్టి తమ ద్వారా కోరుతున్నాను. ఇటువంటిది వస్తుంది కాబట్టి మీ ఆదిలో ఉన్న సిద్ధాంతాలు వెంకటేశ్వర్లు గారు అభిప్రాయాలు మార్చుకొన్నారు అన్నట్లు చెప్పాతున్నారు. ఆ విధంగా మనకు ఎక్కడ ప్రకటించ లేదు.

MR. SPEAKER :—మార్చు కొన్నారని నేను చెప్ప లేదు.

SRI K. V. S. PADMANABHA RAJU:— అందు చేత ఈ సభ్యులంతా కూడా, దీనిని చాలా బాగా గమనించి select కమిటీలోకి వెళ్లి Select Committee సభ్యులను కూడా నేను ప్రత్యేకంగా కోరేది సాధ్యమైనంత వరకు ఈ బిల్లును విరమించుకోవడం మంచిదని చేప్పి నేను కోరుతున్నాను.

SRI S. RANGANATHA MUDALIAR :— Mr. Speaker, Sir, while endorsing the observations made on the floor by Mr. R. B. Ramakrishna Raju, I want to add my own observations with regard to clause II, dealing with exemption. On a careful perusal I see the clause seems to contain dangerous reservations; in my opinion, for the better enforcement of this Bill, If it is passed into law, it would be necessary to completely omit the clause. The clause reads: "If, in the opinion of the Government, *the enforcement or strict enforcement* of all or any of the provisions of this Act." I do not know what the Hon. Minister means by 'enforcement or strict enforcement.' Can there be different kinds of enforcement? That is a point on which clarification

is very necessary. If it is 'enforcement', it is expected to be 'strict enforcement'. If it is lenient enforcement with regard to some and strict enforcement with regard to others, I think, it will lead to an unhappy state of affairs and a perusal of this clause shows that it contains some reservation for partymen. I am afraid a number of partymen, if the Bill is passed into law, will come with memorials of one kind or other urging upon the Minister to exempt several cases. The clause also reads :...*will cause hardship in any case or cases,*" the Government may, by notification, setting out the ground therefore, exempt either permanently or for a specified period, such case or cases from all or any of the provisions of this Act, subject to such conditions, if any, as the Government may deem fit to impose." What is meant by 'hardship'? What is the kind of hardship contemplated in this Bill? This provision virtually takes away the benefit that might accrue by passing a Statute like this. Considering the way in which things are being done, deputations will come and wait upon the Hon. Minister requesting him to do this or that thing either in accordance with law if possible or as a matter of favour; a number of memoranda will rush into the Minister's room, putting forth party considerations, particularly at a time when the elections are impending; and I am afraid the Government will find itself compelled to bring many cases under this clause of exemption and take away the benefit, if any, that might accrue to the State by this Act. I request the Hon' Minister to note this observation of mine and see if, in the inthrests of the State, this clause cannot be completely omitted. Thank you, Sir.

Sri V. VISWESWARA RAO :— అధ్యక్షా, మంత్రిగారు ఈనాడు మనముందర తీసుకొనివచ్చినబిల్లు ఇది మొట్టమొదటి సారికాదు, ఈ శాసనసభ ముందు తీసుకొనిరావడం. ఇంతకుముందే మద్రాసులో ఉండగా ఒకసారి, గతసంవత్సరం ఒకపర్యాయంకూడ ఈ బిల్లు తీసుకొనిరావడం. ఆ రెండుపర్యాయములు శాసనసభలో ఉండే సభ్యులంతాకూడ ఈ బిల్లు ప్రజలమీద ఎవ్వరైతే ఈ ప్రభుత్వంనుంచి ఫలితం పొందవలెనని ఆ శిస్తు వచ్చారో ఏ వెనుక బడిన ప్రజలైతే అభివృద్ధి చెందవలెనని కోరుతూ వచ్చారో వాండ్లమీద అదనంగా పన్ను వేయడం జరుగుతుంది. కాబట్టి ఇది వేయడానికి వీలులేదు. దీనిని తీసుకొనిరావడంవల్ల సామాన్యంగా ఇప్పుడిప్పుడే అభివృద్ధి కావలసిన అభివృద్ధి పొందవలెనని ఆశించిన ప్రజలమీద కొత్తగా పన్నువేయడానికి దారితీస్తుంది. కాబట్టి ఈపన్ను వేయరాకూడదని అనేకమంది వాదించారు.

అందువలననే దీనిని వెనుకకు పెట్టడంజరిగింది. కాని ఈనాడు ఈ బిల్లు తీసుకొనివచ్చే దాంట్లో కొన్ని provisions కూడా పెట్టుతూ ఉన్నారు. అందులో 1947 నుంచి ఈ బిల్లు ప్రకారం Betterment tax వేస్తామని మంత్రిగారు చెపుతూ ఉన్నారు. 1947 వ సంవత్సరంనుంచి ఈ రోజువరకు చూస్తే షుమారు 8 సంవత్సరములు అయిపోయింది. బిల్లులోనే రెండుసంవత్సరములు తీసివేసి మిగిలిన కాలానికి ఈ పన్ను లెక్కకట్టి వేస్తామంటే గత ఆరుసంవత్సరాలకు కూడ ఈ పన్ను వేయటం జరుగుతుందా అని ఆలోచించవలసిన అవసరం వస్తుంది. ఈ ఆరుసంవత్సరాల పన్నుకూడ ఒకే సందర్భంలో వేయుటం వసూలుచేయటం జరుగుతుంది. లేకపోతే అది ఏ రూపంలో వసూలు చేయబోతారో కూడ సందేహించవలసిన అవసరం వస్తుంది. ఇక్కడే 1947 సంవత్సరంనుంచి కూడ రు. 25 వేలకన్నా ఎక్కువ ఖర్చుపెట్టి ఏ మాత్రం అభివృద్ధిగాని extension గాని ఇంకా ఏమైనా చేసి ఉంటే వాండ్లందరిమీద 'అభివృద్ధి' పన్ను వేస్తాంఅంటున్నారు. సామాన్యంగా 1947 నుంచి తీసుకొని చూస్తే ప్రధానంగా వెనుక బడిన ప్రాంతాలలోనే కొన్ని కొన్ని చెరువులు మరామత్తు చేయడంగాని, భావులు కట్టడంగాని లేకపోతే, ఇంకొక కొత్త కాలవ త్రవ్వటంగాని చిన్న project కట్టడంగాని జరుగుతూవచ్చింది. అంటే వెనుకబడిన ప్రజానీకం మీద ఇప్పటివరకుకూడ పంటలు పండక బాధపడుతూ ఉన్నటువంటి కరువు కాటకాలకు గురియైన ప్రజలమీద తిరిగి ఈ నాడుపన్నులు వేయడానికి పూను కొంటున్నామనేది ఈ బిల్లువల్ల మనకు స్పష్టంగా బోధపడుతున్నది. జమీందారి ప్రాంతాలు ఉన్నాయి. 1949 తరువాత జమీందారి estate లు తీసుకోవడం జరిగింది. ఈ estate లు అనేక సంవత్సరాలుగా అనేక చెరువులు బాగుచేయకుండా ఉండి పోయినవి. ఈ చెరువులన్నికూడా కొన్ని కొన్ని సందర్భాలలో 25, 30 వేలుకూడా వెచ్చించి మరామత్తు చేయవలసిన అవసరం ఏర్పడింది. వాటిని ఈచట్టప్రకారం తీసుకొని 25 వేలకన్నా ఎక్కువఖర్చుపెట్టి బాగుచేశాము కాబట్టి అభివృద్ధిచేశామనేపేరుతో వాటికి పన్ను వేస్తే ఎక్కువ పన్ను వేయటం అవుతుంది. వాండ్లకు న్యాయమైన నీరుఇవ్వకుండా వారిమీద పన్ను వేయడానికి పూనుకొంటుందని స్పష్టంఅవుతుంది.

అదే విధంగా electrical installations ఉన్నప్పుడు కూడ, ఈ పన్ను వేస్తామని ఈ బిల్లు ద్వారా చెప్పడం జరుగుచున్నది. మా జిల్లాలో చూడండి. విజయవాడ పక్కనే పడమట, గుంటుపల్లి, ఇంకా అనేక ప్రాంతాలలో pumping scheme అనేది పెట్టుకోవడం జరుగుతున్నది. అక్కడ pumping ఖర్చులకు అనే పేరుతో ఎకరాకు 22, 25 రూపాయల వరకు వసూలు చేయడం జరుగుతున్నది. ఆ ప్రాంతాలలో రైతులకు కూడ అక్కడ ఉన్నటువంటి వ్యాపార పంటలతో పోల్చి చూచుకొంటె, ధాన్యపు పంటల వల్ల వచ్చే ఆదాయము చాలా తక్కువగా ఉంటున్నది. ఏదో వాటివల్ల కొంత సొమ్ము

అయిన ఆదాయము వస్తుందనేది తప్పితే మరేమిలేదు. ప్రభుత్వము అధికాహారోత్పత్తి అని ధాన్యపు పంటలను పండించేందుకు రైతులను ప్రోత్సహించి; ఈనాడు వారి పైన ఈ విధమైనటువంటి అభివృద్ధి పన్నులు వేస్తామంటే అది ప్రజలలో ప్రభుత్వంపట్ల ఏ అభిప్రాయం కలుగజేస్తుందో ఆలోచించమని కోరుతున్నాను. అనేకచోట్ల రైతులు electrical installations వేసుకొని అనేక ఖర్చులు పెట్టుకొంటున్నారు. అక్కడ వారే కాలవలు త్రవ్వుకొంటున్నారు. వారే అన్ని పనులు చేసుకోవడం జరుగుచున్నది. కాని, అటువంటి చోట్లకూడ అభివృద్ధి జరిగింది, అభివృద్ధి చేశామని, వాటన్నిటికి అభివృద్ధి పన్ను వేయుటకు ఈ బిల్లు అవకాశము ఇస్తున్నది.

తరువాత ఈ చట్టములో exemptions గురించి రామకృష్ణరాజుగారు, రంగనాధ మొదలియార్ గారు చెప్పారు. నేను ఆ విషయం తీసుకోను. కాని మనకు కొన్ని విషయాలు చూస్తే స్పష్టంగా బోధపడుతుంది. ఇప్పుడు తుంగభద్రప్రాజెక్టు 20 కోట్ల రూపాయలతో కట్టాము. అది సంవత్సరముల క్రిందటనే ప్రారంభించాము. కాని ఈ నాడు దానిక్రింద ఎంత సాగుఅవుతుంది ? అది గమనించకుండా ఈ చట్టము తీసుకొని వచ్చిన వాళ్లందరి మీద betterment tax వేయడానికి పూనుకొంటె, అది ఏమి న్యాయంగా ఉంటుందో ఆలోచించ మని కోరుతున్నాను. రైతులు ఆ భూములను సాగులోనికి తీసుకు రావడానికి ఎన్ని ప్రయత్నాలు చేసి నప్పటికి, ప్రభుత్వమే వాళ్లకు కావలసి నటువంటి bull dozers, ఇంకా వారికి కావలసిన ఇతర యంత్రముల సహాయము చేస్తూ, భూమిని చదును చేయడానికి పూనుకొంటూ ఇదంతా చేసినప్పటికి ఆ భూమి సాగులోనికి రాకుండా వారి ప్రయత్నములు సఫలీకృతం కాకుండా, వాటి ఫలితాలు పొందకుండా ఉండగా, ఆ రైతుల మీద కూడ వెంటనే ఈ betterment tax వేయడమనేది ఏవిధంగా సమంజసంగాఉంటుంది? ఒక ప్రక్క ప్రభుత్వ యంత్రములకు అద్దెలు చెల్లించాలి, రెండవ ప్రక్కన మామూలు శిస్తులు కట్టవలసి యుంటుంది. ఇవి గాక, ఇప్పుడు ఈ betterment tax అనేది వేస్తామంటే, ఆ భూమిని సాగుకు తీసుకు రావడానికి వారికి ఏమైనా ఉత్సాహం ఉంటుందా అని ప్రశ్నిస్తున్నాను. మనము ఎప్పుడైతే, ఒక ప్రాజెక్టును కడతామో దానిక్రింద నీరు భూములకు పారించడానికి అవకాశమిస్తున్నాము. వెంటనే నీరు ఇస్తున్నాము కాబట్టి ఆ రైతులనుండి నీటి తీరువా అనేది తీసుకొంటున్నాము. అసలు ఏ ప్రాజెక్టునైనా take up చేసేటప్పుడు ఒక principle ఉన్నది. 5, 6% interest అయినా గిట్టి దానిమీద ఆదాయము ఉంటేనే వాటిని take up చేయడం జరుగుతుంది. కాని, ప్రత్యేక పరిస్థితులలోనో, ఏ క్షామకబడిన ప్రాంతాలలోనో మనకు మిగిలిన అన్నిచోట్ల, అటువంటి returns వాటినుంచి రావడము లేదు. దానికి తగిన వడ్డీ గిట్టుబాటుకాదనే చాలా ప్రాజెక్టులు విడిచిపెట్టుతూ వచ్చింది ప్రభుత్వము. ఆవిధంగా ప్రభుత్వము ఈ ప్రాజెక్టులనుండి ఆదాయాన్నే, వడ్డీనే చూస్తూ

వచ్చింది. నీటివల్ల రైతులకు ఆదాయం వస్తుంది గనుక, కొంతడబ్బు ప్రభుత్వమునకు ఇవ్వవలసిందని అడగడం న్యాయమని కొంతమంది మిత్రులు చెప్పుతున్నారు. Economic laws అని, చట్టాలు అని, పన్నులు వేయడానికి ప్రభుత్వానికి హక్కు ఉన్నదని కొందరు మిత్రులు చెప్పారు. నిజమే, అయితే ఈ పన్నులు ఎవరి దగ్గరనుంచి వసూలు చేస్తాము. ఇవ్వగలిగిన వాళ్లదగ్గరనుండేనా, లేక ఇవ్వలేక పోయిన వాళ్లదగ్గరనుండీనాళ్లి ఇవ్వలేకుండా బాధపడే వాళ్లమీద ఇంకా పన్నులు వేయడానికి ప్రయత్నించడమా అనేటటువంటిది ఆలోచించ వలసిన అవసరమున్నది. ఈ నాడు మెట్ట ప్రాంతములలో ఉన్నటువంటి ప్రజలు తమ భూములలో పంటలు పండించలేక పోవడంచేత ఇతర చోట్లకు, అనగా పంటలు పండే ప్రాంతాలకు వెళ్లుతున్నారు. ఇప్పుడు కర్నూలుజిల్లాలో పత్తికొండ తాలూకా ఉన్నది. అక్కడ 10% జనాభా తగ్గిపోయింది. ఈనాడు High Level Channel వస్తే ఆ ప్రాంతానికి కొంత నీరు రావచ్చు. కాని దానివల్ల వచ్చే అభివృద్ధి చాలా తక్కువ అయినప్పటికీ, ప్రజలను ఇదిగో మీకు 20 కోట్లు ఖర్చుపెట్టి High Level Channel తీసుకు వచ్చాము గనుక మాకు Betterment tax ఇవ్వండి అంటె అది ఎంత సమంజసమో నాకు అర్థంకావడంలేదు. ఎందుకంటె ఆ ప్రజలకు కాస్తా మంచినీళ్లు ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వముపైన ఉన్నది. వాళ్లకు కరువు కాటకాలలో తిండి పెట్టవలసిన బాధ్యత ప్రభుత్వంపైన ఉన్నది. మేము ఇది చేయబోతున్నాము కాబట్టి దీనికి Betterment tax ఇచ్చుకోవాలి, అంటే అది సుమారు 80, 90 రూపాయల వరకు పెరగవచ్చు. దీన్ని చూచి భయపడి, అదిమాకు అవసరం లేదని చెప్పేస్థితి ఉన్నది. కాబట్టి పన్ను ఈ రూపములో ఉండకూడదని మనవి చేస్తున్నాను. క్రిష్ణాజిల్లాలో మెట్టప్రాంతం అయిన నందిగామ తాలూకాలో ఒక గ్రామంలో కాలువకు నీళ్లు ఇస్తామని అంటె ఆ కాలువకు మేము చివర భాగంలో ఉన్నాము. పై వాళ్లు మాకు సక్రమంగా నీళ్లు రానివ్వరు. దానివల్ల అక్కడ పంటలు సరిగా పండవు. కాని అక్కడ కూడ నీరు ఇస్తున్నామని చెప్పి, భూమిని అభివృద్ధి చేశామని పన్ను వేస్తే రైతులు దాన్ని కట్టుకోలేక మాకిది అక్కరలేదు, మేము ఏ జొన్నో పండించుకొని బ్రతుకుతాము, రేపు ప్రొద్దున ఈ Betterment tax వేస్తారు దాన్ని కట్టుకోలేము అనేస్థితి వచ్చిందంటే మన taxation విధానాన్ని వాళ్లు ఏ విధంగా చూస్తున్నారో గ్రహించ మని కోరుతున్నాను.

తరువాత, ఇక్కడ మంత్రిగారు ఈ బిల్లు ప్రవేశ పెట్టేటప్పుడు 1947 సంవత్సరం నుంచి అభివృద్ధి చేసి నటువంటి వాటికి, అంటె కాలవలు అభివృద్ధిగాని, చెరువుల అభివృద్ధి గాని, ఏ దైనప్పటికినీ, ఈ పన్ను వేస్తామని అంటున్నారు. కాని, మన ఆంధ్ర రాష్ట్రంలో 1947 నుంచి ఇంతవరకు ఏ ఏ ప్రాంతాలలోనో ఎక్కడెక్కడ ఏ పథకములో ఏంతెంత అభివృద్ధి చేసింది, వాటిమీద ఎంత అభివృద్ధి పన్ను వేయడానికి

అవకాశమున్నది, దానిమీద ఎంత ఆదాయం వస్తుంది. ఇవన్నీ కూడ లెక్కలు తీసుకొని ఉంటే, ఒక principle అనేది ఉంటే, దానిని చర్చించటానికి, చూచేదానికి అవకాశం ఉండేది. ఇప్పుడు ఒక బిల్లు ముందు పెట్టి ప్రతిదీ ఊహించుకొనడమే జరుగుతున్నది. కాని 1947 నుంచి ఇంతవరకు ఏ యే జిల్లాలలో ఏ యే పనులు చేసి నదీ ఎక్కడెక్కడ ఎంతెంత ఖర్చు పెట్టినది, ఆ వివరాలన్నీ ఇచ్చి ఉంటే, మాకు చర్చించడానికి వీలుండేది. అటువంటి వేమి ఇవ్వకుండా, ఏదో పన్ను వేస్తామని అన్ని భూముల పైన వేస్తామని అంటే, దాని వల్ల ప్రమాదాలు జరుగబోతాయని నేను అభిప్రాయ పడుతున్నాను. ఈ బిల్లును సమర్థించే వారు కూడ, పన్నులు వేయాలనే సూత్రాన్ని అంగీకరించినా మా ప్రాంతములో మాత్రం వేయకూడదని, మా ప్రాంతము వెనుక బడిందని చెప్పడం జరిగింది. అందువల్ల, ఏ ప్రాంతాలలో ఎక్కడెక్కడ ఎంతెంత అభివృద్ధి చేసినది, అక్కడ ఎంతెంత పన్ను పడుతుంది, ఈ వివరాలన్నింటికి లెక్కలు తీసి ఉంటే. చర్చించడానికి అవకాశముండేది. తమ్మిలేరు లాంటి చిన్న చిన్న ఏర్లున్నాయి. వాటి నుంచి రైతులు తమంతట తామే కాలువలు త్రవ్వించుకొని, నీరు పారించుకొని పంటలు పండించుకొనే పరిస్థితి ఉన్నది. గతములో ప్రభుత్వము అధికాహారోత్పత్తి scheme క్రింద ధాన్యపు పంటల అదనంగా పండించుకొనేందుకు రైతులకు ఎంతో ప్రోత్సాహం, సహాయం ఇచ్చిన దానివల్ల, వారు ఎంతో కష్టపడి భూమిని అభివృద్ధి చేసుకొని పండించుకొంటున్నప్పుడో, ఆ భూములమీద మీరు పన్ను వేస్తామని అనడం వల్ల, ఆ రైతులకు భూమిని అభివృద్ధి చేయాలనేటటువంటి అభిప్రాయము, ఉత్సాహం పోయి వాటినుంచి వెనుకకు మరలే ప్రమాదము ఏర్పడుతుంది. కనుక ఈనాడు ఈపన్ను చెల్లించలేనటువంటి రైతులను మినహాయించి, దీనికి ఒకచోట ఒకహద్దు పెట్టవలసి యుంటుంది. అది చాలా అవసరము. అందులో ప్రత్యేకంగా మెట్టప్రాంతాలను అభివృద్ధి చేయాలంటె కొన్ని సంవత్సరాలు పడుతుంది. ఒకటి, రెండు సంవత్సరాలలో అది పూర్తి కాదు. రైతులు ఆభూములను అభివృద్ధి చేసుకోడానికి తమకుటుంబములతో స్వహ కష్టపడటమే కాకుండా, పెట్టుబడులు పెట్టుకోవడమే కాకుండా ప్రభుత్వంయొక్క సహాయంకూడా కావలసి యుంటుంది. ఇవన్నీకూడా చేసినప్పటికి, సరియైన ఫలితము రాకుండా కొన్ని కుటుంబాలు బాధపడుతున్నాయి. అటువంటివారిని, అటువంటిభూములను మినహాయించి, మిగిలిన వారిదగ్గరనుంచి పన్నులు వసూలు చెయడానికి పూనుకోవాలి. ఆ విధముగా చేసినప్పుడే ఇది జయప్రదంగా అవుతుంది. లేకపోతే ఈ Betterment tax అనేది సామాన్య ప్రజానీకాన్ని చాలా బాధలకు గురిచేస్తుందని, వారు భరించుకోలేరని చెప్పుతూ, ఇంతటితో విరమిస్తున్నాను.

**SRI T. V. RAGHAVULU** :— అధ్యక్షా, ఈ రోజున మంత్రిగారు తీసుకొని వచ్చిన యీ Betterment tax బిల్లును నేను బలపరుస్తూ కొన్ని సూచనలను మాత్రమే

Sri T. V. Raghavula] [26th September 1955

చేయాలని ప్రయత్నిస్తున్నాను. ఈ సందర్భములో జరిగినచర్చలో ప్రతిపక్ష సభ్యులు మాట్లాడిన ధోరణినిబట్టి చూస్తే రెండుభాగాలుగా చూడవచ్చు. మొదటి తరగతికి చెందినవారు. యీ పరిస్థితులలో యిటువంటి Betterement tax ను రైతుల మీద వేయడము మంచిది కాదని నిరసన తెలుపుతూ యీ బిల్లును వ్యతిరేకించిన వారుగానున్నా, రెండవ తరగతికి చెందిన వారు యిటువంటి Betterement tax వేయటానికి అసలు యీ ప్రభుత్వానికి హక్కేలేదని చెప్పేవారుగానున్నా, ఉన్నారు. గవర్నమెంటుకు రైతుకు వున్న సంబంధము ఎటువంటిదంటే, కేవలము unilateral గా ఉన్నదే తప్ప bilaterat గా లేదు. ఇచ్చి పుచ్చుకునేలాగు యిద్దరికి సంబంధము యేమి లేనట్లుగా కొంతమంది చెప్పారు. అయితే ఒక విషయము వున్నది. సిద్ధాంతరీత్యా చూస్తే మన గవర్నమెంటు చేసిన అభివృద్ధికార్య క్రమాలవల్ల రైతు బాగుపడే పక్షములలో పన్ను కట్టటానికి రైతుకు ఎటువంటి అభ్యంతరమువుండ కూడదు. రైతును అభివృద్ధిపరచాలంటే గవర్నమెంటు నీటివసరులు ప్రాముఖ్యత యిచ్చితీరాలి. అయితే యిటువంటి కార్యకలాపాలు జరగాలంటే గవర్నమెంటుకు డబ్బుకూడా అవసరమువుంటుంది. ఇవి రెండూ కూడా ఒకదానికొకటి అవినా భావసంబంధముగా వుంటవి. ఇదిఒకవిషభ్రమ,విషచక్రములో వున్నట్లుగావుంటుంది. అందుచేత గవర్నమెంటు చేసేటటువంటి, లేదా అభివృద్ధిచేసేటటువంటి లేదా మరమ్మత్తువల్లగాని, లేక నీటివసరుల వల్లగాని రైతుకు అధిక సౌకర్యాలు కలిగినప్పుడు, దానిఫలితము అనుభవించే రైతు గవర్నమెంటుచేసే యీఅభివృద్ధి కార్యకలాపాలకుగాను ధనమును యిచ్చి గవర్నమెంటుకు తోడ్పడాలి అనేది సబబే అయితే పన్ను యిచ్చేటప్పుడు ప్రతి tax payer కూడా, గవర్నమెంటునుంచి నాకు ఏమి తిరిగివస్తుంది, direct గా fit kroko వున్నదా లేదా అనిఆలోచన చేసినట్లయితే, ప్రజాధనము అనేది నిచ్చిగా తయారవుతుంది. అందుచేతయీవుమ్మడికార్యకలాపాలకుకూడామనముఒక్కొక్కప్పుడుపన్నులుయిచ్చుకోవాలి. Prohibition అనేది గవర్నమెంటుపెట్టింది. సొసైటీ అంతాకూడా బాగుపడుతుంది అనే వుద్దేశ్యముతోనే. దీని వల్ల గవర్నమెంటుకు వచ్చే ఆదాయము పోయి నప్పటికినీ, ఆ లోటును యితరత్రా భర్తీచేసు కుంటున్నాము. అ విధంగానే రైతులు కూడ యీ పన్నుల వల్ల కలిగిన అధిక లాభములో సగము భాగము మాత్రమే ఇవ్వటానికి గవర్నమెంటు వుద్దేశించి యీ బిల్లు తీసుకొని వచ్చి పెట్టారు. అందుచేత యిది సబబు అయినటువంటిదే. ఈ పరిస్థితులలో మనము యీ మాత్రము చేయకపోతే యీ welfare state లో ముందు రాబోయే శ్రేయో రాజ్యస్థాపనకు మనము కలలు కంటూవున్నాము. అయితే కేవలం కలలు కన్నంత మాత్రాన మనము యిటువంటి స్థితిని పొందలేము. అందుచేత గవర్నమెంటు చేసే కార్యకలాపాలలో మనము కూడ చేదోడు వాదోడుగా సహాయము చేస్తే తప్ప, యిటువంటి పన్నులు వేసి, భారీ ఎత్తున ఖర్చు పెట్టమంటే, యిది

సామాన్యమైన పని కాదు. అందుచేత రైతులు యీ పన్నును యిచ్చి వేయాలి, అయితే గోదావరి ఆనకట్ట కట్టేటప్పుడు కూడా, (subject to correction నేను చెబుతున్నాను) యిటు వంటి Betterment levy లేదుకాబోలు. కాని అదనంగా ఆయకట్టులో చేర్చడానికి ఏ ఏ భూములు వున్నవో చూచి, వాటి మీద మాత్రము inclusion fees అని అంటు యిచ్చారు. అంత వరకూ నాకు తెలుసు. అప్పుడు కూడా inclusion fees అనేదే యీ bettrment tax అనే పేరుతో ప్రవేశపెట్ట బడింది. ఇదివరకు సాగుముఖము ఎరుగకుండా వుండే భూములు, లేదా wet cultivation కు వీలుకాకుండా వుండే భూములు, యింకను సాగుకు లాయకీగాలేని భూములు యిప్పుడు యీ అదనపు సౌకర్యాలు నీటి వనరులు వల్ల రైతులకు కలిగిన లాభములో సగభాగము మాత్రమే 20 వాయిదాలలో యివ్వటానికి గవర్నమెంటు యీ నాడు యీ బిల్లు తెచ్చింది. అందుచేత యీ Betterment tax వేయడమనేది సబబనే అంటున్నాను. మనము అందరముకూడా రైతు లోకము నుంచి యీ బిల్లుకు కావలసిన support అంతా తీసుకొనివచ్చి గవర్నమెంటుకు యిచ్చినట్లైతే మనదేశము మరింత సుభిక్షముగా వుండడానికి ఆక్షేపణవుండదు. ఇంకను గవర్నమెంటు ముందడుగు వేయటానికి వీలుకలుగజేసిన వారమవుతామని నేను భావిస్తున్నాను కాబట్టి యీ బిల్లు మనమందరము తప్పనిసరిగా బలపరచాలని కోరుతున్నాను.

తరువాత, రైతులను గురించి మన రామకృష్ణరాజుగారు ఒకటి రెండు సంగతులు చెప్పారు. ఆ విషయములో నేను వారితో ఏకీభవించడములేదు. అది యేమిటంటే గవర్నమెంటుకు రైతుమీద యీ పన్ను వేయడానికి యేమాత్రము హక్కులేదని అన్నారు. ఇది సక్రమమైన అభిప్రాయము కాదని అంటున్నాను. గవర్నమెంటుకు Customary rights అనేవి వుంటవి. Ryotarian rights వున్నవి. రైతు పన్ను చెల్లించే టప్పుడు గవర్నమెంటు యివ్వవలసిన నీటి వనరులు కలుగజేయకపోతే, దాని వల్ల వచ్చే యిబ్బందికి రైతు నష్టపడతాడుగనుక అప్పుడు కోర్టుద్వారా చర్యతీసుకోటానికి రైతుకు హక్కువున్నదని మనవి చేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER:— Before the Hon. Minister replies, I will just point out that under a ruling of the Speaker Mr. Movlankar, I think I have got a right of speech though I do not usally exercise that right. There are two notifications in this Bill, notification under Section 3 and another notification under Section 4. Only notification under Section 4 bars the jurisdiction of Civil Courts. As regards notification under Section 3 sub-clause (2), the Bill is silent asto whether a certain land is commanded by an irrigation source and whether it has acquired benefit or not and all things. Under section 3 (2), the Government

may notify the date of the completion of the construction, expansion and alteration by them of any work referred to in sub-section (1) either for the entire work or for any part or stage thereof and al lands benefited or capable of being benefited by such work part or stage as so notified, shall be liable to pay Betterment contribution. Under sub-section I it creates a liability. The right to question the same in the Civil Courts is not barred. But the intention is to bar the jurisdiction of the Civil Courts. Sub-section 4 bars the decisions with respect to contributions notified under sub-section (3). Under Section 3 (2) there is a notification. This notification creates a libility for payment of Betterment tax. Under Sub-section (3) of Section (4) there is another Notification which says that the contribution payable in respect of each class of lands expressed in terms of rate per acre shall be notified and that notification cannot be questioned in a Civil Court, and not the previous notification. One creates liability and the other fixes the rent. The notification under Section 3 (2) can be challenged in a Court of Law. You have not barred there the jurisdiction of courts.

The Hon. Sri K. CHANDRAMOULI;— అధ్యక్షా మహాశయా, ఈ betterment levy విషయంలో కొందరు సందేహాలు వెలిబుచ్చారు. వాటిని గురించి నాకు తెలిసినంతవరకు వివరంగా మనవిచెస్తాను. ఈ బిల్లు యొక్క ప్రధానోద్దేశ్యము హెచ్చు పన్ను వేయడమేనని కొంతమంది సభ్యులు అనుమానము వెలిబుచ్చారు. ఇది మామూలు నీటితీరువా కాదు. Land tax గాని అటువంటి మరొకపన్ను గానికాదు. కొంత భూమికి కొన్ని సౌకర్యాలు కలుగ జేసినప్పుడు దానివల్ల ఆ భూమిమీద ఎక్కువ ఫలసాయము రైతుకు రావడమే కాకుండా దానికి రక్షణకూడా కలుగుతుంది. ఏవర్షము మీదనో దేనిమీదనో ఆధారపడకుండా permenent గా ఒకవిధమైనటువంటి రక్షణ కలుగడము, పంట అభివృద్ధి కావడముకొఱకే ఈ levy ని ప్రవేశ పెట్టాము కొన్నిపనులకు మామూలుగా బ్రిటిష్ ప్రభుత్వము ఉన్నప్పుడు నూటికి 4, 5, 6, వంతుల ఆదాయం వస్తెనే తప్ప మేముఏపని చేయముఅని చెప్పేవారు. అదేవిధముగా చెబుతారేమో అనే సందేహము ఇందాక విశ్వేశ్వరరావుగారు వెలిబుచ్చారు. మావిధానం అదికాదు 100 కి 1 వంతు ఆదాయం వస్తున్నా, కరువు ప్రాంతాలలో లాభము వస్తుందో, నష్టము వస్తుందో అనే విధానంలో కాకుండా పంటలకు రక్షణ కలుగచేయాలి వాటికి తగినటువంటి నీటి వసతులు కలుగజేయాలి అనే ఉద్దేశంతోనే ఈ పనులను మేము చేస్తున్నాము. వాటివల్ల రైతులు విశ్వాసాన్నిపొంది తాను సాగుచేస్తే తప్పక పండుతుందనే.

టటువంటి విశ్వాసాన్ని రైతుకు కలిగించి, ఆ విధంగా రైతు లాభంపొందుతున్నపుడు అతనివద్దనుంచి ఏదోకొంత తీసుకుందాము అనేది దీనిలోని ముఖ్యోద్దేశము. అయితే ఈ fee వేసేటప్పుడు పంట యొక్క విలువ చూస్తున్నారేగాని భూమియొక్క విలువ మాత్రం కట్టడంలేదు అని కూడా కొంతమంది సభ్యులు వివరించారు. అందువల్ల నేను ఈ విషయములన్నీ చెప్పవలసి వచ్చింది. ఒక్కొక్కప్పుడు పంటలు ఎక్కువగా పండుతున్న ప్రాంతాలలోకూడా, భూములవిలువ తక్కువ ఉంటుంది. రైతు ఒత్తిడినిబట్టి భూమి విలువ వుంటుంది. ఒక్కొక్క భూమి తక్కువ పంట పండినా రైతులు ఎక్కువగా ఉంటే, భూమిఒత్తిడి వున్నట్లయితే భూమివిలువ కూడా పెరుగుతుంది. రామకృష్ణం రాజుగార్కి కూడా ఈ సంగతి తెలిసి వుండవచ్చును. దీనిని గురించి చాలా కాలంనుంచి మద్రాసు ప్రభుత్వంలోను,మనప్రభుత్వంలోనూరభసలు జరుగుతున్నాయని వారుచెప్పారు. అయితే గౌరవ నీయులైనటువంటి సభ్యులు అంతా కూడా ఒక అభివృద్ధి కరమైన మార్పును ఆకాంక్షించకుండా పాత వాసనతోనే ఉండాలనే అభిప్రాయంతో ఉన్నట్లైతే దాంతో మాత్రం నేను ఏకీభవించను. అభివృద్ధి కరమైనటువంటి, ఎక్కువ మందికి శ్రేయస్కర మైనటువంటి మార్పువస్తే, దానిని బట్టి మనము కూడా మారుతాము. అది మానవ స్వభావము. మానవుని విలక్షణము కూడా. అందువల్ల మనం మద్రాసులో ఎక్కడో వాదించాము అంటే పూర్వం ఎప్పుడూ ఏవీచేయకుండా వున్నాము కాబట్టి ఇప్పుడు కూడా ఆపద్ధతిలోనే నడవాలని గౌరవనీయులైన సభ్యుల యొక్క ఉద్దేశ్యం కాదని నేను అనుకొంటాను. ఇంకా 2, 3 విషయములను గురించి మనవి చేయవలసి వున్నది. ఈ 1947 సంవత్సరము అగష్టు 15 వ తేదీనుంచి అమలులోకి వస్తుందని ఎందుకు పెట్టారు అనేది కూడా సందేహం అయివుండవచ్చును. అందులకు స్వాతంత్ర్యము వచ్చినటువంటి రోజు అంతకు ముందు మనము హెచ్చుగా అభివృద్ధి కాలేదు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ఎక్కువగా అభివృద్ధి చేసికొందుము, ఎక్కడ అయినా అప్పు చేసి అయినా రైతులకు రక్షణ ఇద్దామనే వుద్దేశ్యముతో చాలా పనులు ప్రారంభించాము. అప్పట్నుంచీ ఈ విషయం ప్రజల్లో నలుగుతూనే ఉన్నది. ఇది కొత్తగా ఈవాళ వచ్చినటువంటిదికాదు. ప్రజల్లోనూ, రైతుల్లోనూవీనినిగురించిచాలావరకుతర్జనభర్జనలుజరిగాయి. కాని దీంట్లో వున్నవిషయం మనరాష్ట్రం మిగతా రాష్ట్రాలవలే అభివృద్ధి చెందాలని మనమందరం కూడా. ఆకాంక్షిస్తువుంటాము. అయితే మనకు డబ్బుకొరవలో ఉన్నది. లేదనడానికి వీలులేదు. బడ్జటులోలోటు ఉన్నది. ఎక్కడో ఒకచోట అప్పుతేవాలి. అప్పు ఇచ్చేవారు మనకు వూరికే ఇవ్వరు. కొన్నినియమములు పెడుతారు. ఇంతవడ్డీ ఇవ్వాలనో, ఇంతకాలంలో తీర్చుటకో ఏవోకొన్ని షరతులుపెడుతారు. ఈBetterment Levy అనేది ప్రత్యేకముగా ఆంధ్రరాష్ట్రమే కనిపెట్టి తీసుకువచ్చిందికాదు, ఇతర రాష్ట్రాలలోకూడా దీనివసూలు జరుగుతున్నది. అక్కడ జరుగుతున్నమార్పులను కూడా

మనము గమనించాలి. అవిఎట్లా అభివృద్ధి చెందుతున్నదో, నాడుఎట్లు పన్నులు వేస్తున్నారో గమనించాలి. ఆవిధం గమనించాలి. మనంకూడా ఆరీతిగానే అభివృద్ధి పన్నులు వేసుకోవాలి. ఈరెండు మార్గాలు కాకుండా ఇంకో మార్గంకూడా దాంట్లో ఉన్నది. చెఱువులమరమ్మతుల గురించి నిజమైనసందేహాలు ఒక్కటి రెండు వున్నాయి. ఇప్పుడు కృష్ణాబారేజ్ స్కీమ్‌విషయం తీసుకొందాము. చాలాకాలంనుంచి దానిక్రింద భూమి సాగవుతోంది. బారేజిపడిపోయింది. మరల మనం దీనిని కడుతున్నాము. అది మరల కట్టితే ఇంకాఎక్కువగా అభివృద్ధికివచ్చే భూమి ఏమీలేదు. పాతవాటికే వుపయోగ పడుతుంది. ఇటువంటివాటిమీద పన్ను వేయాలనికాదు. షట్టరు ఎత్తు పెంచి ఎక్కువ నీరువచ్చే సౌకర్యం కలుగ చేస్తే కొత్తగా అభివృద్ధివస్తే తప్పకుండా Levy విధించవచ్చును. కొత్తభూమి సాగుకు వస్తే దానిమీదకూడా విధించవచ్చును. ఇదిఅంతగా బాగాలేదు. కాని పేదవాళ్లమీద ఎక్కువపన్నులు వేస్తున్నారు; ఇది పేదవాళ్లకు భారంగా ఉన్నది అనిఅనటము ఎప్పటికీసరికాదు. ఏఅభివృద్ధికార్యక్రమంకొనసాగించినా అందువల్ల సాగులోనికి వచ్చేభూమిలోనుంచి మూడు సంవత్సరముల వరకు ఎక్కువగా పంటరాదు. మామూలుగా వ్యవసాయము మెట్టనుంచి మాగాణికి మార్చినప్పుడు కొన్నిసహజమైన కారణములవల్ల కొన్నిసంవత్సరములు అయితేనేగాని భూమిసరియైన పరిస్థితిలోకి వచ్చి పంటలు పండవు. అధికంగా పండితేగాని ఈపన్నును వేయడానికి వీలులేదు. తక్కువ పంటలు వచ్చేవారిమీద పన్ను వేస్తున్నారు. ఎక్కువపంటలు పండించే వారిమీద పన్ను వేయడములేదు. అందువల్ల రైతులమీద ఎక్కువ భారంగా పన్నులు వేసి వారి వద్దనుంచి ఏదో గుంజు కుంటున్నారనే వుద్దేశ్యం ఎంతమాత్రం పనికిరాదు. పంటలు వెంటనే పండవు. 2 సం|| లకు గానీ పంటలు పండవు.

SRI R. B. RAMAKRISHNA RAJU :— 10 సం|| లు తరువాత ఈ levy వేస్తే జాస్తిగా ఆదాయం వస్తుందిగదా.

THE HON. SRI K. CHANDRAMOULI :— అలాచేయడము లేదు. అందువల్లనే మేము సుహృద్భావముతో వున్నామని చెప్పడానికి ఇదిప్రధానమైనటువంటి కారణము.

SRI PILLALAMARRI VENKATESWARULU :— ఒక సంవత్సరం తరువాత వేస్తే ఇంకాసుహృద్భావము ఎక్కువ అవుతుంది గదా?

THE HON. SRI K. CHANDRAMOULI:— ఒక సంవత్సరం అయితే వారికి వ్యవసాయము చేసుకోడానికి గడువుచాలదు. తరువాత ఇదిఅయినా ఏదోచవుటి భూముల మీద పడుతుంది అంటున్నారు. కొంతమంచినీరు పారినప్పుడు కొన్ని సంవత్సరములు పోతేనేతప్ప ఆచవుడు అంతా ఇంకి భూమి ఫలితంలోకిరాదు. అందువల్ల ఆదృష్టితో

చాలా భూమి ఎక్కువగా అభివృద్ధి అయినప్పుడు గాని ఈ పన్ను వేయడము లేదు. కాబట్టి ఆ దృష్టితో చూచిన ఇది చాలా న్యాయమైన పన్ను అని మనవి చేస్తున్నాను. మనకు ఇప్పుడు వున్నటువంటి పరిస్థితుల్లో మనం ఎక్కువగా డబ్బు పెట్టుబడి పెట్ట వలసి వస్తోంది. తొందర తొందరగా అభివృద్ధి కరమైన మార్పులను ఎక్కువగా చేయ వలసి వస్తోంది. ప్రతి గౌరవ నీయులైన సభ్యులు మాజిల్లాలో ఏమీ జరగడం లేదని రోజు రోజూ ఇక్కడ ఉపన్యాసాలు చెబుతూ ఉన్నప్పుడు ఏవో కొన్ని పనులు చేయాలి గాని, ఏవో ఉపన్యాసాలు చెబితే ఏమీ లాభం లేదు. చేయాలన్నట్లయితే కొంత డబ్బు కావాలి. చెఱువుల మరమ్మతుల విషయం ఆలోచించ వలసి ఉన్నది. ప్రభుత్వం కూడా ఈ విషయం ఏమీ ఆలోచించడం లేదని అనవద్దు. ఒక చెఱువు 30 యేండ్లుగా మరమ్మతులు లేక పాడుబడి వున్నటువంటి దానికి అర్థం ఏమిటి? దాని క్రింద ఏమీ వ్యవసాయం లేదు.

SRI R. B. RAMAKRISHNA RAJU:— అయ్యా మా సమీపగ్రామంలో చెఱువు మరమ్మతు లేక ఉండి పోయినప్పటికి పన్నుగా 50 రూ|| లు ఇస్తున్నాము.

THE HON. SRI K. CHANDRAMOULI:— అది వేరేసంగతి. 30 యేండ్లుగా పాడుపడి వున్నదాన్ని ఇపుడు మంచిస్థితిలోకి తీసుకు వస్తున్నాము. అందువల్ల దానికి అభివృద్ధిపన్ను వేయాల్సివచ్చిందని చెబుతున్నాను. చిన్నచిన్న మరమ్మతులు చేస్తే వాటికి ఈ అభివృద్ధి పన్నుపడదు. అందువల్లే ఈ రు. 25,000 గా exemption ఇచ్చిన కారణం. మామూలు చెఱువులు మరమ్మతులు చేస్తే అంతకన్నా ఎక్కువ ఖర్చుకాదు. ఒక్కొక్క చెఱువుక్రింద రు. 200 రు. 300 ఖర్చు అవుతుంది. 4 వేలు, 5 వేలు ఖర్చు అయ్యే చెఱువులు చాలా తక్కువ. వాటియొక్క రక్షణ కొఱకే ఈ రు. 25 లు నేల పరిమితి పెట్టునటువంటి కారణం. ఈ బిల్లులోవున్న ప్రధాన సూత్రం అభివృద్ధి కనుక మనము అభివృద్ధినే ఆకాక్షించి నట్లయితే, అదిత్వరగా కావాలన్నట్లయితే ఈ రూపంగా కొంతవరకు డబ్బుసేకరిస్తే అందువల్ల ఇంకా కొన్నిపనులు చేయడానికిఅవకాశం వుంటుం దని మా ఉద్దేశ్యం. ఈ బిల్లులోని సూత్రాలను మాకు వివరంగా చెప్పకుండా ఏదో ఆకాశంలో పెట్టి మమ్ముల నందరిని ఆమోదించమని చెబుతున్నారని కొందరు గౌరవ నీయులైన సభ్యులు చెబుతున్నారు. తెలియకుండా ఉండే విషయం అందులో ఏమీ లేదు. ముందు జరుగబోయే ఏ పనికైనా ఇది జరుగుతూనే ఉంటుంది. ఇవాళ జరిగే దానికికాదు. ఇంకా 10 సం లు అయినా సాధారణముగా ఈ చట్టము అమల్లో వుంటే అప్పుడు ఆరంభించినటువంటి పనులు అభివృద్ధి కాగానే వాటికి కూడా ఈ పన్నులు అమలు జరుగుతూ వుంటాయి. ఇది వరకు 1947 ఆగష్టు 15 వ తేదీ తరువాత ప్రారంభము అయిన వాటికి కూడా ఈ చట్టము అమల్లోకి వస్తుంది. ఎంత Betterment levy ఇచ్చుకోవాలనే విషయమే శ్రీ రామకృష్ణరాజుగారు, శ్రీ మొదలియార్ గారు చెప్పారు.

ఇంతకు ముందు గౌరవ సభ్యులు కొంత మంది చెప్పింది ఏమిటంటే ఇది కేవలం ఉద్యోగస్థుల చేతులలోనే నడుపబడితే—తాసిల్దారులు, డిప్యూటీ కలెక్టర్లు, కలెక్టర్లు మొదలైన వాళ్ల చేతులలోనే ఉంటే official routine గా ఉంటుంది. ఒకరు చేసినదే రెండవ వారు కూడా చేస్తూ ఉన్నారు. అందు చేతనే ప్రభుత్వానికి కూడా final appeal ఉండాలి అన్నారు. రైతు ప్రతి step ప్రశ్నించడానికి, ఎదుర్కోడానికి అవకాశాలు కూడా బిల్లులో ఉన్నాయి నాకు ఈ అన్యాయం జరుగుతోంది; ఈ లెక్క తప్పుగా ఉన్నది; ఇది కాదని challenge చేయడానికి వీలున్నది. Final decision అయిన తరువాత ఇది అమలు లోనికి వస్తుంది. మధ్యస్థంగా అమలు లోనికి వచ్చేది కాదు. కోర్టులకు అధికారం తీసి వేస్తాము. కాబట్టి గవర్నమెంటు కొంత సౌక్యం కలిగించు కొని final గా చేసేటప్పుడు జాగ్రత్తగా ఆలోచించి చేయడానికి వీలున్నది. ఇక ప్రభుత్వం ఎప్పుడు కావలసి వస్తే అపుడే మారుస్తుంది అని ఒకసారి ఒక నిర్ణయమైన తరువాత ఒక మొత్తాన్ని నిర్ణయించిన తరువాత, ఏ 20 సంవత్సరాల వాయిదా మీదనో ఇవ్వాలని నిర్ణయించిన తరువాత ఇక మార్పు అనేది ఉండదు. కాని ప్రభుత్వం ఇలా ఎందుకు పెట్టింది అంటే ఒక సంవత్సరం ఎప్పుడైనా పంటలు పండకపోతే, రైతులు చెల్లించలేని దుస్థితిలో ఉంటే ఆసంవత్సరం వాయిదా వేసి రైతుల ఎడల కొంచెం ఉదారంగా ఉండడానికి వీలుఉంటుంది. అందుచేత ఈ బిల్లులో ఉండే clauses చాలా clear గానే ఉన్నాయి. ఈ Betterment Levy అంటేనే నాకు అర్థంకాలేదు అన్నారు రామకృష్ణ రాజుగారు దీనిఉద్దేశం ఏమిటో ఇపుడు వారికి స్పష్టంగా తెలిసింది అనుకుంటాను.

SRI R. B. RAMAKRISHNA RAJU :— గవర్నమెంటుకు డబ్బు కావాలి. అందువల్ల వేస్తున్నామని చెప్పండి, నాకు అర్థం అవుతుంది.

THE HON. SRI K. CHANDRAMOULI:— అదికాదు. అభివృద్ధి కావాలని కోరుతున్నాను. అందువల్లనే వేస్తున్నాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— చెరువులు repair చేసినంత మాత్రంచేత ఆయకట్టు వృద్ధికాదు. చెరువును విశాలం చేసినపుడు ఆయకట్టు పెరిగితే Betterment Tax వేస్తే కొంత అర్థంఉండేదేమో. సామాన్యమైన చెరువులకు కూడా లక్షరూపాయిలు repairs కు కావచ్చును. Tank bunds ఎక్కువ చేసినా వస్తుందని అన్నారు. దీనిని clarify చేయండి.

THE HON. SRI K. CHANDRAMOULI :— గోపాలకృష్ణయ్యగారు నేను చెప్పింది సరిగ్గా అర్థంచేసుకోలేదు. ఈ సంవత్సరం చెరువు క్రింద 10 ఎకరాలు సాగు అవుతోంది అనుకోండి, అకస్మాత్తుగా breach పడిందనుకోండి, దీనిని పూడ్చ

డానికి 25 వేల రూపాయిలు ఖర్చు అయినది. అనుకోండి, దీనిక్రింద సాగు, breach పూడ్చినందువల్ల ఎక్కువపంట పండేదిలేదు. దీనిమీద పడదు. ఎక్కువపంట రాకపోతే పడేదిలేదు. అందులో ఉండే సిద్ధాంతమే అది.

SRI P. SUNDARAYYA :— అభయమే ఎక్కువ అవుతోంది.

THE HON. SRI K. CHANDRAMOULI .— మామూలు దృష్టిలో ఎక్కువ పండాలి. మామూలుగా అన్ని పరిస్థితులలోను చెరువుల చిన్న చిన్న మరమ్మతులను రైతుల నుండి రాబడతారని సందేహ పడనవసరము లేదు. మరమ్మతులు చేయడం వల్ల ఇంకా ఎక్కువ ఆయకట్టు దాని క్రిందకువస్తే మనం అందరమూ సంతోషించ వలసిందే. ఆ అభివృద్ధి కోసము కట్టాలి. ఏమీ అభివృద్ధి లేకపోతే, పంటలలో inprovement లేకపోతే చెల్లించ నక్కర లేదని అందులోనే ఉన్నది. ఇది ఒకసారి pay చేసేదికాదు. 20 వాయిదాలు రైతుల సౌకర్యం కోసమే ఏర్పాటు చేశాము. ఒకేసారి pay చేస్తే rebate ఇస్తాము.

SRI M. NAGI REDDI :— repair చేస్తే అధికంగా సాగులోనికి రాకపోతే ఏమీ లేదని అంటున్నారు. ఇప్పుడు Krishna barrage కడుతున్నారు. ఆనకట్ట పోయే టటువంటి పరిస్థితులు ఉండడంవల్ల కడుతున్నారు. ఇదివరకే నీళ్లు వస్తున్నాయి. క్రొత్త పొలాలకు ఇస్తే వేరే విషయం, అది కడుతున్నారని ఇది వరకు భూములకు Betterment tax వేయవలసిన అవసరం లేదుకదా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— పంట ఎక్కువకాకపోతేలేదు. కృష్ణాబారేజి వల్ల ఎట్లాఎక్కువ అవుతుంది ? ఇన్నిసంవత్సరాలుగా సాగు చేస్తూనే ఉన్నాము; చక్కగా సాగుఅవుతూనేఉంది ; sudden గా breach వచ్చింది. దీనిని పూడ్చడంవల్ల ఎక్కువ పంటఎట్లావస్తుంది ? కృష్ణాబారేజి sudden గా పగిలిపోబట్టి కడుతున్నాము. sufficient water లేకకాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU:— దీనివల్లకొంతఅదనంగా సాగులోనికి వస్తే మొత్తానికి అంతకువేస్తారా ? ఎట్లావేస్తారు ?

THE HON. SRI K. CHANDRAMOULI:— ఏపొలం improvement అవుతుందో దేనికి water facility ఎక్కువయి పంట ఎక్కువ పండుతుందో దానిమీద మాత్రమేవేస్తారు.

SRI P. SUNDARAYYA:— మునపటికన్న ఎక్కువగా పండక పోయినా కొంచెం guarantee గా పండుతాయి. ఎరువులు ఎక్కువగా వేయడంవల్లపంటఎక్కువగా పండవచ్చును. అట్టిసందర్భాలలో అభివృద్ధి పన్ను వేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— ఎక్కువనీరు పారుతోంది; ఎక్కువసాగుఅవుతోంది ; guarantee గా పంటలుపండుతున్నాయి; అంటే ఎక్కువ పన్నుకట్టవలసినదే. ఎరువులు వేసినందువల్లకాదు. మరొకవిషయం ఈ averages కట్టేటప్పుడు రైతువేసేటటువంటి ఎరువుల ఖర్చులు, మెట్టమాగాణి వ్యవసాయానికి ఉండే తీరు తీసివేస్తాము. మెట్టనుంచి మాగాణికి మార్చాలంటే మెరకతీయాలి. గట్టుసరిగ్గా వేయాలి. ఈఖర్చులుకూడా తీసివేస్తాము. అన్నితీసివేసి improvements కడుతున్నాము కానికేవలం superficial గా కట్టడంలేదు. బిల్లులో చిన్నచిన్న legal points లో లోపాలు ఏమైనా ఉండవచ్చు ; అవి కమిటీలో చూస్తాము. రామకృష్ణరాజు గారు మరొకటి చెప్పారు. Enforcement or strict enforcementఅనివున్నది.మామూలుగా enforce చేస్తుంటాము. అప్పుడప్పుడు కొంచెము సడలింపులుకూడా ఉంటాయి. Strict enforcement అనేపదం తీసివేసినా నాకు ఏమీ అభ్యంతరం లేదు. Strict enforcement అని ఉంచి Enforcement తీసివేసినా నాకు అభ్యంతరములేదు. Enforcement అని ఉంటే ఒక్కొక్కసారి రైతులకు లాభం చేయవచ్చు ననుకొంటాను. ఒక్కొక్కసారి partial remissions గాని postponement గాని చేయించవచ్చును. ఇందులో ప్రభుత్వం చీటికి మాటికి కల్పించుకొని వారి ఇష్టం వచ్చినట్లు చేయడానికి ఏవో అధికారాలు చేతిలోపెట్టుకోడానికి చూస్తున్నారనుకోడం పొరపాటు. ఈ rules frame చేసేటప్పుడు ప్రభుత్వం కూడా ఈ రూల్సు finalise చేసి శాసనసభలో పెడుతుంది. అప్పుడుకూడా మీకు అవకాశం ఉంటుంది. మీరందరూ సమగ్రంగా ఆలోచించి చేయాలని నాఉద్దేశం. Let us be frank.

మెట్ట పంటగా gross produce మూడు బస్తాలు ధాన్యం పండుతుందనుకోండి నీటివసతి కలుగ చేసిన తరువాత మూడు సంవత్సరాల వ్యవసాయం చేస్తారు. అప్పుడు పంట 10 బస్తాలు పండితే వచ్చిన అదనపు ఆదాయం 7 బస్తాలు. ఈ అదనపు ఆదాయం లో నుంచి భూమిని అభివృద్ధిచేసినందుకు, wet cultivation కు తేవడానికిఅయిన ఖర్చు తీసివెయ్యాలి. దానిని 10 రెట్లు హెచ్చించి దానిలో సగానికి మించకుండా ప్రభుత్వం యొక్క షేరు వసూలు చెయ్యబడుతుంది. 20 వాయిదాలకు, gross-produce కట్టడములో కేవలము ఖచ్చితముగా వెయ్యడము కాదు. అదివరకు అవలంబించిన పద్ధతులకు correct గా చేస్తాము. అక్కడక్కడ hard cases ఉంటే ఉద్యోగస్థులు విచారిస్తారు. రైతులు కోరితే కరక్టు ఫిగర్సు ఇవ్వడానికి అవకాశం ఉంది. దానిలో ఏమైనా సాధక బాధకాలుఉంటే Select Committee లవారువాటిని అక్కడ చర్చించవచ్చును. డబ్బు ఎక్కువగా వచ్చే మార్గాలన్నిటిని చూపించి రైతులకు ఎక్కువ కష్టం లేకుండా improvement చేసే మార్గాలను సూచించు

వలెనని సభ్యులను కోరుతున్నాను. అందు వల్ల ఈ బిల్లును select committee కి పంపడానికి ఏకగ్రీవంగా ఆమోదించండని నేను కోరుచున్నాను.

SRI R. B. RAMAKRISHNA RAJU:— Even the other thing saying that the decision shall not be questioned in a court of law, you know, Sir, is being questioned by writs.

MR. SPEAKER :— That is why to obviate all such suits and litigation, I am just pointing out that it can be rectified at the Select Committee stage, if it is the intention. Otherwise leave it there.

THE HON. SRI K. CHANDRAMOULI :— It is the intention that the Courts should not interfere.

MR. SPEAKER :— Then that also must be finalised. Otherwise, there is lacuna and as my friend Mr. Ramakrishna Raju has sai writs and declaratory suits will come. Shall we fix a date ?

THE HON. SRI B. GOPALA REDDI :— We leave it to the Select Committee. If there are many serious doubts, let them go into it thoroughly. Otherwise, it can come before the 2nd or 3rd October. We would like to leave it to the Select Committee without fixing th: date.

MR. SPEAKER :— The question is:—

"That The Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955 be refered to a Select committee."

THE Motion was carried.

MR. SPEAKER:— The following shall be the members of the Select Committee:—

1. The Hon. Sri N. Sanjiva Reddi.
2. The Hon. Sri K. Chandramouli.
3. The Hon. Sri Kala Venkata Rao.
4. Sri Meduri Nageswara Rao.
5. Sri S. K. V. Krishnavataram.
6. Sri Kakani Venkataratnam.
7. Sri T. Ramachandra Reddi.
8. Sri P. Thimma Reddi.
9. Sri K. Punnaiah.

10. Sri Puchalapalli Sundarayya.
11. Sri Pillalamarri Venkateswarlu.
12. Sri T. Papa Rao.
13. Sri C. V. Suryanarayana Raju.
14. Sri Gottumukkala Jagannadha Raju.
15. Sri N. Satyanarayana Raju.

Under Rule 83 of the Assembly Rules, I nominate Sri N. Sanjeeva Reddi as the Chairman of the Select Committee.

MESSAGE FROM THE GOVERNER.

MR. SPEAKER :— Before we proceed to the next item of the agenda, I have to announce that the following message dated 1st July 1955 has been received from the Governer of Andhra:—

"In pursuance of Article 207 clause (1) of the Constitution of India, I, C. M. Trivedi, Governor of Andhra do hereby give my recommendation to the introduction in the Andhra Legislative Assembly of the Andhra Inams Assessment Bill, 1955."

2. The Andhra Inams (Assessment) Bill, 1955.

THE HON. SRI K. CHANDRAMOULI:— Sir, I beg to move that the Andhra Inams Assessment Bill 1955 be taken into consideration and referred to a Select Committee with the following members:—

1. The Hon. Sri K. Chandramouli.
2. The Hon. Sri K. Venkata Rao.
3. Sri Raja V. V. Krishnam Raju Bahadur.
4. Sri Gadiraju Jagannadha Raju.
5. Sri Vijaya Bhaskara Reddi.
6. Sri Kotagiri Seetharamaswami.
7. Sri Manthena Venkata Raju.
8. Sri P. Rajagopala Naidu.
9. Sri P. Venkataswami Reddi.
10. Sri P. Sundarayya.
11. Sri R. B. Ramakrishna Raju.
12. Sri P. Narasimhappa Rao.
13. Sri K. V. S. Padmanabha Raju.
14. Sri Vellanki Visweswara Rao.
15. Sri A. Yeruku Naidu.

ఈ బిల్లు వల్ల రైతు వారి విధానములో పన్నులు ఏ విధముగా ఉన్నవో అదే విధముగా inam estates లకు కూడా అన్వయించాలన్నదే సిద్ధాంతము. అయితే దానిలో 2, 3 రకాల ఈనాములకు ఈ పన్ను అన్వయించకుండా provisions ఏర్పాటుచేసినాము అందులో ముఖ్యముగా చిన్న చిన్న వృత్తులలో ఉండే ఈనాము దారులు వారి వారి వృత్తులు సక్రమముగా చేస్తున్నప్పుడు village carpenter, village barber, blacksmith, washerman ఈనాముల మీద ఈ పన్నులు అన్వయించవు. తరువాత మామూలుగా land revenue వసూలు చేస్తూఉండే వాటికి కూడా ఇదిఅన్వయించదు. రివెన్యూ, quit Rent జోడీ, కట్టుబడి, pay చేస్తే దానిని తీసివేసి మిగిలిన దానిని మాత్రము వసూలు చేస్తాము. దానిలోని సిద్ధాంతము ఇది. మొత్తము మీద ఆంధ్ర రాష్ట్రములో 27 లక్షల 93 వేల 102 ఎకరాలకు ఈ బిల్లు వర్తిస్తుంది. దాని మీద 62, 98504/ రూపాయల assessment వస్తుంది. దానిలో quit rent జోడీ మొదలైన exemption ల వల్ల 16 లక్షలుపోతే సుమారు 46 లక్షలకు పైగా పన్ను రావడానికి ఈ రూపముగా ఆదాయము ఉందని సుమారు లెక్కలు సభ్యులు అడుగుతున్నారు కాబట్టి ఇస్తున్నాను. ఈ బిల్లు కూడా సెలక్టు కమిటీకి పోతుంది. దానిలో ఆలోచించవలసిన విషయాలు చిన్నచిన్న సవరణలు ఏవైనాఉంటే ఆలోచించ వచ్చును. దీనిలో ప్రధానమైన ఉద్దేశము తరంవారీగా ఎక్కడ ఏ భూమి ఉన్నా ఒక విధమైన పన్నులు వెయ్యాలి అనేదే దీనిలోని సిద్ధాంతము ఒకచోట ఎక్కువ ఒకచోట తక్కువ ఉండకూడదని, రైత్వారీ విధానములో ఉన్నతరాల ప్రకారం తీరువా వెయ్యవలెను, అనేది సిద్ధాంతము. దీనిని గౌరవ సభ్యులందరు సెలక్టు కమిటీకి పంపడానికి అమోదించవలెనని కోరుచున్నాను.

SRI S. VEMAYYA:— అధ్యక్షా, ఈ బిల్లులో ఒక సందేహం ఉంది, ఈ బిల్లువల్ల సామాన్యముగా ఈనాము భూములను, రైత్వారీ భూములుగా చేస్తున్నారు. ఇంకా విపులముగా తీసుకువస్తే బాగుంటుంది. ఈబిల్లులో (3) (2) (D) clause కు ఒక amendment తీసుకొని వచ్చి ఈ కండ్రిగలు ఇతర hamlet గ్రామాలను తొలగించవలెనని ఆశించుచున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI:— ఇది ఈనాములకు సంబంధించిన హక్కుల విషయము. ఇప్పుడు ఉన్నహక్కులు యధాతథంగా ఉంటాయి. ఈ బిల్లుకు ఈనాంఆక్టుకు సంబంధములేదు. కేవలము (3) (2) (1) Section amendment కాదు. రైత్వారీ పన్నులు తీసుకొన వలెననే గాని, హక్కుల విషయమై తేలువరకు మేమాగం. హక్కులకు ఏమీ సంబంధం లేదు. కాబట్టి సభ్యులు తక్కిన విషయాలు మాట్లాడడం బాగుండదని నా మనవి.

SRI K. V. S. PADMANABHA RAJU :— On a point of information Sir ఇప్పుడు Controversy ఉన్నదని అనుకుంటున్నప్పుడు atleast 3, 2,(D) amend చేస్తూ ఎట్లాగూ ఒకబిల్లు రాబోతుంది కాబట్టి అంతవరకు దీన్నివుంచి, తరువాత దీన్ని తెస్తే బాగుంటుందేమో !

THE HON. SRI K. CHANDRAMOULI:—ఇది Taxation bill. దానికి. దీనికి సంబంధములేదు. అది కూడా త్వరలోనే రాబోతుంది. I assure on behalf of the Government that it will be taken up as early as possible and immediately after considering this amending Bill.

MR. SPEAKER :— Motion moved "that the Andhra Inams (Assessment) Bill, 1955, be referred to a Select Committee consisting of the following members":—

1. The Hon. Sri K. Chandramouli.
2. The Hon. Sri K Venkata Rao.
3. Sri Gadiraju Jagannadha Raju.
4. Sri Vijaya Bhaskara Reddi.
5. Sri Raja V. V. Krishnam Raju Bahadur.
6. Sri Kotagiri Seetharamaswami.
7. Sri Manthena Venkta Raju.
8. Sri P. Rajagopala Naidu.
9. Sri P. Venkataswami Reddi.
10. Sri P. Sundarayya.
11. Sri R. B. Ramakrishna Raju.
12. Sri P. Narasimhappa Rao.
13. Sri K. V. S. Padmanabha Raju.
14. Sri Vellanki Visveswara Rao.
15. Sri A. Yeruku Naidu.

SRI S. VEMAYYA :— అధ్యక్షా, ఎస్టేట్లరద్దుచట్టములోని section 3 (2) (a)కి సవరణ వచ్చేటంత వఱకూ గూడా దీన్ని ఆపి తదుపరి అన్ని ఈనాములకూ apply చేసే దానికి ప్రభుత్వం పూనుకుంటే ఇంకా ఎక్కువ డబ్బు వస్తుందని చెప్పి నేను ఆశిస్తూ దీన్ని తప్పకుండా అంత వఱకూ ఆపాలని చెప్పి మంత్రి గారికి మనవి చేస్తున్నాను. service ఇనాములు వగైరాలను మినహాయింపు చేసి, తరువాత ఉన్న ఈనాములకు ఈ చట్టం వర్తిస్తుందని చెప్పబడింది. ఇప్పుడు అనేక గ్రామాలలో తీసుకున్నట్లయితే ఈ చాకిరీ ఈనాములు చాకిరీ చేసే టటువంటి వాళ్ల చేతులలో లేవు. ఆ గ్రామము

తీసుకున్నా వాళ్ళు అమ్ముకోవడం గాని, ఇంకో విధంగా ఇతరులకు అధీనం చేయడంగాని జరిగింది. అనేక మందిని నేను విచారిస్తే 20 సంవత్సరాల నుంచీ కూడా మేము అనుభవిస్తున్నాం మేము ఎకరానికి ఒకరూపాయికి, నాలుగు అణాలు, ఎనిమిది అణాలు శిస్తులు కట్టుతున్నాము, కాని మామూలుగా యితర రైతులు ఎకరానికి 8 రూపాయలు 9 రూపాయలు, పదిరూపాయలు, యీవిధంగా చెల్లిస్తున్నారు, మేమేమో నాలుగణాలు, ఎనిమిది అణాలు రూపాయకు మించ కుండా శిస్తు కట్టి బాగానే అనుభవిస్తున్నాం అని వాళ్ళు చెప్పడం జరుగుతోంది. ఈ ఈనాములు service చేసే టటువంటి వారి చేతుల్లో లేవు. ఎప్పుడైతే వారి చేతుల్లో నుంచి జారి పోతున్నాయో ప్రభుత్వం అవి మళ్ళా resume చేసి దాని మీద రైతువారీ రేట్లు వేసి వసూలు చెయ్యాలని ఉన్నప్పటి కిన్నీ, ఇప్పటి వఱకూ ఆ విషయాన్ని గురించి action తీసుకుని resume చెయ్యడం గాని, రైతువారీ రేట్లు మీద వెయ్యడం కాని జరుగ లేదు. service చేసే వారికి బేరీజు deduction వగైరాలు ఇవ్వడం కూడా జరుగుతోంది. అటువంటి విధానాన్ని ప్రభుత్వం అవలంబించ కుండా ఈ ఈనాములు service దార్ల చేతులలో ఉన్నాయా, ఎవరి చేతులలో ఉన్నాయని విచారణ జరిపించాలి. ఈ service ఈనాముల పేరుతో ఈ భూములుండడం వల్ల మనకు డబ్బు రాదు. ఈ ఈనాములు resume చేసి రైతువారీ యీనాము క్రింద convert చేసి పూర్తి రేట్లు విధించేటంత వఱకూ కూడా దీనికి ఈ చట్టం అనువర్తించదని చెప్పి, అట్లా అనువర్తించేటట్లు ఏమైనా rules pass చేయడమో, లేక దీనికి amendment తీసుకురావడమో చేయాలి అట్లా చేస్తే నేను దానికి తప్పకుండా ఒప్పుకుంటాను. కాని ప్రస్తుతం నాకు తెలిసినంత వఱకూ వారి మీద పన్ను వేసే విధానంగాని, rule కాని, అధికారంకాని లేదు. ఎక్కడైనా ఈ విధానం ఉపయోగిస్తోన్నట్లయితే నాకు కనపడడంలేదు. నాకు తెలిసినంత వఱకూ ఇవన్నీ కూడా తప్పిపోతున్నాయని మనవి చేస్తున్నాను. మరో విషయంకూడా ప్రభుత్వ దృష్టికి తీసుకురావలసియుంది. service దార్ల చేతులలోనుంచి జారిపోయిన service ఈనాములన్నీ కూడా మరల resume చేసి మళ్ళీ service చేసేటటువంటి వాళ్ళకు ఇవ్వడానికి ప్రభుత్వం పూనుకుంటుందా? పూనుకోవడంలేదు. అట్లా పూనుకోనందువల్ల వాళ్ళకు తెలియక ఏ గంజినీళ్ళకో అమ్ముకున్న సామెతగా చాలా స్వల్పఖరీదుకు ఈ భూములన్నీ కూడా ఇతరుల చేతులలోకి జారిపోయినాయి. ఈ రోజున ఆ చాకిరీ చేసే వాళ్ళు ఏమంటున్నారంటే మా పెద్దవాళ్ళు ఏదో అవసరంకొద్దీ పొరపాటున ఏ వంద రూపాయిలకో అమ్మేసుకొన్నారు ఈరోజున ఆభూమి ఎకరం రెండువేల రూపాయిలు చేస్తుంది. ఆ డబ్బుఅయినా ఇచ్చుకుంటాం, మాకు వాపసు చెయ్యమని ఈ చాకిరీ చేసే ఈనాందార్లు అడుగుతూ ఉంటే, ప్రభుత్వం ఈ ఈనాములు ఇతరులకు చెల్లకూడదనీ, ఈ చాకిరీ దార్లకే ఉండాలని చెప్పి వాటిని resume చేసి ఎందుకు తీసుకోవడం.

లేదో నాకర్థం కావడంలేదు. ఇప్పుడైనా కూడా ప్రభుత్వం అటువంటి చట్టాన్ని Pass చేసినట్లయితే ఈ చాకిరీ ఈనాం భూములన్నీ మళ్ళీ చాకిరీ చేసేటటువంటి వాళ్ళ చేతులలోకి రావడానికి వీలవుతుంది. ఈ చాకిరీ ఈనాములన్నీ కూడా పన్నుపడకుండా తప్పిపోతున్నాయి. కాబట్టి ఈ భూములన్నీ ఈ చాకిరీ చేసేవాళ్ళకే దక్కేటట్లు చూడడం కాని లేకపోతే రైతువారీరేట్లు ఈ భూములన్నిటికీ వర్తించడానికి చట్టంలో సవరణ తీసుకురావడంగాని చేస్తారని నేను ముఖ్యంగా Revenue మంత్రిగారిని కోరుతున్నాను. నా వాదన ఈ బిల్లుకు ఇది సమయం కాదు. దీన్ని తీసుకురా నవసరంలేదు. నేను చెప్పిన విధంగా 3 (2) D Section కి అది వచ్చిన తరువాత దాన్ని, దీన్ని సమన్వయం చేసి అప్పుడు తీసుకువస్తే బాగుంటుందనీ అంతవరకూ దీన్ని విరమించుకుంటారని మనవి చేస్తున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :— అధ్యక్షు మహాశయా! నేను దీనికి సమాధానం చెప్పవలసింది ఏమీలేక పోయినా ఒక్క విషయం మాత్రం చెప్పవలసి యుంది. నేను మొదట్లోనే స్పష్టం చేశాను. సె. 3 (2) (d) కి అధికారాలు తీసెయ్యడం ఇచ్చెయ్యడంతో ఏమీ సంబంధంలేదు. పన్ను వెయ్యడానికి ప్రభుత్వానికి అధికారం లేదనేటటువంటి అభిప్రాయం కొందరికున్నది. ఆ అధికారం సంపూర్తిగా ఉన్నది. అన్నివిధాలా అది ఆలోచించే, legal opeinion తీసుకునే ఇది తీసుకువచ్చాం. అందువల్ల నేను గౌరవనీయులైన సభ్యులకు చెప్పేది దీనిలో ఏమీ controversial issues గాని, చాలా పెద్ద వ్యవహారాలుగాని ఏమీలేవు అని..

SRI R. B. RAMAKRISHNARAJU:— కమిటీలో ఉన్నవారు మాట్లాడకూడదన్నారు.

THE HON. SRI K. CHANDRAMOULI :— అందరూ మాట్లాడారు.

MR. SPEAKER :— We shall observe a convention.

Sri R. B. RAMAKRISHNA RAJU:—Permissionఇస్తే ఒక్క విషయం చెప్పదలిచాను. ఇందులో ఒక్క లోపం నాకు కనబడుతోంది. Section 20 AbolitionAct క్రింద ఇటువంటి వేమైనా favourable rents క్రింద ఉండేటటు వంటివి కూడా Section 20 క్రింద వస్తుందని High Court Decision ఐనది. ఇటీవల 1954 లో కూడా aecision ఐంది. అది forests కు apply కావాలని వారువాదించినారు కూడా ఈ ప్రకారం favourable rates of rents కిచ్చినటువంటిభూములలో ఈ ఈనాములకు కూడా Section 20 అన్వయిస్తుందని ఆప్రకారం ఎప్పుడైనా రాజాలు కాని, జమీందార్లు కాని favourable rates కనుక ఇచ్చివుంటే, అదిగవర్నమెంటును బాధిస్తుందని, దాన్ని

తొలగించుకోవాలంటే గవర్నమెంటువారు మూడు మాసాలు notice ఇచ్చి, దానికి compensation ఇచ్చిపూరా తీరువ విధించ వచ్చునని section 20 క్రింద ఉన్నది. దాని ప్రస్తాపన ఈ Act లో ఏమీలేదు.

MR. SPEAKER:— అదంతా విచారింతురుగాని Select Committee లో

SRI R. B. RAMAKRISHNA RAJU :— ఆ విచారణ చెయ్యాలి మనం. Estate Abolition Act ను సవరిస్తేగాని అది తప్పిపోదు. దాన్ని గురించి వారు ఏమి చెయ్యాలను కున్నారో చెప్పండి.

THE HON. SRI K. CHANDRAMOULI :— ఇప్పుడున్నటువంటి విషయం అదికాదు.

MR SPEAKER :— The point he raises is that without payment of compensation, if you take away these inams, article 31 of the Constitution may stand in the way. Is it your point?

THE HON. SRI K. CHANDRAMOULI :— No, no, it wont stand.

SRI R. B. RAMAKRISHNA RAJU :— Section 20 of the Estates Abolition Act stands in the way.

THE HON. SRI K. CHANDRAMOULI :— Estates తీసుకోవడం, compensation pay చెయ్యడం అనే ప్రశ్న లేదండి. ఉన్న పదుని రైతువారి level కి తేవడంతప్ప అంత వఱకూ ప్రభుత్వానికి పరిపూర్ణమైన అధికారం ఉన్నది. ఇది 1802 నుంచీ తీసుకున్నా, ఇప్పటి వఱకూ చూచినా ఈ అధికారం ఉన్నది. అందువల్ల నేను చెబుతున్నాను. ఇతర హక్కుల విషయంలో ఈ బిల్లు ఏమీలేదు. ఇది కేవలం రైతు వారీ విధానానికి పన్నులు తేవడానికే. ఐనా అటువంటి చిన్న చిన్న సందేహాలేమైనా ఉంటే Select committee లో వారు కూడా సభ్యులుగా ఉన్నారు కనుక అక్కడ ఆలోచించ వచ్చునండి.

SRI RAJA V. V. KRISHNAM RAJU BAHADUR :— ఇప్పుడు మీరు ఏ Inams కు అయితే Assessment వేయదలచు కున్నారో ఆ ఈనాములు ఒకప్పుడు బనాషాహీ అని Royal grant గా once for all pay to the present settlement పుట్టిన Inams అవి. అవి subsequent గా 1859 లో enfranchise చేశారు. Enfranchise చేసేముందు ఏమి జరిగిందంటే ఈ రకం ఈనాములన్నీ కూడా Government at any time resume చేసుకోవచ్చునని వుంది. ఈనాందారు చచ్చి పోయినప్పుడు Government అది resume చేసుకుని తిరిగి ఆ family వాళ్ళంతే

ఇచ్చేవారు. Government కు ఉండేటటువంటి resumption హక్కును twist చేసి rent కట్టి ఫైసలా చేశారు. That is called quit rent inam. ఏం ఫైసలా ఐనదంటే గవర్నమెంటు resume చేసేహక్కు twist చేసి rent కట్టి fix చేశారు. Once for all rent అని ఎప్పుడైతే వచ్చిందో rent మీద enhance చెయ్యడానికి recent Privy Council తీర్పులు కూడా ఉన్నాయి. అందువల్ల దానికి ఆక్షేపణలేదని చెబుతున్నాను. ఇంకొకవిషయం ఏమిటంటే 3 (2) (d) amendment అయ్యేపర్యంతం ఇది stop చెయ్యాలని కొందరు చెబుతున్నారు. 3 (2) (d)కిన్ని దీనికిన్ని ఏమీ సంబంధం లేదు. ఇదిప్రత్యేకంగా enfranchise చేస్తూవున్న minor quit rent inams విషయం మాత్రమే. 3 (2) (d) అనేది whole village మీద single grant ఉన్నప్పుడు జరిగింది. Subsequent గా కొన్ని High Court తీర్పులవల్ల ఖండ్రికలు or hamlets కూడా వచ్చాయి. కాబట్టి వాటినికూడా include చేయాలని 3 (2) (d) amend చేస్తున్నాం తప్ప ఈబిల్లుకీ సె.3 (2) (d)కి సంబంధం లేదనిమనవి చేస్తున్నాను.

SRI L. LAKSHMANA DAS:— Point of order, Sir. ఇపుడు ఈఈనాములకు శిస్తు అధికం చేయవలెనంటే 3 (2) (*d*) అక్కరలేదనే వారు చెపుతూ ఉన్నారు. దీనికి దానికి ఏమైనా సంబంధం ఉందా అని అడుగుతున్నాను.

MR. SPEAKER :— లేదు, cl. (6) లో 'the rights which the occupants of the land, if any, the rights which they have if any, are not interfered by this Act. అనిఉంది.

SRI VAVILALA GOPALA KRISHNAYYA :— ఇపుడు ఊళ్లలో, ఈ ఈనాములు సర్వీసుఈనాములుఅని declaration కాకుండాRentReductionActక్రింద declare అయినటువంటి ఈనాములు ఉన్నాయి. అవి whole village inams కావు. దానిని ఏ మన్నా మీరు declare చేస్తారా? ఇనాము క్రింద declare చేయకుండా వదలి పెట్టేటట్లయితే మరి ఏ position లో పోతుంది? అది దీనిక్రిందకి వస్తుందా రాదా? వచ్చేటట్లయితే గవర్నమెంటు తీసుకొని వచ్చేబిల్లుకు అభ్యంతరం కావచ్చును. అందువల్లనే నేనుదానిని clarify చేయవలెనని అడుగుతున్నాను.

MR. SPEAKER: — They will be assessed the same rent, if they are estates, under another provision. Under this provision minor inams are being assessed.

THE HON. SRI K. CHANDRAMOULI:— అసలు estate కాక మిగిలిన ఈనాముల విషయమే ఇది. అందువల్ల ఆ complication ఏమీరాదు.

MR. SPEAKER :— Inams will become estates and they will also be liable to pay similar assessment; that is the purpose of abolition.

SRI VAVILALA GOPALA KRISHNAYYA :— I concede that point. అధ్యక్షా ఇపుడు ఒక position ఉంది. Estate క్రింద declare కాలేదు. అది కంట్రిక అయింది అని అనుకొంటున్నాము. కంట్రిక అయినా కాకపోయినా ఇనాము క్రిందనే లెక్క కట్టించుకొంటూ ఉన్నాము. అది estate కాదు. అది ఏమి అవుతుంది? ఇనాముల క్రింద వచ్చి తీరుతుందా, లేదా? వచ్చి తీరుతుంది. మీరు assess చేస్తారు. Assess చేయటం వచ్చేటట్లయితే ఒక పాయింటు అవుతుంది. Ordinary inam క్రింద గవర్నమెంటు declare చేసింది. Rent reduction ఎట్లా oppose చేస్తూ వచ్చారో ఈ opportunity తీసుకొని మళ్లా దానిమీద contest చేయడానికి ప్రయత్నిస్తారు.

MR. SPEAKER:—That is why there is this saving clause cl.(6). You please read cl. (6). It clearly, says that the rights would not be interfered by this Act. Those rights are not touched.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒక విషయం ఉంది దీంట్లో. Estates amendment act లో Tribunals ఉన్నాయి. అనుకోండి. Estates కాదని వాండ్లు declare చేస్తారు అనుకోండి. అది patent గా కనబడుతుంది. ఇది కేవలం పన్ను హెచ్చుచేసే పద్ధతి తప్ప ఇతరత్ర ఏమీ లేదు. కాబట్టి దీనిని ఆమోదించవలెను.

MR. SPEAKER :— I shall now put the main motion to the vote of the House. The question is :

"That the Andhra Inams (Assessment) Bill, 1955, be referred to a Select Committee."

The motion was carried.

MR. SPEAKER :— The following Hon. Members will be the members of the Select Committee :

The Hon. Sri K. Chandramouli.
The Hon. Sri Kala Venkata Rao.
Sri V. V. Krishnam Raja Bahadur.
Sri G. Jagannatha Raju.
Sri Vijaya Bhaskara Reddi.
Sri K. Seetharamaswamy.
Sri M. Venkataraju.

Sri P. Rajagopal Naidu.
Sri P. Venkataswami Reddi.
Sri P. Sundarayya.
Sri R. B. Ramakrishna Raju.
Sri P. Narasimhappa Rao.
Sri K. V. S. Padmanabha Raju.
Sri V. Visweswara Rao.
Sri A. Yeruku Naidu.

Under Rule 83 of the Assembly Rules I nominate the Hon. Sri K. Chandramouli, Minister for Revenue as the Chairman of the Select Committee.

## MESSAGE FROM THE GOVERNOR.

MR. SPEAKER :— I have to announce to the House that the following message dated the 26 th August 1955 has been received from the Governor of Andhra:—

In pursuance of Article 207, clause (1) of the Constitution of India, I, Chandulal Madhavlal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Legislative Assembly of the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955.

## (3) THE MADRAS GENERAL SALES TAX (ANDHRA AMENDMENT) BILL, 1955.

THE HON. SRI D. SANJIVAYYA :— Mr. Speaker, Sir, I beg to introduce the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955, and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా నేను ముందు మాట్లాడితే వాండ్లు దానికి సమాధానం చెప్పినట్లు ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వానికి ఆర్థిక లోపం చాలా ఉంది. ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం చేకూర్చవలెను అనే టటువంటి ఉద్దేశంతో అదనంగా పన్ను వేస్తున్నాం. ఈ అదనపు పన్ను 'mill cloth, whether of silk, artificial silk, wool flakes or other meterial not being cotton in which the average count of yarn employed is 17 counts or finer, పైన రూపాయకు 0-1-3 విధించ దలచాము. ఇవి single point tax గ ఉంటవి. అదే విధంగా 'mill cloth not made wholly of cotton in which the average count of yarn employed is 17 count or finer, whether single or folded, 0-1-3. This is also a single point one.

Then mill cloth made of cotton in which the average count of cotton employed is 35 counts or finer, whether single or folded 0-1-3. అది కాకుండాను precious stones మీద ఒకరూపాయకు ఆరు పైసాల చొప్పున tax వేయాలని ఇందులో ప్రతిపాదించ బడినది. మనం దీనికి విశేషంగా చర్చ చేయవలసిన అవసరం లేదు. దీనిని అందరు అంగీకరిస్తారు అని ఆశిస్తున్నాను. ముఖ్యంగా మనకు రెండవ పంచవర్ష ప్రణాళిక ఉంది అందులో అనేక కోట్ల రూపాయలు ఖర్చు పెట్టవలసి యున్నది. వచ్చే 5 సంవత్సరములలో ఎన్నో కోట్ల రూపాయలు ఖర్చు పెట్టవలసి ఉన్నపుడు మనము అధికముగా ఆదాయాన్ని చేకూర్చుకొనవలననే విషయం అందరు గమనించి దీనిని ఆమోదిస్తారని నేను ఆశిస్తున్నాను.

MR. SPEAKER:—Motion moved—

"That the Madras General sales Tax (Andhra Amendment) Bill, 1955 be taken into consideration at once."

SRI S. VEMAYYA:—SIR, I beg to move that the Bill be circulated for eliciting public opinion thereon.

THE HON SRI B.GOPALA REDDI:— ఇది Budget speech లోనే చెప్పినటువంటివిషయం. ఈ రెండు మాసములనుండి public అంతాకూడా దీనికి ఆమోదము తెలుపుతూ ఉన్నారు. ఇక Public opnion ఎందుకు ?

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఆమోదాన్ని తెలుపుతూ ఎన్ని petitions వచ్చాయి ?

SRI S. VEMAYYA :— ఇక్కడ ముఖ్యంగా 17 నంబరు మీద కూడ పన్ను వేయబడుతుందని ఉన్నందువల్ల నేను ఈ సవరణను ప్రతిపాదించాను. ఇంతకు ముందు మొదటి బడ్జెటులో ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు fine cloth, precious stones మీద మాత్రమే పన్ను వేసినట్లైతే అభ్యంతరం ఉండదు. Fine cloth తరువాత precious stones మీద మాత్రమే ఈ పన్ను వేస్తామని చెప్పారు. కనుక, సరే, fine and super fine cloth మీద మాత్రమే ఈ పన్ను వేస్తారు కాబోలు. ఇది పెద్దవాళ్లకే తగులు తుంది. సామాన్య ప్రజానీకానికి తగలదు అని అనుకొన్నాము. కాని, ఇప్పుడు మన యెదుట పెట్టిన ఈ బిల్లు చూచినట్లైతే 17 నంబరు, 35 నంబరు వగైరా గుడ్డలకు కూడ ఈ పన్ను తగులుతుందని నేను ఆలోచిస్తున్నాను. Public కు దీని వివరాలు బాగా తెలియవు కాబట్టి, public కు ఇది అందజేసి, వారి అభిప్రాయాన్ని తెలుసుకోవలెనని మంత్రిగారిని నేను కోరుతున్నాను. తరువాత దీంట్లో వివరాలు చూచినప్పుడు, ఇక్కడ 0-1-3 చొప్పున విధించే పన్ను ఏ మాత్రం ప్రభుత్వానికి వస్తుంది, రెండవ item మీద ఎంత వస్తుంది, precious

stones మీద ఎంత వస్తుంది, ఈ వివరాలు తెలియజేస్తే, దీనిని ఏ విధంగా సవరించ వచ్చునో ఆలోచించడానికి వీలుండేది. మంత్రిగారు ఆ విధంగా ఆలోచించి చేస్తారని ఆశిస్తూ నా amendment ను వొత్తిడి చేస్తున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :— వేమయ్యగారు 17 కౌంట్లు మీద కూడ పడుతుందని అన్నారు. అది silk and mill cloth మీద అని చెప్పుచున్నాను. Silk, artificial silk, wool అటువంటి వాటిలో 17 counts కు పైన ఉండే వాటి మీద ఈ tax పడుతుంది. Cotton mixture అయినవ్వటికి కూడ 17 counts పైన ఉంటే వాటిమీద పడుతుంది. purely cotton అయిన mill cloth అయితే 35 counts and above వాటిపైన పడుతుంది. వాటిపైన 0-1-3 చొప్పున ఈ పన్ను వేస్తున్నాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :— I second it.

MR. SPEAKER:— Amendment moved—

"That the Madras General Sales tax (Andhra Amendment) Bill, 1955 be circulated for eliciting public opinion thereon."

SRI PILLALAMARRI VENKATESWARLU:— I am seconding it. అధ్యక్షా, ఈబిల్లును public opinion కు పంపించవలసిన అవసరమున్నది. ఇది Budget ఉపన్యాసములో చెప్పినప్పటికి కూడ ఏ రూపములో ఈ బిల్లు రాబోతున్నదో, ఎంత వేయబోతున్నారు, అనేటటువంటి విషయంమాత్రం స్పష్టంగా లేదు. దీంట్లో ముఖ్యంగా silk మొదక గుడ్డలమీద ఎంతపన్ను వేస్తున్నారో 35 counts కు పైన ఉన్న mill cloth మీద కూడ అంతే వేస్తున్నారు. అందువల్ల దీన్నిగురించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. దీనివల్ల మామూలు ప్రజానీకానికి కష్టంగా ఉంటుంది. వారు దీన్ని భరించడం కష్టము. చేనేత గుడ్డను చేనేతపరిశ్రమను ప్రోత్సహించేందుకు ఈవిధంగా చేస్తున్నామని అంటారేమో చేనేత గుడ్డను ప్రోత్సహించ వలసిందే, దానికి కావలసినటువంటి సౌకర్యాలు చేయవలసిందే. అవసరమైతే ఇప్పుడు ప్రభుత్వము ఇచ్చేటటువంటి డబ్బు ఇంకా ఎక్కువగా చేయవచ్చు, అంతేకాదు, మిల్లుయజమానులు మీచేతిలో ఉన్నారు. గనుక మిల్లుగుడ్డ నేలేకుండా చేయండి మీచేతనైతే. అంతేగాని మిల్లుగుడ్డ అదీ ఇదీ కూడ ఇక్కడ తీసుకువచ్చిపెట్టి, silk కు ఏరేటు చొప్పున వసూలుచేస్తున్నారో mill cloth కు కూడ ఆవిధంగానే ఎలాంటి విచక్షణలేకుండా, చేయడం సమంజసంగా లేదనిచెప్పుచున్నాను. అక్కడ counts కాదు ముఖ్యము-మామూలు clothకు, mixture లేనటువంటి cloth కు. కూడ పన్ను వేస్తున్నామనేది గమనించవలసి యుంటుంది. సాధారణంగా silk గుడ్డలు, పట్టు గుడ్డలు కట్టుకొనే రోజులు పోయాయి. దాన్నిమీద ఇంకా lower counts మీద కూడ వేస్తున్నామన్నారు. అదిముఖ్యవిషయము. 40 నంబర్లు

mill cloth మీద కూడ అంతే పన్ను వేయడమనేది సమంజసంగాలేదు. మహారాజులు భాగ్యవంతులు కొనుక్కొనేటటువంటి precious stones వాటిమీద ఆరుపైసలు వేసి దీనికి మాత్రము రూపాయికి 0-1-3 చొప్పున వేయడం జరుగుచున్నది. అందువల్ల దిన్నిగురించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవలసిన అవసరంవున్నది. యేవిషయంలోనైనా ప్రజాభిప్రాయమును తెలుసుకోడానికి మీరు సర్వసిద్ధంగా ఉంటారు. గనుక మీరుదానికిభయపడనవసరం లేదు. మనము ఎట్లాగో నవంబరులో తిరిగి meet అవుతున్నాము. అప్పుడు కాశేశ్వరరావు గారు ప్రజాభిప్రాయాన్ని తీసుకు వస్తారు. సంజీవయ్య గారు కూడ విజయవాడ మొదలగు చోట్లకు వెళ్ళి నప్పుడు, అక్కడంతా ప్రజాభి ప్రాయము ఎట్లుందో అందరిని అడిగి తెలుసు కోడానికి వీలు అవుతుంది. అంతే గాని 40 నంబరుకు, 60 నంబరుకు, 80 నంబరుకు, 120 నంబరుకు అన్నిటికి కలసి రూపాయికి 0-1-3 చొప్పున ఒకే రేటు వేయడం ఎంత మాత్రం సరికాదు. ఇప్పుడు జరిగే టటువంటి పరిస్థితి చూస్తే, 40 నంబరుకు పైన ఉండే గుడ్డను ఎక్కువ మంది కట్టరు. అసలు మిల్లు క్లాత్ లో 20 నంబరు ఉండనే ఉండదు. మామూలుగా 40 నంబరుకు తక్కువగా ఉండదు. చాలా మంది 40 నంబరు గుడ్డే ఎక్కువ కట్టేది. కనుక సామాన్య ప్రజానీకానికంతా ఈ భారము తగులుతుంది. లేకపోతే ఈ మిల్లు బట్ట కట్ట కూడదని నిషేధ మైన చేయించి, చేతనైతే handloom బట్టే కట్టాలని చెప్పండి. అదేదికాకుండా ఈ మిల్లు యజమానుల చేత బట్ట అంతా తెప్పించి మార్కెటులో పంపించి, దాన్ని కొనుక్కుంటూ మంటె, అన్నిటిమీద ఒకేరేటు వేస్తామంటే సరికాదు. అందువల్ల దీంట్లో అయిన, పైనంబర్లకు 80 నంబరుకు, 100 నంబరుకు అవసర మైతే రేటు ఎక్కువ చేయండి. ఇంక నష్టం వస్తుందను కొంటే, precious stones మీద increase చేయండి. ఆరు పైసాలను ఒక అణాను, లేక 0-1-6 నో చేయండి. అసలు precious stones మీద 0-0-6 ఇంక తక్కువ ఎందుకు పెట్టాలో నాకు బోధపడడం లేదు. ఇదంతా చూస్తే, ఈ విధాన మేమి సరిగాలేదనే అభిప్రాయం కలుగుతున్నది. కనుక దీనిని ప్రజాభిప్రాయనికి పంపించ డమో లేకపోతే కనీసం 40 నంబరుకు ఒక రేటు, 60 నంబరుకు ఒక రేటు, 80 నంబరుకు ఒక రేటు ఈ విధంగా పెట్టినా బాగుంటుంది. లేకపోతే silk మీద ఎక్కువ వేయండి, silk, sarees మీద ఎక్కువ వేయండి, ఏ బిల్లులో అయినాసరే న్యాయమనే టటువంటిది తెలియ జేయవలసిన అవసర మున్నది. అన్నిటికి ఒకేరేటు వేయడం సరికాదు. వీటికి ఒక disparity తీసుకోండి, 40 నంబరుకు ఒకరేటు 60 నంబరుకు ఒకరేటు 80 నంబరుకు ఒకరేటు 100 నంబరుకు ఒకరేటు ఈ విధంగా ఒక్కొక్కదానికి ఒక్కొక్క రేటు ఎందుకు పెట్టకూడదు. పేదవాడు కట్టేదానికి, భాగ్యవంతుడు కట్టేదానికి ఒకేరకమైనపన్ను వేస్తే ఏమి న్యాయమనిపించుకొంటుంది? వీరి పన్నుల విధానమంతా అట్లాగే కన్పిస్తుంది. జమీందారులు ఒకేరకమైన

పన్నులు కట్టాలి, పేదవారు ఒకేరకమైన పన్నులు కట్టాలి, అంటే దీంట్లో ఏమిన్యాయముంది? ఈ పద్ధతిమారాలని చెప్తున్నాను. కనీసం ఒక్కొక్క నంబరుకు ఒక్కొక్క రేటువేసి ఆ disparity అయినా చూపించవలసి యుంటుంది. సామాన్యప్రజానీకము, ఎక్కువమంది 40 నంబరే కడతారు. కనుక దీనికి పన్ను తగ్గించవలసిన అవసరమున్నది.

AN. HON. MEMBER :— వెంకటేశ్వర్లు ఇప్పుడు ఎన్ని counts కడుతున్నారో చెప్పితే అక్కడనుండి మనము వేసుకొంటే బాగుంటుంది.

MR SPEAKER :— It is not material for our purpose.

SRI PILLALAMARRI VENKATESWARLU: ఎన్ని counts కడతానో తరువాత చెప్తాను. కనుక ఈబిల్లు సంజీవయ్యగారు ఆలోచించకుండా తొందరపడి తెచ్చినట్లు ఉన్నది. వారు ఇదంతా చూచి ఆలోచించి ఉంటె ఈ విధంగా ఇది ఉండేది కాదని నా నమ్మకము. దీన్ని ఎంత ఆలోచించినప్పటికిని సరియైన సమాధానం దొరకటం లేదు. ప్రధానంగా దీంట్లో object చేయవలసింది జమీందార్లు, భాగ్యవంతులు పెట్టుకొనే precious stones పైన ఆరు పైసలువేస్తే మిగిలినవాటిపైన అన్నిటిపైన సగటుగా రూపాయికి 0-1-3 చొప్పున, silk ముతక బట్టలమీద కూడా, అదేరేటు వేయటమనేది. ఇది ఏ మాత్రము సరికాదని అనుకొంటాను. కనుక దీనిని public opinion కు పంపించటమో లేక ఒక్కొక్క నెంబరుకు ఒక్కొక్క రేటువేసి, ఎక్కువ నంబరుకు ఎక్కువ వేయండి. సిల్కుకు ఎక్కువవేయండి. Precious stones కు 0.1.0 వేసి mill cloth కు తగ్గించవచ్చు. 40 నంబరుకు తగ్గించి, 60 నంబరుకు, 80 నంబరుకు, 100 నంబరుకు కొద్దికొద్దిగా ఎక్కువవేయండి. ఎందుకంటె 40 నంబరుబట్టే ఎక్కువమంది, సామాన్య ప్రజానీకం,కడుతున్నారు. కనుక దీనికి తగ్గించి పైవాటికి కొద్దిగా ఎక్కువ వేయండి. కనీసము అట్లైనాసరే మార్చవలసిన అవసరము వుందని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. మిల్లు బట్టలో ఎక్కువమంది నలభై నెంబరు కట్టుతారు. అందులో 17, 20 లు వుండవు. నేను కోరేదల్లా ఒకటే. దానికి కనీసము కొంత మార్జను చూపించండి. దానికి మార్జను 0-0-6 నో 0-0-9 నో చేసి మిగిలిన దానికి పెంచండి. మిగిలిన దానికిపెంచటానికి ఒప్పుకుంటున్నాము గదా! 60 వ నెంబరుకో, లేకపోతే 180 వ నెంబరుకో పెంచండి. పోనీ precious stones మీద, silk మీద పెంచండి. 0-1-3 కాకపోతే 0-2-0 తీసుకోండి. అంతేకాని దీనిమీద వేయడం న్యాయంకాదు. కార్ణమేమిటంటే దీనిలో glaring గా కనబడుతున్నది. లేకపోతే బిల్లును ఆమోదించటానికి ఏ విధమైన అభ్యంతరమూ వుండదు. నలభై నెంబరు సైను మీద వేస్తూ 40 నెంబరుకు 120 నెంబరుకు అంతటికీ గూడా ఒకేరేటు వేస్తున్నారు. అందువల్ల యీ పద్ధతి సరిగా లేదనేసంగతి గుర్తించాలి. సంజీవయ్యగారు యీవిషయములో కొంత దీర్ఘాలోచించి మంత్రివర్గానికి నచ్చచెప్పి, యీమార్పులు చేసేటంతవరకూ ప్రస్తుతము యీ బిల్లును వాయిదా వేయాలని కోరుతూ విరమిస్తూన్నాను.

26th September 1955]

Sri B. APPARAO:— అధ్యక్షా, జూలై నెలలో జరిగిన బడ్జట్టు సమావేశములో యీ పన్నుల ప్రతిపాదనల పైన సభ్యులందరు గంటలతరబడి చర్చించి వారి అభిప్రాయాలు తెలియ పరచారు. దానిని పురస్కరించుకొని యిందులో ఏకాభిప్రాయము అన్ని పక్షములవారు ప్రకటించారు. దానిపైన వచ్చినదే యీబిల్లు. ఇది తిరిగి ప్రజాభిప్రాయానికి పంపించాలని మన మిత్రులు కోరటములో కేవలము factory కార్మికులను దృష్టిలో పెట్టుకొని దీనికి ఏదో అవాంతరము వున్నట్లు, యీ factory కార్మికుల పేరిట, కార్మికులను, factories ను రక్షించుకోవాలి అనే అంతరార్థమే నాకు కన్పిస్తున్నది. ఇటువంటి పరిస్థితులలో చేనేత ముతకబట్ట తయారు చేసే గ్రామీణులకు ప్రోత్సాహము యిస్తామని చెప్పటములో ఏమంత సమంజసముగా లేదు. గ్రామీణులకు, చేనేత పరిశ్రమకు రక్షణకల్పించే దృష్టితోనే మిల్లులో తయారు అయ్యే సన్నబట్టమీద పన్ను వేయటానికి యీ బిల్లుయొక్క వుద్దేశ్యము. తత్ఫలితముగా ఆంధ్ర ప్రభుత్వము ఆదాయము పెంచుకునే వుద్దేశ్యము కూడా యిందులో వున్నది. కాబట్టి యీ బిల్లుకు అడ్డంకులు లేకుండా వెంటనే యీ సమావేశములోనే దీన్ని ఆమోదించి చట్టం వేయడానికి తోడ్పడవలసిందిగా ప్రతిపక్షంవారిని కోరుతున్నాను.

MR. SPEAKER :— The question is :

That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955, be circulated for eliciting public opinion thereon.

The motion was lost.

MR. SPEAKER: — Sri Vavilala Gopalakrishnayya has given notice of an amendment. I do not know where it fits in.

SR. VAVILALA GOPALAKRISHNAYYA:—I am not moving it.

MR. SPEAKER :— I shall now put the main motion to the vote of the House. The question is.

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955, be taken into consideration at once."

The motion was carried.

Clause 2

MR. SPEAKER :— The motion is :

That Clause 2 do stand part of the Bill

Sub-clause (a)

MR. SPEAKER :— Sri Vavilala Gopalakrishnayya has given notice of an amendment under this sub-clause.

SRI. VAVILALA GOPALAKRISHNAYYA :— I am not moving it, Sir.

MR. SPEAKER ;— Then I shall put sub-clause (a) to the vote of the House. The question is :

"Sub-clause (a) of clause 2 do stand part of the Bill."

The motion was carried.

Sub-clause (b)

SRI S. VEMAYYA :— Sir, I beg to move—

"That in sub-clause (b) in item (viii) for the rate of tax 'one anna three pies' substitute the rate 'one anna'; In item (ix) for the rate 'one anna three pies' substitute the rate 'nine pies'. In item (x) for the rate 'one anna three pies' substitute the rate 'six pies'; In item (xi) for the rate 'six pies' substitute the rate 'two annas'."

SRI PILLALAMARRI VENKATESWARLU :— I second it.

MR. SPEAKER:— I am sorry, under the Constitution for any increase in taxation you have to get the sanction of the Governor. It is only for decreasing you can move amendments.

THE Hon SRI B. GOPALA REDDI :— వెంకటేశ్వర్లు గారు కోశే దానిలో రేటు హెచ్చు చేయాలని అంటున్నారు. దానికి ఇప్పుడా అనుమతి లేదు కాబట్టి, దానిని move చేయటానికి వీలులేక పోయి నప్పటికి, వెంకటేశ్వర్లు గారు తెచ్చిన సవరణ ఎంత వరకు వీలు వుంటుందో చూచి అందులో ఏ మాత్రము వీలుగా వున్నప్పటికినీ, వారు చెప్పిన దాన్ని అంగీకరించ టానికి మాకు ఎట్టి ఆక్షేపణ లేదు.

MR. SPEAKER :— So I rule the amendment as out of order. There are no more amendments to sub-clause (2). So I shall put the sub-clause (2) to the vote of the House. The question is :

'Sub-clause (2) do stand part of the Bill.'

The motion was carried.

Clause I was put and carried.

The Preamble was put and carried.

THE HON. SRI D. SANJIVAYYA :— Sir, I move—

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 be passed into law.

SRI S. VEMAYYA :— అధ్యక్షా, ఇప్పుడు ఈ బిల్లు ప్యాసు అయిపోయింది. ఇప్పుడు 17 counts వ గాని, దానిలో ఏదైనా శక్తి ఉన్నట్టయితే వాటన్నింటికి

కూడా ఒకే రకంగా charge చేయడానికి, 35 counts పైన వున్న వాటి కన్నింటికి సమానంగా charge చేయడానికి ప్రభుత్వం వారు నిర్ణయించారు. ఈ చట్టము వల్ల దేనికి ఏవిధంగా వేయాలి అనే విచక్షణ లేకుండా అన్నింటికినీ ఒకే విధంగా ఒకే గాటిని కట్టి వేసిన విధంగా వుంటుంది. ఇప్పుడు ప్రభుత్వము వారు ఈ చట్టాన్ని పురస్కరించుకొని రూల్సు కూడా ప్రకటించారు. ఆ రూల్సు లోనైనా అందులో సిల్కు గాని కాటన్ గాని కలసి వున్నట్లయితే మేము charge చేస్తాము అన్నప్పుడు ఎంత భాగము కలసి ఉండాలి, ఎన్ని వంతులు సిల్కు ఉండాలి అనేది విశదీకరిస్తూ మొత్తం అంతా cotton గా వుండి, ఏ కొద్ది పాటి బార్డరులోనో, ఇంకేవిధముగా నైనా దానికి కొద్దిగా కల్తీ ఉన్నట్లయితే అటువంటిది మినహాయిస్తే ఎంతో సమంజసముగా వుంటుందని ముఖ్యముగా వారు గమనించాలని కోరుతున్నాను. అందువల్ల ఎక్కువగా counts నూలు. cotton గా వుంటే, అటువంటి కేసులనుకూడా మినహాయించ డానికి ప్రభుత్వము ఈ రూల్సు ఏవైనా చేయడానికి వీలు కుంటుందని, సిల్కు ఎక్కువగా ఉన్నప్పుడు ఎక్కువగా వేయడము, cotton ఎక్కువగా వున్నప్పుడు, ఎక్కువగా ఉపయోగపడ్డప్పుడు, దానికి ఇంకో రక మైన రేట్లు, కొన్నింటికి కొద్దిగా కల్తీ వున్నప్పటికి అటువంటి వాటిని పూర్తిగా మినహాయించే రూల్సు కొన్నింటిని చేసినట్లయితే సామాన్యంగా 30 counts, 25 counts, 17 counts వగైరాల వాటికి కొంత రక్షణవుంటుంది. కాబట్టి ఏదైనా కల్తీవున్నట్లయితే మేము తప్పకుండా ఈ చార్జి వేస్తాము అనడంలో అనేకమంది పేద అను ఇది దెబ్బ తగులుతోంది కాబట్టి తప్పకుండా ఈ రూల్సు చేసే సమయములో నైనా దీనిని ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఇలాంటి మినహాయింపులన్నీ తీసుకొని వస్తుందనిచెప్పి నేను ఆశిస్తూ ఆవిధంగా చేయాలనికోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— అధ్యక్షా, ఈనాడు ప్యాసు చేస్తున్నటువంటి మిల్లు బట్టమీద ఈ సేల్సుటాక్సు ఆంధ్ర అసెంబ్లీలో మొదటి taxation మీద ప్యాసు చేస్తున్న దన్నమాట. ఇంత వరకు పోయిన అసెంబ్లీ కాని, ఈ అసెంబ్లీ కాని ఇంత వరకు అదనంగా ఏ పన్నులు కూడా వేయలేదు. ఇది మొదటి బిల్లు. దీనిని వెంకటేశ్వర్లుగారితోపాటు చాలామంది సభ్యులు ఎంతో సహృద్భావములో త్వరలోనే ఈ బిల్లు ప్యాసు కావడానికి సహాయ పడ్డందుకు అందరికీ కూడా నమస్కారాలు చేస్తున్నాను. ఇటువంటి బిల్లులో మనము కొన్నింటిని చేసుకొని శాసు చేసు కొన్నప్పుడే దేశానికి క్షేమం అని మనవి చేస్తున్నాను. ఈ విషయము చెప్పడానికి నాకు అవకాశం ఇచ్చి నందులకు నా ధన్యవాదాలు.

MR. SPEAKER :— The question is—

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill 1955 be passed into law."

The motion was carried and the Bill passed into law.

[26th September 1955

## MESSAGE FROM THE GOVERNOR

MR. SPEAKER:— I have to announce to the House that the following message dated the 8th September 1955 has been received from the Governor of Andhra:—

'In pursuance of Article 207, clause (1) of the Constitution of India, I, Chandulal Madhavalal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Legislative Assembly of the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) Andhra Amendment Bill. 1955.'

(4) *The Madras General Sales Tax and The Madras Tobacco (Taxation of Sales and Registration) Andhra Amendment Bill*, 1955.

THE HON. SRI D. SANJIVAYYA:— Mr. Speaker, Sir, I beg to introduce the Madras General Sales Tax and the Madras Tobacco (Taxation of Sales and Registration) Andhra Amendment Bill, 1955 and move that the Bill be referred to a Select Committee. The names of members of the Select Committee will be announced tomorrow.

The motion was put to vote and carried.

(5) *The Madras Village Panchayats (Andhra Amendment) Bill*, 1955.

THE HON. SRI A. B. NAGESWARA RAO:— Mr. Speaker, Sir, I beg to introduce the Madras Village Panchayats (Andhra Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా! మామూలుగా transfer of property మీద duty 100 కి 5 రూపాయిలు చొప్పున వేస్తున్నాము. అది ఇది వరకు మునిసిపాలిటీ ఏరియాల్లో 100 కి 5 వంతులు చేస్తున్నారు. జిల్లా బోర్డుల ఏరియాల్లోనూ, పంచాయితీ బోర్డు ఏరియాల్లోనూ, 100 కి 4 వంతులు చేస్తున్నారు. జిల్లా బోర్డులు ఆర్థికంగా వెనుక బడి ఉండటము వల్ల వాటిని అభివృద్ధి చేయాలనే అభిప్రాయంతో 100 కి నాల్గు రూపాయిలు ఇస్తున్నది అయిదు రూపాయిలు వరకు హెచ్చించినాము. ఈ హెచ్చింప బడిన దాంట్లో మామూలుగా పంచాయితీలు ఉన్నచోట కూడా 100 కి రు. 5. లు. జిల్లా బోర్డులకు రావాలనే అభిప్రాయం ఒకటిఉన్నది. పంచాయితీలు ఉన్న చోట ఇది వరకు 100 కి రు. 4 వంతులు చేసు కొంటున్నారు. రు 4 లు వంతున చేస్తు దానిని రు 5 లు లకు పెంచి, ఆ విధంగా పెంచిన దాంట్లో జిల్లా బోర్డులు ఆర్థికంగా

వెనుక బడి ఉండటం వల్ల ఈ ఒక percent పంచాయితీ బోర్డుల్లో తగ్గించి హెచ్చించిన ఒకటిని, దీనికి కలిపిన ఒకటిని కలిపి 100 కి రు. 2 లు చొప్పున జిల్లా బోర్డులకు ఆర్థికంగా కలపాలనే ఉద్దేశ్యంతో ఈ విధంగా చేస్తున్నాము. కొన్ని జిల్లా బోర్డులు ఆర్థికంగా చాలా వెనుక బడి వుండటం వల్ల అక్కడ అభివృద్ధి పనులు చేయడానికి అవకాశము కలుగ లేదు. జిల్లాబోర్డుల్లో special officers ను వేసి పరీక్షించి వారు సూచించిన సూచనలో ఆర్థికంగా వాటిని అభివృద్ధిచేయడానికి ఇది ఒక సూచన. సాధారణముగా దీనికి పంచాయితీ బోర్డులవారు అభ్యంతరం పెట్ట వచ్చును. కాని దీంట్లో ఇది వరకు 100 కి రు. 4 లు విధిస్తున్నాము. దానికి రు. 4 లు ఆదాయము వస్తున్నది. ఇప్పుడు 3% కు తగ్గిస్తే మాది తగ్గించడము ఎందుకు మాది ఎక్కువగా వేసుకొనే 1% వారికి ఇచ్చి వెళ్లితే వేరే పంచాయితీలు లేని చోట్ల 100 కి రు. 5 లు చొప్పున వసూలు చేసుకోవాలని అభ్యంతరము పెడుతున్నారు. కాని దీనికి ఒక percent తగ్గించడము మూలంగా ఎక్కువ నష్టము కలుగదుగాని, ఆఒక్క percent ను 1000 పంచాయితీబోర్డులమీద నుంచి వస్తే జిల్లా బోర్డులు ఆర్థికంగా ఎక్కువ అభివృద్ధి కలుగ డానికి వీలుంటుంది. తర్వాత జిల్లాబోర్డులను maintain చేయవలసిన రేట్లు కానియుండి, విద్యా విధానమును అభివృద్ధి చేయడానికి కానీయండి, ఇవన్నీ అభివృద్ధి చేయడానికి సావకాశము ఉన్నది కాబట్టి దయచేసి ఈ amendment ను ఏకగ్రీవంగా ఒప్పుకో వలసిన దని సభ్యులందరినీ కోరుతున్నాను.

MR. SPEAKER :— The question is :

"That the Madras Village Panchayats (Andhra Amendment) Bill, 1955 be taken into consideration."

The motion was carried.

Clause 2.

MR. SPEAKER :— Motion moved—
"Clause 2 do stand part of the Bill."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— MR. Speaker Sir, I beg to move :

For new sub-section 4 in clause 2, substitute the following.

"The duty shall be distributed equally to the village panchayat and district board."

MR. SPEAKER :— For want of a seconder the motion is lost.

SRI S. VEMAYYA :— SIR, I beg to move :

In sub clause (2) (a) for the word 'three-fifths' substitute the word 'four-fifths'

For the word 'two–fifths' in sub-clause (2) (b) substitute the word 'one-fifth'.

SRI PILLALAMARRI VENKATESWARLU :— I second it.

SRI M. NAGI REDDI :— అధ్యక్షా, ఒక వైపున పంచాయితీ రాజ్యాన్ని స్థాపించాలని చెప్పి పంచాయితీలకు అధికారం ఇస్తూ పంచ వర్ష ప్రణాళిక జయ ప్రదం కావాలని చెబుతూ, ఒక వైపు గ్రామాలు బాగుపడితేనే తప్ప గత్యంతరము లేదని కేంద్ర రాష్ట్రి ప్రభుత్వాలు చెబుతూ, ఒక వైపు గ్రామాలు బాగు పడాలంటే పంచాయితీల ఆర్థిక స్తోమతు పెంచాలని అప్పుడే గ్రామాలు బాగు పడతాయి అని చెబుతూ తీర్మానాలు, సమావేశాలు జరుపుతూ, పంచాయితీలకు ఉన్న ఆదాయాన్ని తగ్గించి వాటి ఆర్థిక స్తోమతును కురచపరిచే శాసనాన్ని తీసుకు వచ్చినారంటే, చెప్పేదానికి చేసేదానికి ఏ విధంగా సంబంధం లేకుండా ఉన్నదని స్పష్టంగా కనిపిస్తుంది. రివెన్యూ మంత్రి చంద్రమౌళి గారు ఇది వరకు మంత్రిగా ఉన్నప్పుడే 1950 వ సంవత్సరం లో పంచాయితీల శాసనాన్ని చేసినారు. అది అమలు లోనికి వచ్చినప్పటికి దాని క్రింద పంచాయితీలకు రావలసిన రివెన్యూ ఆదాయంలో 12½%, Act లో ఉదహరించి నప్పటికి, ఇవ్వ కుండా ఎప్పటి కప్పుడు కాల యాపన చేస్తూ, ఈ విధంగా శాసనం తీసుకోవచ్చారు. 12½% ఇవ్వాలని ఆంధ్ర రాష్ట్రి పంచాయితీ మహా సభలలో తీర్మానాలపై తీర్మానాలు చేస్తున్నారు, deputations మీద deputations పంపిస్తున్నారు. Local development లో ¼ వాటా ఇవ్వాలని కోరుతున్న పరిస్థితులలో, పంచాయితీలకు, ముఖ్యంగా వెనుక బడిన పంచాయితీలకు, వచ్చే ముఖ్య మైన ఆదాయాన్ని కోత పెట్టడానికి ప్రభుత్వం సిద్ధ పడిన మరొక ఆదాయం ఏమిటో ఆలోచించాలి. మెట్ట తాలూకాలో పంచాయితీలకు ముఖ్యంగా ఎక్కువ ఆదాయం వచ్చేది surcharges వల్ల తప్ప మరొకటి లేదు. 0–4–3 లో వస్తే అందులో 0–0–6 వరకు ఇస్తే దాని మీద 100, 150, 200 వరకు వస్తుంది. Taxation చూస్తే house tax వీటి వల్ల వచ్చేది చాలా స్వల్ప ఆదాయం. గుమాస్తా జీతాలకు కూడా చాలదు. ఈ విషయం పంచాయితీ లెక్కలు చూస్తే తెలుస్తుంది. 12½% విషయం తేల్చ లేదు. దానిని ఇవ్వ కుండా ఎగనామం పెడుతూ, వచ్చే స్టాంపు డ్యూటీలో కూడా కోత పెట్టడానికి సిద్ధ పడుతున్నారంటే ఆంధ్ర కాబినెట్ local boards యెడల తీసుకున్న వైఖరి స్పష్టపడగలదు; వాటిని ఎంత స్వల్పంగా చూస్తున్నారో తెలుస్తున్నది. స్థానిక స్వపరిపాలనాశాఖా మంత్రిగారు Municipal Chairman గా పనిచేసినారు. కాబినెట్ లో లోపాయికారిగా కొట్లాడుతున్నారేమో నాకు తెలియదు

కాని ఆచరణలో మాత్రం పంచాయితీల హక్కులను చాలా కురచపరచడం మాత్రం జరుగుతోంది. దేశం మొత్తం మీద చూచి నప్పుడు ఆంధ్ర రాష్ట్రం తప్ప అనేక రాష్ట్రాల్లో దాదాపు 3, 4 రూపాయిలు మొదలు కొని 30% land revenue వరకు ఇస్తుంటే, మన రాష్ట్రం లో మాత్రం ఏ మాత్రం అందులో నుండి ఇవ్వ కుండా ఉన్న దానిని దిగకోయడం స్పష్టంగా కన బడుతోంది. ఇది ఏ మాత్రం సమర్థ నీయం కాదు. అసెంబ్లీలో కూర్చుని గ్రామాలను బాగుపరచనిదే ఏ విధమైన కార్యక్రమం చేయ లేమని గౌరవనీయులైన ప్రభుత్వపక్ష సభ్యులకు కూడా తెలుసును. వాళ్లకు కూడా చెబుతున్నాను. ప్రభుత్వ పక్షం చాలా మెజార్టీగా ఉన్నది కాబట్టి ఏదైనా పాసు అవుతుందనే ధైర్యం వారికి ఉన్నది. ఈ పంచాయితీ వ్యవహారాలకు సంబంధించిన గౌరవ సభ్యులు కూడా కొందరున్నారు. ఈ విధంగా సంకుచిత పరచడం గ్రామాలు అభివృద్ధి కావడానికి తోడ్పడదు. అందు వల్ల దానిని పూర్తిగా విరమించుకోవడం మంచిదని మంత్రి వర్గానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఆదాయం రావడానికి ప్రణాళికను చేస్తున్న పెద్దలు ఇలా చేస్తున్నందుకు విచార పడాలి. ఎట్టి పరిస్థితులలోను ఈ amendment ను బలపరచ డానికి లేదని మంత్రి వర్గంవారు పునరాలోచించాలని, ఈ విషయం పంచాయితీల అభిప్రాయాలకు వదలి వేస్తే వారి అభిప్రాయాలు మీకు తెలుస్తాయి. జిల్లా బోర్డుల ఆర్థిక పరిస్థితులు బాగా లేవని చెబుతున్నారు. జిల్లా బోర్డుల ఆర్థిక పరిస్థితులు బాగా లేక పోయినంత మాత్రాన పంచాయితీల మీద వేయడం సరిఅయిన విషయం కాదు. అనేక విషయాలు బాగా లేవు, జిల్లా బోర్డుల ఆర్థిక విషయాలు బాగా లేవు. పంచాయితీలు ఎక్కువగా ఉన్నాయి కదా అని వారి ఆదాయం దిగగోయడం న్యాయమేనా ! ఇది correct అయిన విధానం కాదు. అంత మాత్రాన జిల్లా బోర్డులు బాగుపడవు. జిల్లా బోర్డులకు ఇవ్వవలసిన assistance గురించి అసెంబ్లీ సభ్యులు వేరే ఆలోచించాలి కాని పంచాయితీలకు ఇవ్వ వలసింది తీసివేసి జిల్లా బోర్డులకు ఇస్తే అవి బాగు పడుతాయి అనుకోడం పొరపాటు. జిల్లా బోర్డుల పరిస్థితులు ఆలోచించాలంటే దానికి వేరుగా కాబినెట్ ఆలోచించాలి కాని పంచాయితీల ఆదాయాన్ని కోతకోయడం భారత దేశ వ్యాపితంగా ఉన్న మిగతా రాష్ట్రాల అసెంబ్లీలు అనుసరిస్తున్న వైఖరిని గమనించినా సరికాదని మనవి చేస్తున్నాను. ఈ బిల్లును ఉపసంహరించు కోవాలని మంత్రి వర్గానికి విజ్ఞప్తి చేస్తూ, ఈ amendment ను ఆమోదించ లేమని మనవి చేస్తున్నాను.

SRI S. K. V. KRISHNAVATARAM:— అధ్యక్షా ! ఈ బిల్లును నేను బల పరుస్తున్నాను. కొద్ది రోజుల క్రిందటనే question time లో Local Administration మంత్రి గారు మన పాత జిల్లా బోర్డులలో ఎంత ఎంత లోటు ఉన్నదో ఆకారణముల చేత Special Officers ను వెయ్య వలసి వచ్చిందో ఎందు చేత వీరి

పదవీ కాలం పొడిగించ వలసి వచ్చిందో చెప్పేరు. జిల్లా బోర్డులకు elections పెట్టడం ప్రభుత్వ దృష్టిలో ఉన్న దన్నారు. జిల్లా బోర్డులు లోటు బడ్జెటులతో ఉన్నవి. ఆ కారణము చేత జిల్లా బోర్డులు ఏ మాత్రము కూడా పనులు చెయ్య లేకుండా ఉన్నవి. జిల్లా బోర్డుల రోడ్ల దుస్థితి చూస్తే వాటి స్థితి ఏ లాగు ఉన్నదో తెలుస్తుంది. జిల్లా బోర్డుల విద్యా బోధకులకు జీతాలు చాలా నెలలుగా డబ్బులేని కారణం చేత ఇవ్వ లేదు. Elementary, secondary schools కూడా అదే పరిస్థితులలో ఉన్నవని మనందరికి తెలుసును. పల్లెటూళ్ళలో అనేక విధములైన services ఉన్నవి. Secondary and elementary schools maintenance, roads, maternity centers; hospitals, dispensaries జిల్లా బోర్డులు maintain చేస్తున్నవి. ఆకారణము వల్ల జిల్లా బోర్డుల స్తోమతు సరైన స్థితిలో పెట్టవలసి ఉంది. మనము ప్రతి వారం కూడా Gazettee లో చూస్తున్నాము ఏదో గ్రామం పంచాయితీగా మారుస్తున్నట్లు. ఈ అక్టోబరు ఒకటి తరువాత ఎన్నో పంచాయితీలు ఏర్పడ నున్నవి. Non-Panchayat ల నుంచి వచ్చే డబ్బు ఇక మీద తగ్గుతుంది. ఇంతకు ముందు రిజిస్ట్రేషను నుంచి వచ్చే డబ్బు జిల్లా బోర్డులకు ఉండదు. ఇప్పుడు ప్రభుత్వం పెట్టిన బిల్లు ప్రకారం అంతా రివెన్యూ పంచాయితీలకు వెళ్ళుతుంది. జిల్లా బోర్డులకు direct చెయ్య వలసిన అవసరం ఎంతైనా ఉంది. జిల్లా బోర్డులు మళ్లీ మంచి స్థితిలోనికి వస్తే పంచాయితీలకు కావలసిన డబ్బును వాటి నుండి ఉపయోగించ వచ్చును. ఏది ఎలా ఉన్నప్పటికి రాష్ట్రం మొత్తం మీద పంచాయితీలు ఏర్పడితే జిల్లా బోర్డులు ఉండ వలసిన అవసరం కూడా ఉండదు. ఆ సమస్య మనము తీవ్రముగా ఆలోచించాలి. విలేజి పంచాయితీలకు కొంత ఖర్చు పెట్ట వచ్చును. ఈ బిల్లును నేను అంగీకరిస్తూ సోదర సభ్యులు కూడా అంగీకరించవలెనని కోరుచున్నాను.

SRI A. VENKATARAMA RAJU :— అధ్యక్షా ! ఇపుడు తీసుకువచ్చిన బిల్లు సమర్థనీయము అయినదికాదు అని నేను చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. ముఖ్యముగా బెజవాడ మీటింగులో Planning మంత్రి కళా వెంకటరావు గారు ప్రభుత్వ విధానం decentralisation గాని centralisation కాదు, అంతేకాదు, కాంగ్రెసు policy కూడా పంచాయతీరాజ్యము స్థాపించడమే అన్నారు. ఈపంచాయతీలకు వచ్చే ఆదాయము జిల్లాబోర్డులకు ఇచ్చివేస్తే పంచాయతీ కార్యక్రమము ప్రత్యేక సానుభూతితో ఆలోచించవలెను. జిల్లాబోర్డులు ఈ నాడు తమ కార్యకలాపాలను వాయిదా వేస్తున్నది. రోడ్లు మూలపడినవి. 1947 ఆగస్టు 15 తరువాత ఈ ఎనిమిది సంవత్సరాలలో జిల్లాబోర్డులు మూలపడినవి. అప్పులపాలు అయి కంట్రాక్టర్లకు dposit డబ్బు కూడా ఇవ్వలేకుండా ఉన్నవి. కాంగ్రెసు ప్రభుత్వం ఏమిచేస్తున్నది. డబ్బులేక అనేక జిల్లాబోర్డులు మూలపడి వాటి కార్యములు మూలపడ్డవి. పంచాయితీ

బోర్డులడబ్బు, జిల్లాబోర్డులకు ఇవ్వమని అనడము సరైనదికాదు. రెండవప్లాను తీసుకొని వచ్చి ఈ పంచాయితీల మీాద పెట్టారు. వారికి కావలసిన అయిదు సంవత్సరాల పునోభివృద్ధికోసము గవర్నమెంటుకు పథకాలు పంపడం జరిగింది. పైనుండి వచ్చేసరికి నాల్గవ వంతు తగ్గిపోయింది. అయినప్పటికీ ఈ పంచాయితీ కార్యక్రమము ఒక ప్రాథమిక దశలో ముందుకువచ్చి స్థిరమైన ఆదాయము వచ్చేలాగున చూడవలెనని అనుకుంటున్న రోజులలో పంచాయితీ కార్యకలాపాలను నిరుత్సాహ పరచడం సమంజసముకాదు. Cabinet పునరాలోచించ వలెనని కోరుచున్నాను. రాష్ట్రములో పంచాయితీల సంఘం ఉంది. దాని యొక్క తీర్మానములను వారికి పంపించి వారి సలహా తీసుకొనడము కనీస ధర్మము. ఈ తీర్మానము ఉపసంహరించుకొనవలెనని చెబుతూ శలవు తీసుకుంటున్నాను.

SRI JANAB MAHABOOB ALI KHAN :— ఈ బిల్లును నేను support చేస్తున్నాను.

N. RAMULU:— అధ్యక్షా ! గౌరవనీయులైన మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ తీర్మానాన్ని నేను ఆమోదిస్తూ, ఈ తీర్మానంవల్ల గ్రామ పంచాయితీల ఆర్థిక పరిస్థితి ఏ విధంగా మారుతుందో వారి దృష్టికితెచ్చి, తగు విధంగా ఈ గ్రామ పంచాయితీలకు ఆర్థిక పోషణ చేకూర్చవలెనని కొన్ని సూచనలు చేస్తున్నాను. ఈనాడు అన్ని గ్రామాలలో పంచాయితీలు ఏర్పడక పోయినప్పటికీ ఆ గ్రామాల తాలూకు సర్చార్జి District Board కి వచ్చినప్పటికీ, అనేక జిల్లాబోర్డుల ఆర్థిక పరిస్థితి ఏమంత బాగాలేదు. అదె దృష్టితో ఈ నాడు గౌరవనీయులైన మంత్రిగారు జిల్లాబోర్డులకు తగిన ఆర్థిక స్తోమతు కల్గజేయడానికి ఈ బిల్లును తెచ్చి పెట్టారు. అది సంతోషకరమైన విషయమే, కాని జిల్లాబోర్డులకు ఈ సర్చార్జీ ఆదాయం పెడితే గ్రామ పంచాయితీలకు ఆదాయం తగ్గిపోతుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద ఈ గ్రామ పంచాయితీలు తమ యొక్క నాలుగోవంతు ధనాన్ని ప్రతి కార్యక్రమానికీ ఇచ్చిననాడే ఆ కార్యక్రమాన్ని ఆ పంచాయితీలు ఏర్పర్చుకొని చేసుకోగలవు. కాని ఇప్పుడు అనేక గ్రామాలలో గ్రామ పంచాయితీలు లేనందున ఆయా గ్రామాల తాలూకు $\frac{1}{4}$ వంతు జిల్లాబోర్డువారే ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం క్రింద ఆ గ్రామ సౌకర్యాలకు ఇవ్వవలసియుంది. కాని గ్రామ పంచాయితీలు ఏర్పడిన తరువాత జిల్లాబోర్డువారు ఆ గ్రామాలకు కావలసిన సౌకర్యాలను గురించి $\frac{1}{4}$ వంతు contribution ఇవ్వనవసరంలేకుండా పోతుంది. అందువల్ల ఆ గ్రామానికి వచ్చే రాబడి, ఈ సర్చార్జీ డ్యూటీ కూడా జిల్లాబోర్డు వారు తీసుకొనడంవల్ల ఈ గ్రామాలకు కావలసిన సౌకర్యాలు చేకూర్చుకొనుటకు ఆ గ్రామాలు $\frac{1}{4}$ వంతు contribution ఇవ్వలేకుండా పోయే ఆర్థిక దుస్థితిలో

ఉండ గలవు. అందును గురించి ప్రభుత్వంవారు ఈ గ్రామ పంచాయితీలకు అదనంగా ఆదాయం చేకూర్చే ఈ సలహాను పాటించ వలసినదని కోరు చున్నాను. ఈనాడు గ్రామాలలో stamp లు private వ్యక్తుల ద్వారా అమ్మ బడుతున్నవి. అందు వల్ల ఆవ్యక్తులు దాని వల్ల లాభం పొందు తున్నారు. ఈ Stamp Vending business పంచాయితీలకే ఇచ్చినట్లయితే ఆ లాభం పంచాయితీలకే చేకూరి ఈ సర్ఛార్జిడ్యూటీ వల్ల రాబడి పోయిన నష్టాన్ని భర్తీ చేసుకో గలరని మనవిచేస్తూ ఈ బిల్లుకు అందరూ సమర్థించ వలసిందిగా కోరుతున్నాను.

SRI R. B. RAMAKRISHNA RAJU :— అధ్యక్షా! పంచాయితీల రాబడిని తగ్గించడానికి తెచ్చిన ఈ బిల్లు ఏ మంత సంతృప్తికరంగా లేదు. పంచాయితీలు వృద్ధి కావాలని అందరం కోరు తున్నాం. ఇప్పుడు మిత్రులంతా మాట్లాడారు. దాన్ని మగల చెప్పడానికి నా కిష్టం లేదు. కాని పంచాయితీల యొక్క రాబడిని తగ్గించడం అంత మంచిది కాదని నా అభిప్రాయం. District Boards కు రాబడి లేదంటున్నారు. District Boards లేక పోయినా కూడా ఫరవాలేదుకాని పంచాయితీలు లేకపోతే మాత్రం మన దేశానికి చాలా అరిష్టమని మన మందరం ఒప్పుకున్న విషయం. అందులో ఈ one fifth, $\frac{2}{5}$ అన్నారు గదా ఈ $\frac{2}{5}$ వల్ల ఎంత రాబడి యున్నది. ఇవన్నీ District Boards కు ఉండే టటువంటి లోటును పూర్తి చేయగలవా అనే విషయాన్ని కూడా మంత్రి గారు సెలవివ్వ లేదు. దీని పరిణామం బహుశః పంచాయితీలకు వచ్చిన లాభం పోవచ్చునే కాని District Boards కు దీని వల్ల విశేషం లాభం లేదని నాకు తోస్తున్నది. కాబట్టి District Boardsల యొక్క రాబడి వృద్ధి చేయడానికి ఈ మార్గం అంత ఫలవంత మైనది కాదేమోనని నా మనస్సుకు తోస్తున్నది. కాబట్టి పంచాయితీ యొక్క వరుబడి తగ్గించడం మంచిది కాదని నా అభిప్రాయం

SRI PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా ! ముఖ్యంగా ఈ బిల్లు అసలే అధ్వాన్నస్థితిలోయున్న పంచాయితీబోర్డులను ఇంకా అధ్వాన్నస్థితి లోనికి నెట్టడానికి ఉపయోగపడుతుంది తప్ప, జిల్లాబోర్డులను ఏదో ఉద్ధరించడానికి ఉపయోగపడుతుందనే విశ్వాసం కూడా నాకులేదు. పంచాయితీలు ఏ విధంగా ఆదాయంలేక డబ్బుకోసం ఎన్ని అవస్థలు పడుతున్నారో మనం చూస్తూనేయున్నాం. ఏ పనికి పూనుకుని చెయ్యాలన్నప్పటికీ డబ్బులేక ఆపివేయడం, జాగుచెయ్యడం, ఇవ్వన్నీ ఎట్లా జరుగుతున్నాయో కూడా మనం చూస్తూనే ఉన్నాం. ఆవచ్చేటటువంటి దాంట్లోంచి తీసుకుపోయి, ఇంకా వాటి ఆదాయాన్ని తగ్గించడానికి పూనుకున్నట్లయితే ఏ విధంగా పంచాయితీలు పనిచేస్తాయి. ప్రభుత్వం తనకిప్పుడు ఆదాయం తగ్గిందని పంచాయితీలనుంచి కొంతభాగం తీసుకోడానికి ప్రయత్నించి ఇన్ని వేల పంచాయితీల నుంచి ఏ వందో, రెండువందలో, మూడువందలో పంచాయితీ ఒక్క తీసుకుంటే

రెండు మూడు కోట్ల రూపాయిలు ప్రభుత్వానికి వస్తుందనుకోవడం మంచిది కాదు. జిల్లా బోర్డులకు పంచాయితీ బోర్డుల ఆదాయంలోంచి ఇవ్వడం. ఒక ప్రక్క పంచాయితీలకు కొన్ని ముఖ్యమైన బాధ్యతలు వప్పగించి ఇంకా ఎక్కువ అధికారాలిచ్చి కార్యక్రమం నెరవేర్చడానికి పూను కోవాలని చెబుతూ వాటికి వచ్చే టటువంటి ఆదాయాన్ని తగ్గించడం ఎంత మాత్రం సమంజసంగా లేదు. క్రిందటి బిల్లు మీద మాట్లాడుతూ పంచాయితీల అభిప్రాయం Municipal Councils యొక్క అభిప్రాయం ఎల్లా ఉంటుందో అట్లా తూచా తప్పకుండా నడుస్తానని మంత్రిగారు ఒక తడవ చెప్పారు. ఈ నాడు రాష్ట్ర పంచాయితీల సంఘం ఉన్నది. పోనీ దానికైనా refer చేసి మీరు ఇవ్వగలరా అని, ఎంత వరకు ఇవ్వ గలరని అడిగి, వారి సాధక బాధకాలు తెలుసుకుని ఏదైనా నిర్ణయానికి వస్తే బాగుంటుందే కాని, ఈ నాడు వెంటనే ఇంత తొందరపడి ఈ బిల్లు తీసుకు రావడం మంచిది కాదని మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను. ప్రజా ప్రతినిధులతో కూడిన జిల్లా బోర్డులను ఇంత వరకూ ఏర్పాటు చేసుకోలేదు. అవి ఏర్పాటు చేసుకోడానికి ఎంత కాలం పడుతుందో మనకేమీ తెలియదు. అల్లాంటప్పుడు ఈ బిల్లును కనీసం వారి అభిప్రాయాలు తెలుసుకోడానికైనా పంపిస్తే బాగుంటుంది. లేకపోతే పంచాయితీలు మరీఅధ్వాన్నమైన పరిస్థితిలోకి పోతాయి. జిల్లా బోర్డులూ చెడిపోయి, పంచాయితీ బోర్డులూ చెడిపోయి ప్రభుత్వం దగ్గర డబ్బు లేక చెడిపోయిన వాటిని చెడి పోయినట్లే ఉండ మని వదలి వెయ్యడం మాత్రమే జరుగుతుంది కాని అంత కంటే ఏవిధంగానూ ఉపయోగపడదు. చంద్రమౌళి గారు పంచాయితీ చట్టాన్ని తీసుకువచ్చి గ్రామగ్రామాలకు పంచాయితీలు స్థాపించడానికి పూను కున్నది, ఉన్నటువంటి పంచాయితీలను లేకుండా చేయడానికి కాదను కుంటాను. జిల్లా బోర్డులకు డబ్బు కావాలంటే, జిల్లా బోర్డులు నిర్వహించే టటువంటి కార్యక్రమాలను దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వం ఇవ్వడమో, లేకపోతే మరోవిధంగా చెయ్యడమో జరగాలి కాని పంచాయితీల దగ్గర నుంచి తీసుకుని, ఇంకొకళ్ళ డబ్బు మేము దానం చేస్తామనే విధంగా చేయడం ఏమాత్రం సక్రమంగా లేదు. ఈ బిల్లు ఏమాత్రం సక్రమంగా లేదనీ, దీన్ని అంగీకరించ జాలమని స్పష్టం చేస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా! ఈనాడు జిల్లా బోర్డులు అవి చేయవలసిన విధులు సరిగా నెరవేర్చ లేక పోతున్నాయి, కనుక దీనికి పంచాయితీ బోర్డుల డబ్బు తీసుకోవడం మార్గం కాదు. ఈవేళ జిల్లా బోర్డులకు సంబంధించిన resolution ఏదీరాలేదు కనుక దానికి ఉపాయం ఎట్లాగని ఆలోచించి ఈ తీర్మానం పెట్టడ మైంది. ఈ నాడు జిల్లా బోర్డులను ఎల్లా feed చేస్తాం అని ఆలోచించ కుండా ఉండేటట్లయితే చాలా ప్రమాదం. పంచాయితీలకు కట్జూగారి అధ్యక్షత క్రింద ఒక సమావేశం

ఏర్పరచారు. ఆ తరువాత Local Boards Ministers అంతా సమావేశమై కొన్ని ప్రాతి పదికలు తీసుకు వచ్చారు. వాళ్ళకు ఇప్పుడు ఇస్తూ యున్నటువంటి డబ్బు ఏమీ ముట్టుకో కుండా పూర్తిగా వాళ్ళకు ఇవ్వమని నా అభిప్రాయం. మనం ఆసుపత్రులు కావా లంటున్నాం. దానికి ప్రతి తడవా గవర్న మెంటు దగ్గరకు వస్తున్నాం. ఇతర రాష్ట్రాలలో $12\frac{1}{2}\%$, లేక $10\%$ తగ్గ కుండా పంచాయితీ బోర్డులకు ఇవ్వవలసిన డబ్బు land revenue నుంచి వాళ్ళకు ఇచ్చేస్తున్నారు. తరువాత పావలాకి తగ్గ కుండా ఇతర రాష్ట్రాలలో ఇవ్వటానికి ప్రయత్నం జరుగు తున్నది. దాన్ని గురించి కేంద్ర ప్రభుత్వం కూడా ఇప్పుడు వేసిన సంఘంవారి report లో clear గా చెబుతున్నారు. మనం ఆవైపు ఆలోచించ కుండా పంచాయితీల డబ్బుంది కనుక దాన్ని లాగుదాం అంటున్నారు. District Board ల విషయం శాసన సభ ఎదుటకు రావడంలేదు. స్థానిక పరిపాలనలో, ప్రజాపరిపాలనలో పంచాయితీ బోర్డులకు కూడా జిల్లా బోర్డులతో పాటు సమాన స్థానం వచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందా అని అడగ డానికే నేను ఈ సవరణ తెచ్చాను. నా amendment గ్రామ పంచాయితీలకు ఇచ్చే డబ్బులోనుంచి తీయవలెనని కాదు. వీరు తక్కిన వాటికి tax వేయమని చెప్పేసి ఇపుడు taxation enquiry కమిటీ వేశారు. ఆ కమిటీ రాష్ట్ర ప్రభుత్వాలు వెంటనే శాసనాలు చేసో లేక మరి ఏవిధంగా నైనాసరే, జిల్లా బోర్డులకు అదనంగా ఆదాయం వచ్చేటట్లు చూపమన్నారు. తరువాత local scheme ఒకటి. Central Government ఒక కమిటీ వేసింది. వాండ్లు కూడ 3 సంవత్సరాల క్రింద విచారించి ఈ purposes క్రింద ఇండియా గవర్నమెంటు చట్టములో ఉన్నటువంటి రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన హక్కులలో కొన్ని పనులు వాండ్లకు ఇచ్చేసి, జిల్లా బోర్డులను స్వయం సమృద్ధంగా చేయడానికి ప్రయత్నించండి అని చెప్పారు. ఆవిధంగా ఎందుకు తీసుకొని రావడం లేదని అడగడమే నా ప్రధానమైన point. అందు వల్ల నేను మనవి చేస్తున్నది పంచాయితీ బోర్డు డబ్బు తీసుకోవడం కాదు, జిల్లా బోర్డులకు కావలసిన వాటికి ఈ రాష్ట్ర ప్రభుత్వ నుంచి ఎక్కువ డబ్బు ఇచ్చేందుకు కావలసిన ప్రాతి పదికలు తీసుకొని రండి. అవి తీసుకొని రాకుండా జిల్లా బోర్డుల administration గురించి మనము అసలు ఏమి చర్చచేయకుండా వదలి పెట్టాము. ఈ time వచ్చే టప్పటికి దీనిని మాత్రం తీసుకొని రావడం, జరుగుతోంది. అందులో జిల్లా బోర్డులను ఎన్నికల ద్వారా నడపడమే కాకుండా, వాటి ఆర్థిక విధానాన్ని బలపరచే విధంగాను, మనము కావలసిన స్కీమును వెంటనే తీసుకొని

రాకటానికి ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ దానికి కావలసిన proposals తీసుకొని రమ్మని కోరుతూ, పంచాయితీల హక్కులు ఇంకా ఎక్కువ చేయాల్సిందే, కాని పంచాయితీలతో పాటు జిల్లా బోర్డులు కూడా ఉండవలెనని మాత్రం మరచిపో వద్దని చెప్పి విరమిస్తున్నాను.

SRI P. SATYANARAYANA :— అధ్యక్షా, ఈనాడు spirit అంతా పంచాయితీ రాజ్యంవైపు, decentralisation వైపు మొగ్గి ఉన్నది. ఈ సమయంలో పంచాయితీల యొక్క ఆదాయాన్ని అభివృద్ధి చేసే సూచనలకు వచ్చేటటువంటి సమర్థన, దానికి వ్యతిరేకమైనటువంటి ప్రతిపాదనలకు సాధారణముగరాదు. కాని ఈ ప్రతిపాదనమాత్రం దానికి చాల వ్యతిరేకంగా ఉంటూఉన్నది. Budget సమావేశంలోగాని, గత 2, 3 రోజులనుంచిగాని జరిగినటువంటి చర్చలలో జిల్లా బోర్డుల యొక్క పరిస్థితిమీద అప్పుడప్పుడు కాస్త చర్చవచ్చింది. అందులో జిల్లాబోర్డులవారు చాల సంకుచితమైన దృష్టితో, చాలా తాత్కాలికమైనటువంటి పార్టీ దృష్టితో, దూరదృష్టి ఏ మాత్రం లేకుండా, recurring expenditure ఏ మాత్రం అవుతుందో ఆలోచించకుండా, అనవసరమైన బాధ్యతలను నెత్తిమీద పెట్టుకొని, తమ స్థితిని పాడుచేసుకొని, ప్రజల స్థితిని పాడుచేసి, ప్రభుత్వ స్థితిని పాడుచేసి, ఈ రకమైనటువంటి పనులు చేసినట్లుగా ఈ శాసనసభలో అనేకమార్లు విమర్శనలు కూడా వచ్చినవి. అన్ని పార్టీలవారు ఆ విషయాన్ని అంగీకరించారు. ఇప్పుడు ఆ తప్పులకు శిక్ష పంచాయితీల మీద వేస్తున్నారా అని అనిపిస్తున్నది. బాధ్యతా రహితంగా, దూరదృష్టి లేనటువంటి కార్యక్రమాన్ని అవలంబించి, ఆరకంగా చేసినటువంటి తప్పుడు పనులు కాకపోయినా చేసిన తప్పులకు శిక్షమాత్రం ఇపుడు పంచాయితీల మీద వేస్తున్నట్లుగా కనిపిస్తున్నది. ఇది ఎంతమాత్రం సమంజసంకాదు. తరువాత ఈ District Board ల వ్యవహారాలను గురించి చర్చవచ్చినపుడు మా విధానాన్ని ఇంచు మించుగా అన్ని పార్టీలు సమిష్టిగ అంగీకరించినట్లు బోధపడుతుంది. ఏమిటంటే, రోడ్లు క్రమంగా ఎక్కువగా స్టేటు తీసుకోవాలి. సాధ్యమైనంత ఎక్కువగా District roads ను State తీసుకోవలెను. Hospitals లో కూడ ఇకమీద ఎక్కువ వాటిని స్టేటు తీసుకొనవలెను. District Board పరమైన సంస్థలను క్రమక్రమంగా ప్రజాశ్రేయస్సు దృష్టితో సక్రమపరిపాలనా దృష్టితో, efficiency దృష్టితో State పరం కావలెననేటటువంటి ఒక ధోరణిని మనము ప్రవేశపెట్టుతూ ఉన్నపుడు, ఇపుడు ఈ భారాన్ని వారు చేసిన తప్పుల భారాన్ని, పంచాయితీ బోర్డుల మీద వేసేబదులు అక్కడ నిజంగా ఏదైనా తప్పులు జరిగినట్లయితే దిద్దుకో దానికి ఆ భారాన్ని State మీద వేయడం మంచిదికాని, పంచాయితీ బోర్డులమీద విసరడం ఏ మాత్రం న్యాయమైన పాలిసీ కాదు. చాల చాల కొత్త పన్నులు వేశా

తరువాత సెంటరునుంచి అనేకరకములైటువంటి గ్రాంటులు రాబోతూ ఉన్నాయి. పంచవర్ష ప్రణాళిక అనే పేరుతో ఏవో కొన్ని పనులు చేయబోతున్నాము. పెద్దపెద్ద funds రాబోతున్నవి. ఈ భారాన్ని ఇపుడు ఈ సమయంలో పంచాయితీ బోర్డులమీద విసరకుండా స్టేటే భరించడం న్యాయమైన పాలిసీ అవుతుందని మాత్రం మనవి చేస్తున్నాను.

SRI L. LAKSHMANADAS:—అధ్యక్షా ! ఈనాడు తీసుకొని వస్తున్న amendment విషయంలో కొంచెము అందరు దీర్ఘంగా ఆలోచించవలెనని కోరుతున్నాను. మనము ultimate గ చేయువలసింది పంచాయితీ రాజ్యము. పంచాయితీలకు రాబడి అధికము చేయడానికే ప్రతి ఒక్కరు కూడ ప్రయత్నం చేయాలి. మన ప్రక్కన ఉండే ఒరిస్సా రాష్ట్రములోవారు కూడ పంచాయితీ రాజ్యం కోసం చాలా సక్రమమైన మార్గాలలో బిల్లు తీసుకొచ్చారు. Discuss చేస్తున్నారు. అన్ని అధికారాలు పంచాయితీలకే, పంచాయితీ area లకే ఇస్తున్నారు. మనము కూడ మొట్ట మొదట హిందూదేశంలో—ఆంధ్రరాష్ట్రం అను కొంటాను— పంచాయితీ రాజ్యస్థాపనకు పంచాయితీ శాసనము తీసుకొని వచ్చాము. దానిలో land cess 100 కి 12½ చొప్పున పంచాయితీకి వెళ్లవలెననే తలంపుతోనే మనం ఆనాడు ప్రయత్నం చేశాం. బిల్లులో ఈ నాడు కూడ ఉంది. ఐతే పంచాయితీలకు ఇంతవరకు ఆ డబ్బును కేటా యించడంలేదు. ఈ నాడు ఈ పన్నుకూడా పంచాయితీలకు సక్రమంగా వస్తున్నది. అందులో కొంత భాగము మళ్లీ జిల్లాబోర్డులకు ఇవ్వడం అనే విషయం వస్తూఉన్నపుడు, పంచాయితీల రాబడి చాలా తగ్గుతుంది. క్రమేణ ఈ hospitals అయితే నేమి, schools అయితేనేమి, అన్ని పంచాయితీలకు అప్పచెప్ప వలసిన పరిస్థితు లలో, పంచాయితీ తాలూకు రాబడిని మనము తగ్గించేటట్లయితే, పంచాయితీలు బల హీనమై, ప్రజలు నిరుత్సాహం చెందడం జరుగుతుంది. అందుచేత మనము సమగ్రంగా విషయాలు చర్చించుకొని పంచాయితీకి ఏ విధంగా రాబడి అధికం చేసుకోవాలి? పంచాయితీలలోనే, పంచాయితీ area లకు కావలసిన కార్యక్రమాన్ని ఆ పంచాయితీ ద్వారా జరిపించడం అనే ప్రధానమైన సూత్రము పైన మనము రేపు నడుప బోయ్యే రాజ్యంలో పంచాయితీలకు ఉన్న ఆదాయాన్ని తగ్గించడానికి ప్రయత్నం చేయడం అది కొంచెం పంచాయితీలను నిరుత్సాహ పరచిన వాళ్లమము అవుతామని నా మట్టుకు నాకే భయం వేస్తున్నది. ఈ విషయంలో ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచించి ఏ విధంగా, ఈ పంచాయితీలను అభివృద్ధి చేస్తాం అనేది చూసుకోవాలిగాని, జిల్లాబోర్డుల విషయంలో జిల్లాబోర్డు విషయాలు జిల్లాబోర్డు లకు ఇవ్వాలని, ఈ నాడు మనము పెట్టుకొన్న ఈ జిల్లాబోర్డు, ఈ వేళ కాకపోయినా, రేపైనా పోవలసిందే అని, పంచాయితీ రాజ్య స్థాపనకు మనము ఇపుడు, మధ్యన ఉన్న జిల్లా బోర్డులను గురించి, పూనుకొనే టప్పుడు, అక్షేపాపత్రయ పడవలసిన అవసరంలేదు.

అందుచేత ప్రభుత్వం ఈ విషయంలో సక్రమంగా ఆలోచించి ఆ విధంగా అభివృద్ధి చేయవలెను. ఏవిధంగా మనము ఆర్థికాభివృద్ధిని పెంపొందించవలెనో, ఆలోచించవలెను. పంచాయితీ ద్వారానే అక్కడ ఉన్న కార్య క్రమాలను సాధించుకోవాలనే విషయంలో, అక్కడ ఉన్న పంచాయితీ మెంబర్సుకి, ప్రజలకు, ఒక విధంగా ప్రోత్సాహం కలిగించేటట్లు చూడడం మనధర్మం అని, మంచిదని చెబుతూ నేను ప్రభుత్వానికి సలహా ఇస్తున్నాను. అందుచేత. ఈసూచనపట్ల కొంచెం ఆలోచించుకొనవలెనని చెబుతూ విరమిస్తున్నాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO :— అధ్యక్షా, లక్ష్మణదాసు గారు మాట్లాడుతూ జిల్లాబోర్డులు ఉండడానికి వీలులేదన్నట్లుగా మాట్లాడారు. కాని జిల్లాబోర్డులు ఉండకూడదని ఇంతవరకు ఈ ప్రభుత్వము ఎక్కడా చెప్పలేదు. వారి అభిప్రాయ మేమిటో.....

SRI L. LAKSHMANA DAS :— ఈ జిల్లాబోర్డులు రద్దుచేయడం మన ప్రభుత్వముయొక్క policy అని చెప్పలేదు. ఇపుడు కాకపోయినా, ఎప్పటికైనాసరే జిల్లా బోర్డులు తీసివేస్తారుకదా, పంచాయితీ బోర్డు స్థాపనలో వాటికి స్థానముండదని చెప్పాను.

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ప్రతి పక్ష సభ్యులు కానివ్వండి, గౌరవసభ్యులు కానివ్వండి, ప్రత్యేకంగా పంచాయితీకి వచ్చేడబ్బు తగ్గుతుందని అంటున్నారు. కాని అందరిని ఒక విషయం ఆలోచించమని కోరుతున్నాను. ఇప్పుడు మామూలుగా పంచాయితీలు లేని ఊర్లలో నూటికి అయిదు రూపాయలచొప్పున surcharge on transfer of property వసూలు చేస్తున్నాము. క్రమేపి మనం పంచాయితీలను ఎక్కువచేయాలని అంటున్నాము. ఒకటి రెండు నెలలలోనే నాలుగైదు పంచాయితీలు చేస్తాము. అప్పుడు ఆ నాలుగు ఊర్లమీద నూటికి అయిదు రూపాయల చొప్పున జిల్లాబోర్డులకు రావలసినదానిలో మూడు రూపాయల చొప్పున పంచాయితీకి ఇవ్వబడుతుంది. జిల్లాబోర్డులకు రావలసిన దాంట్లో ఆ విధముగా మూడు రూపాయలు పంచాయితీలకు వదలివేసి 2 రూపాయలే పుచ్చుకొంటారు. ఇపుడు జిల్లాబోర్డుకు రావలసిన డబ్బులో నూటికి ఒకరూపాయి తగ్గుతుంది. కాని క్రమేపి పంచాయితీలుఅభివృద్ధిఅయ్యేకొద్ది, జిల్లాబోర్డులకు రావలసినదాంట్లో నూటికి రెండు రూపాయలు చొప్పున తగ్గుతుంది. ఇంకా పంచాయితీలు అభివృద్ధి అయ్యేకొద్ది ఆర్థికంగా జిల్లాబోర్డులు వెనుకబడుతాయి. ఈ జిల్లాబోర్డు రోడ్లు hopitals ఇవన్నీ వెనుకబడవలసి యుంటుంది. ముఖ్యంగా ఈ జిల్లాబోర్డు రోడ్లు, Maternity centres, elementary schools, secondary schools, child welfare centres, rural dispensaries, ఇవన్నీకూడ పంచాయితీ

బోర్డే పోషించడంలేదు. ఈ పంచాయితీలో ఉన్నటువంటి సంస్థలన్నిటినీ పోషించ వలసిన బాధ్యత జిల్లాబోర్డుమీద ఉన్నది. అందుచేతనే ప్రభుత్వము దీనిని దీర్ఘంగా ఆలోచించే వాటివద్ద నూటికి 4 రూపాయలు వసూలు చేస్తుంది. ఆ విధంగా నూటికి ఒక్క రూపాయ తగ్గినందువలన వాటికి (పంచాయితీలకు) అట్టే నష్టం కన్పడదు గాని ఈ ఒక్క రూపాయ కలుపుటవల్ల అది పంచాయితీల మీద ఇచ్చినదానివల్ల, జిల్లా బోర్డులకు ఎక్కువ ఆదాయము కలుగుతుంది. జిల్లాబోర్డుల్లో ఏ వేవో తప్పులు చేస్తున్నారని అన్నారు. అది ఇప్పుడుగాదు, మరల జిల్లాబోర్డుల సమస్య వచ్చినపుడు, దాన్ని అందరిముందు పెడతాము. అప్పుడు విమర్శించవచ్చు—కాని ఈ వేళమాత్రము ఈ జిల్లా బోర్డులు ఏ స్థితిలో ఉన్నాయో గమనించమంటున్నాను. నాగిరెడ్డిగారినే అడుగుతాను, వాళ్ల జిల్లాబోర్డు ఏ విధంగా ఉండేది. అసలు రోడ్లేలేవని వారు చెప్పారు. వారి జిల్లాలోనేకాదు, ఆ విధంగా ఉండడం. ప్రతి జిల్లాలోను అదేవిధంగా ఉంది. ఏదో 1, 2 జిల్లాబోర్డులు తప్ప తక్కిన జిల్లాబోర్డులన్నీ ఈ విధంగానే ఉంటున్నాయి. జిల్లా బోర్డులు ఎత్తివేసేటప్పటికి, ఉపాధ్యాయుల జీతాలు కానివ్వండి, కంట్రాక్టర్ల బిల్లులు గానివ్వండి, వీటన్నిటికి సుమారు 60 లక్షలు రూపాయలు ప్రభుత్వమునుంచి advance ఆ బాకీలన్నీ తీర్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. అంటే దీనివల్ల ఆ బాకీలు తీరుతాయా అంటారేమో. జిల్లాబోర్డుల ఆదాయాలను investigate చేయడానికి వేసిన ఆఫీసర్లు సూచించిన దాంట్లో ఇది ఒక విధానము. దాని వ్యవస్థ improve చేయడానికి ఇంకా ఇతర విధానాలను ప్రభుత్వము ఆలోచిస్తున్నది. అంతేగాని పంచాయితీరాజ్యాన్ని నిరోధకం చేసే అభిప్రాయం ఏమిలేదు. కాని వారికిఒకటే మనవి చేస్తున్నాను. మామూలుగాపంచాయితీలలో నూటికి రెండు అణాలు మొదలు, ఎనిమిది అణాల వరకు capital value మీద పన్ను వేసే బాధ్యత ఉన్నది. కాని బాగా rich people ఉన్న villages లో కూడ నూటికి రెండు అణాలే వేస్తున్నారు. నాగిరెడ్డి గారిని అడుగుతున్నాను, వారు గుండె మీద చేయి వేసుకొని చెప్పమని. నూటికి ఆరు అణాలు వసూలు చేయడానికి హక్కు ఉన్నటువంటి ఊర్లలో నూటికి రెండు అణాలు మాత్రం వేసి ఎందుకు వసూలు చేస్తున్నారని అడుగుతున్నాను. అటువంటి ఊర్లలో డబ్బు ఎక్కువ వేసి ఆర్థిక విధానాన్ని ఎందుకు పెంపొందించ కూడదని అడుగుతున్నాను. కనుక, జిల్లా బోర్డులేవో ప్రభుత్వానికి చుట్టాలయి నట్లును పంచాయితీలు చుట్టాలు కానట్లును సభ్యులు మాట్లాడడం సరికాదు. ఏదైనా కానివ్వండి, మునిసిపాలిటీలైనా, పంచాయితీలైనా లేక జిల్లా బోర్డులయినా, ఇవన్నీ కూడ ప్రభుత్వమునకు సంబంధించినవే. ఒకరు సవతి పిల్లలని, ఒకరు మంచి పిల్లలని ప్రభుత్వానికి లేదు. అన్నిటిని సక్రమముగా నడిపించాలనే ప్రభుత్వము యొక్క అభిప్రాయము. కాబట్టి దయచేసి దీన్ని అంగీకరించవలసిందని సభ్యులందరిని ప్రార్థిస్తున్నాను.

MR. SPEAKER :— I now put the amendment of Sri S. Vemayya to the House.

In sub-clause 2 (a, For the words "three-fifths" substitute in sub-clause the words "four-fifths"

AND

In sub-clause 2 (b) for the words "two-fifths" substitute the word "one-fifth".

The amendment was put and lost.

Clause 2, was put and carried.

MR. SPEAKER:—The next clause is clause 3. It does not require any discussion, as it is consequential.

Now I put the amendment of Sri S. Vemayya.

SRI S. VEMAYYA :— As clause 2 was already coverd, it does not arise

MR. SPEAKER :— Mr. Gopalakrishnayya is not here. I now put clause 3.

Clause 3 was put and carried

Clause 1 was put and carried

The preamble was put and carried

THE HON SRI A. B. NAGESWARA RAO :— Mr. Speaker, Sir, I beg to move—

"That the Madras Village Panchayats (Andhra Amendment Bill, 1955 be passed into Law".

MR. SPEAKER :— Motion moved.

"That the Madras Village Panchayats (Andhra Amendment Bill, 1955 be passed into Law".

SRI S. VEMAYYA :— అధ్యక్షా, ఈ బిల్లు చూడడానికి చాలా చిన్నబిల్లు, దీనిలో ఏమీ లేదని మొదట్లో అనుకొన్నాము. కాని నిజంగా అట్లులేదు. నాకిక్కడ ఒక సామెత జ్ఞాపకమునకు వస్తున్నది. "నీవు పెట్టకపోతే పెట్టక పోయినావు నీ కుక్కనైనా కట్టేసుకోడం మంచిది" అని అంటారు. ఆ విధంగా ఉంది ఈ వ్యవహారము. లోగడ పంచాయితీబోర్డులకు నూటికి 12½ వంతు ఇస్తామని చెప్పుతూఉంటే, ఈరోజు పంచాయితీబోర్డులకు ఉన్న ఆదాయాన్ని జిల్లాబోర్డులకు అప్పచెప్పడం అంత సమంజసంగాలేదనే విషయం ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాను. జిల్లాబోర్డులు రోజు

రోజుకు అధ్వాన్నం అయిపోతున్నాయని చెప్పారు. కాని జిల్లాబోర్డులలో ఎక్కడెక్కడ ఎంతెంత డబ్బు, వృధాగా ప్రభుత్వ ఉత్తరువు లేకుండానే ఖర్చుపెడుతున్నటువంటి విషయాలలో ప్రభుత్వము ఏమైన చర్య తీసుకొంటున్నదా? అటువంటిదేమి మంత్రిగారు చెప్పలేదు. అంతేకాకుండా ఇప్పుడు ఈ పంచాయితీ బోర్డులు చాలా ఉదారంగా ఉన్నాయి. ఈ మధ్యన planning విషయం వచ్చినప్పుడు one-fourth ఇవ్వవలసిందంటే అన్ని పంచాయితీ బోర్డులు ఉదారంగా ఇచ్చాయి. దరిమిలా one-third ఇవ్వవచ్చు అంటె, కొన్నిపంచాయితీలు ముందుకు వచ్చాయి. కనుక వారి గ్రామాన్ని అభివృద్ధి చేసుకోడానికిగాను డబ్బు ఇవ్వడం జరుగుతున్నది. కాని ఈ జిల్లా బోర్డులకు పోయిన డబ్బు మళ్లీ పంచాయితీబోర్డులకు ఎప్పుడైనా వస్తుందా అని అడుగుతున్నాను. ఏ విధంగా ఇప్పుడు జిల్లాబోర్డులకు డబ్బు తక్కువపడి నప్పుడు పంచాయితీ బోర్డులు ఉదారంగా ఇస్తున్నాయో అదే విధంగానే పంచాయితీబోర్డులకు కావలసి వచ్చినప్పుడు జిల్లాబోర్డులు ఇస్తాయా అని ప్రశ్నిస్తున్నాను. ఇస్తారని నాకు నమ్మకం లేదు. సముద్రంలో పడిపోయిన విధముగా ఆ డబ్బు మరల రావడానికి వీలుండదు. అంతేకాదు. ఇప్పుడు ప్రభుత్వ విధానం చూస్తే తాలూకా headquarters లో ఉండే L. F. hospitals ను provincialise చేస్తున్నారు. అలాంటప్పుడు, జిల్లా బోర్డులకు ఆ ఖర్చు ఆ బాధ్యత తగ్గిపోవటం, అది ప్రభుత్వం మీద పడడం జరుగుతుంది. Schools విషయంలో కూడ, కొన్ని schools ను ప్రభుత్వంతీసుకొని భరించేటప్పుడు జిల్లా బోర్డులకు ఆ ఖర్చుతగ్గిపోతుంది. అలాంటప్పుడు, జిల్లాబోర్డులు అధ్వాన్నంగా ఉన్నాయనే కారణం తోటి పంచాయితీ బోర్డులకు ఉన్నటువంటి అధికారాన్ని, ఆదాయాన్ని జిల్లా బోర్డులకు అప్పజెప్పడం అంత సమంజసంగా లేదని ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నాను. ముఖ్యంగా ఈ జిల్లా బోర్డులలో డబ్బు అంతా దుబారాగా ఖర్చు పెట్టడం జరుగుతుందనే విషయం గురించి విచారణ చేస్తున్నాము అని బడ్జెట్ సమావేశములో చెప్పినట్లు నాకు జ్ఞాపకమున్నది, if I remember corrct. కాని, దుబారా ఎక్కడెక్కడ ఎంత జరిగింది, ఏ విధంగా జరిగింది, వాటిని గురించి ఎలాంటి విచారణ చేశారు, ఈ విషయాలేమి చెప్పలేదు. ఇక్కడ మాకు original clauses అంద జేయలేదు. ఈ 77, 60 original clauses మాముందు పెట్టి ఉంటే కొన్ని సూచనలు ఇవ్వడానికి వీలుగా ఉండేది. అవి లేనందువల్ల ఇబ్బందిగా ఉన్నది. కాబట్టి తప్పకుండా ఈ rules చేసే టప్పుడైనా, ఈ పంచాయితీ బోర్డుల నుంచి జిల్లా బోర్డులకు డబ్బు తీసుకొనే టప్పుడు, మరల ఎప్పుడైనా పంచాయితీబోర్డులకు అవసరం వచ్చి నప్పుడు, vice versaగా మరల ఈ డబ్బు మార్చు కోడానికి ఈ rules లో provision కలుగ జేయ వలసిందని మంత్రి గారిని కోరుతూ విరమిస్తున్నాను.

[26th September, 1955

THE HON. SRI A. B. NAGESWARA RAO :— వేమయ్య గారు జిల్లా బోర్డులు సంగతే మాట్లాడారు. ఇది పంచాయితీ బోర్డులకు సంబంధించింది. జిల్లా బోర్డుల వ్యవహారం వచ్చినప్పుడు, ఆ వివరాలు చర్చించుకోవచ్చును.

SRI R. B. RAMAKRISHNA RAJU :— ఈ పంచాయితీల పంపకం వల్ల జిల్లా బోర్డులకు ఎంత ఆదాయం వస్తుందో చెప్ప గలరా !

THE HON. SRI A. B. NAGESWARA RAO :— Calculate చేయు లేదండి. మీకు కావాలంటే కొద్ది రోజులలో వివరాలు పంపిస్తాను.

MR. SPEAKER :— The question is :

"That the Madras Village Panchayats (Andhra Amendment) Bill, 1955 be passed into law"

The motion was carried and the Bill was passed into law.

MR. SPEAKER :— The House will now adjourn and meet again at 11 A. M. tomorrow, 27 th September, 1955.

The House then adjourned.

# APPENDIX I

REVENUE DEPARTMENT.

## STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE.

[*VIDE*—LEGISLATIVE ASSEMBLY STARRED QUESTION No. 831 OF SRI V. VISWESWARA RAO.]

*Payment of cane price according to 'SISMA' Formula* 1952-53.

| Factory | Extra price payable per ton to cane suppliers according to SISMA Formula. | Balance of amount still payable to cane suppliers according to SISMA Formula. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | RS. A. P. | RS. A. P. |
| 1. Sree Rama Sugars, Limited, Bobbili ... ... ... | 2 3 4 | 439 15 0 |
| 2. Sree Rama Sugars, Limited, Seethanagaram. ... | ... | 3,474 11 0 |
| 3. Etikoppaka Sugar Factory No. I | 1 13 0 | 76 3 11 (for 3 and 4) |
| 4. Etikoppaka Sugar Factory No. II, Darlapudi. | 5 9 9 | |
| 5. Kirlampudi Sugars, Limited, Pithapuram ... ... | 4 3 4 | Nill. * |
| 6. Deccan Sugars and Abkari Company, Limited, Samalkot | 6 7 1 | Nil. * |
| 7. Andhra Sugars, Limited, Tanuku | ... | ... † |
| 8. Vizagaptam Sugars and Refinery, Limited, Thummapala ... ... | ... | ... † |
| 9. K.C.P. Limited, Vuyyur ... ... | 7 12 10 | 1,694 15 5 |

* No amount is alleged due to the cane growers.

† They have declined to adopt the SISMA Formula.

*Payment of cane price according to 'SISMA' Formula in* 1953-54.

| Factory. | Extra price payable to cane suppliers according to SISMA Formula. | Balance of amount still payable to cane suppliers according to SISMA Formula. |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | RS. | RS. |
| 1. Sree Rama Sugars, Limited, Bobbili ... ... | 1,75,424 6 5 | 1,75,424 6 5 * |
| 2. Sree Rama Sugars, Limited, Seethanagaram ... ... | 1,84,502 5 4 | 1,84,502 5 4 |
| 3. Etikoppaka Darlapudi Sugar Factory .. ... | 3,00,491 0 0 | 3,00,491 0 0 |
| 4. Kirlampudi Sugar Mills, Pithapuram ... ... | 1,04,273 9 0 | 60,753 5 9 |
| 5. Deccan Sugars and Abkari, Limited, Samalkot. ... | 66,561 1 0 | ... |
| 6. Andhra Sugars, Limited, Tanuku ... ... | 2,23,923 0 0 | 2,23,923 0 0 |
| 7. Vizagapatam Sugars and Refinery, Limited, Thummapala | 42,630 1 11 | 42,630 1 11 |
| 8. K.C.P. Limited, Vuyyur ... | 5,36,383 1 7 | 5,36,383 1 7 |

* None of the factories except Deccan Sugars and Abkari, Limited, Samalkot and Kirlampudi Sugar Mills, Pithapuram agreed to make any extra payments according to the 'SISMA' Formula.